# నవనవలా తరంగం .. వందేళ్ల సంరంభం






















ఉన్నవ లక్ష్మీనారాయణ రచించిన మాలపల్లి నవలకు ఇది వందేళ్ల సందర్భం.
ఈ నవల మొదటిసారి 1922లో ప్రచురితమైంది. ఆ తరువాత అనేకసార్లు పునర్ముద్రణలు పొందింది.
సంక్షిప్త నవలగా వెలువడింది. నాటకంగా మారి, అలరించింది. వివిధ భాషల్లోకి అనువాదం అయింది.
ఇవి ఇన్నేళ్లుగా వెలువడ్డ ప్రచురణల్లో కొన్ని టైటిళ్లు. గడచిన చరిత్రకు ఆనవాళ్లు.

KRSA102M336

సాహిత్య ప్రస్థానం

డిసెంబరు 2021, జనవరి 2022

సంపాదకీయం

# వందేళ్ల మాలపల్లి.. వేయి సందేశాలు



తెలకపల్లి రవి

గతంలో గురజాడ, శ్రీశ్రీ, కుసుమ ధర్మన్న, పోతులూరి వీరబ్రహ్మం, వేమన వంటివారిపై ప్రత్యేక సంచికలు వెలువరించడం మీకు తెలుసు. ఇదేగాక స్వేచ్ఛాస్వరం, ప్రసిద్ధుల ప్రత్యేక సంచిక వంటివి ఉన్నాయి. కాని ఒక వందేళ్ల నవలపై ప్రస్థానం ప్రత్యేక సంచిక ఇదే ప్రథమం. ఈ సంచికలో ఏమైనా తప్పొప్పులను సహృదయంతో అర్థం చేసుకుంటారనీ, ఎప్పటిలాగే ఆదరిస్తారని ఆశిస్తున్నాం.

ఉన్నవ లక్ష్మీనారాయణ మాలపల్లి నవల నూరేళ్ల ప్రత్యేక సంచిక ప్రచురిస్తున్నందుకు చాలా సంతోషంగానూ, ఒకింత గర్వంగానూ కూడా వుంది. గతంలోనూ సందర్భోచితంగా అనేక ప్రత్యేక సంచికలు వెలువరించి మీ ఆదరణ పొందిన సాహిత్య ప్రస్థానం మాలపల్లి సంచికను మరింత ప్రత్యేకంగా భావించ దానికి కారణముంది. ఈ సంచిక సాహిత్యపరంగానూ, సామాజికంగానూ, రాజకీయంగానూ, చారిత్రికంగానూ అనితర సాధ్యమైన స్థానం పొందిన విలక్షణ తెలుగు వారసత్వాన్ని స్మరించుకొంటున్నది. సాహిత్యం సమాజానికి ప్రతిబింబమను కుంటే వందేళ్లనాటి భారతీయ సమాజంలో అన్ని కోణాలనూ వాస్తవికంగా ప్రామాణికంగా ప్రతిభావంతంగా ఆవిష్కరించిన నవల మాలపల్లి. నవలగానూ అంత సంపూర్ణ కథనాన్ని, అన్ని జీవిత పార్శ్వాల్ని అందించిన రచన అదే. ఒక రచయితకు వుండాల్సిన సంయమనం, సమగ్రత, పరిణతి, ప్రాతినిధ్య స్వభావం, విమర్శ, వాస్తవికత మేళవించిన దృష్టికోణం ... ఇవన్నీ నవల ద్వారానే ఉన్నవ ప్రదర్శించడం అత్యంత అరుదైన విశేషం. సమాజ గమనానికి చోదకశక్తులెవరు? పీడక శక్తులెవరు? రాజకీయంగా సామాజికంగా ప్రగతినిరోధక అమానవీయ శక్తులెవరు? ఉద్భవిస్తున్న నూతన శక్తులెవరు? వారు తీసుకొస్తున్న కొత్త ప్రశ్నలేమిటి? ఒక్క ముక్కలో చెప్పాలంటే.. 'ఎముకలు కుళ్లిన వయస్సు మళ్లిన సోమరులెవ్వరు? నెత్తురు నిండే శక్తులు మండే నవ సమాజ సైనికులెవ్వరు? ఆ శక్తుల రూపురేఖలు కళ్లకు కట్టడం, నాటి వారి పోరాటాలను ఆరాటాలనూ చిత్రించి రాబోయే కాలాన్ని వారెలా మార్చబోతున్నదీ దార్శనికంగా సూచించడం మాలపల్లి విశిష్టత. స్వాతంత్ర్య పోరాటం, సామ్యవాద చైతన్యం, అస్పృశ్యతా నిరోధం, స్త్రీల బాధావేదనలు నాలుగు చక్రాలుగా నడిచిన సాహిత్య రథం ఆయనది. ఇందులోని వైరుధ్యాలనూ వైషమ్యాలనూ వైరాగ్యమనిపించే సనాతన భావజాలాన్ని కూడా వదలిపెట్టక చూపడం ఆయనలోని రచయిత విషయ సంపన్నత, శిల్ప నైపుణ్యం కూడానని చెప్పాలి. ఈ విషయాలపై అరుదైన పలు పాత కొత్త విశ్లేషణలు ఈ సంచికలో ఉన్నాయి.

2

ఏ రచననైనా సరే, దేశ కాల పరిస్థితులను బట్టి బేరీజు

వేసుకోవాలి. స్మరించుకోవడానికీ అదే కొలబద్ధ. ఆ కోణంలోనే మాలపల్లి ఉన్నవ సమున్నత అక్షర సృష్టి మాత్రమే గాక అగ్రగామి కూడా అవుతుంది.

స్వాతంత్ర్య పోరాటం చూద్దామా అంటే గాంధీజీ అప్పుడప్పుడే నాయకత్వం చేపడుతున్నారు. దళితులపై పీడన, అణచివేతలను నిరసించే ఉద్యమాలు, కులపరమైన సమానత్వం కోసం కదలికలు మొదలవుతున్నాయి. వితంతు వివాహాలు, స్త్రీ విద్య వంటి సంస్కరణలు మొదలైనా స్త్రీలపట్ల సమాజం ఇంకా కరుడుగట్టిన పురుషాధిక్యతనే ప్రదర్శిస్తున్నది. శ్రమపరంగానూ, కులపరంగానూ, లైంగికంగానూ కూడా పెత్తందార్ల పైశాచికత్వం సాగుతోంది. అప్పటికింకా సుందరయ్యకు పదేళ్లు నిండలేదు. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో కొన్ని కార్మిక సంఘాలు మొదలయ్యాయి గాని ఇంకా కమ్యూనిస్టు ఉద్యమం ఆనలు వేసుకోలేదు. ఆ మాటకొస్తే సోవియట్ అక్టోబర్ విప్లవమే ఇంకా నిలదొక్కుకోడానికి అంతర్గత పోరాటంలో నిమగ్నమై వుంది. తాష్కెంట్‌లో ఎంఎన్‌రాయ్ వంటివారి భాగస్వామ్యంతో లెనిన్ ప్రత్యక్ష సూచనలతో భారత కమ్యూనిస్టు పార్టీ ఏర్పడి రెండేళ్లే అయింది. ప్రపంచంలో వలసవాద వ్యతిరేక ఉద్యమాలు అప్పుడే ఊపందుకుంటున్నాయి. ఆ మాటకొస్తే వలస దేశాల విముక్తి పోరాటానికి, సామ్యవాద ప్రస్థానానికి మధ్య గల సంబంధం బలంగా గుర్తించడం అప్పుడప్పుడే జరుగుతున్నది. రష్యాలో లెనిన్ వలసవాద వ్యతిరేక పోరాటం ఆవశ్యకత గురించి చెప్పింది ఎంఎన్‌రాయ్ పూర్తిగా జీర్ణం చేసుకోలేక పోతున్నారు. భారత స్వాతంత్ర పోరాటంలోనూ గాంధీజీ అశేష ప్రజలను కదిలించడానికి సామూహిక నిరసనతో పాటు తనదైన ఆధ్యాత్మిక, అహింసా మంత్రంతో సిద్ధమవుతున్నారు. వీటన్నిటినీ ఆకళింపు చేసుకుని అక్షర రూపం ఇవ్వడం ఉన్నవ మాలపల్లి మహత్తర విజయం. సంస్కరణోద్యమం, స్వాతంత్ర్యోద్యమం, సామ్యవాద భావజాలం మూడు పాయలు జమిలిగా చూపడం అప్పటికి అపూర్వం. అయితే ఇది కేవలం చారిత్రక పరిస్థితి ప్రతిబింబం మాత్రమే అందామా అంటే- దేశంలోనే అక్టోబర్ విప్లవ ప్రభావాన్ని అంత ముందుగా సమగ్రంగా అందించిన నవలల్లో దేశంలోనే మొదటిది మాలపల్లి. కాంగ్రెస్ చరిత్ర రాసిన భోగరాజు పట్టాభి సీతారామయ్య వ్యాసరూపంలో 1921లోనే సోవియట్టులు అని ఆంధ్రపత్రికలో రాసిన వ్యాసం మాత్రమే వచ్చివుంది. ఉర్దూ మహా రచయిత ప్రేమ్‌చంద్ ఓ నవలలో రేఖామాత్రంగానే ప్రస్తావించి వున్నారు. మాలపల్లితో పోల్చదగిన నవల ఆయన రంగభూమి మరో రెండేళ్లకు గాని వెలువడలేదు. అయితే భారత స్వాతంత్ర్య పోరాటానికి విశాల ప్రజాస్వామిక స్వభావం వుంది గనకే స్వతంత్ర యోధుడుగా ఉన్నవ దాన్ని అందిపుచ్చుకున్నారని చెప్పడం వాస్తవికంగా ఉంటుంది. స్వాతంత్ర అమృతోత్సవ తరుణంలో ఇప్పుడు తమ మతవాద, మితవాద కోణాలను ఆ పోరాటానికి ఆపాదించాలని చూస్తున్న అభివృద్ధి నిరోధకులకు మాలపల్లి ఒక సమాధానం. అలాగే ప్రస్తుత పాలకులు భావస్వేచ్ఛపై చేస్తున్న దాడులు కొత్త కాదనీ, నిరంకుశ పాలకులకు ఎప్పుడూ అలవాటేనని తెలుసుకోవడానికి కూడా మాలపల్లి చరిత్ర, ఉన్నవ జీవితం నిదర్శనంగా నిలుస్తాయి. ఉన్నవ దేశభక్తిని రాజద్రోహంగా చూపిన బ్రిటిష్ పాలకుల తరహాలోనే ఇప్పుడూ నడుస్తుండడం దిగ్భ్రాంతికరమైన వాస్తవం. పైగా స్వాతంత్ర అమృతోత్సవమంటూనే ఆనాటి క్రూర శాసనాలను ప్రయోగించడం, ఏది నిషిద్ధం? ఏది చట్టబద్ధం? అని ఎడతెగని వివాదాలు నడుపుతూ రచయితలు మేధావులను వెంటాడి వేధించడం. దానికి ఆయన తలవంచని వైనం ఉత్తేజకరం. ఉన్నవ జైలుజీవితంలో అనుమతితో రాసిన ఈ నవల బ్రిటిష్ వారికి వ్యతిరేకమని మొదట ఉలిక్కి పడిన అధికార యంత్రాంగం అందులో బొల్షివిక్ విప్లవం గురించి రాశారని మరింత గంగవెర్రులెత్తిపోయింది. ఈ సంచికలో ఆ వివరాలన్నీ చూస్తాం గనక ఇక్కడ ఆ హెచ్చరికను గుర్తు చేసుకుంటే చాలు. జైలునుంచి విడుదలైన ఉన్నవ తన నవల రాతప్రతిని తీసుకెళ్తానన్నప్పుడు అవకాశముందా లేదా అని అంత చర్చ పరాయి పాలకులు చేశారు గాని ప్రస్తుత పాలకులు అంతకన్నా దారుణంగా వేటాడటం అమృతోత్సవ ప్రత్యేకత అనుకోవాలి!

**గమనిక**

డిసెంబరు 2021, జనవరి 2022 సంచికలను కలిసి ఈ ప్రత్యేక సంచికను వెలువరిస్తున్నాం. ఫిబ్రవరి, మార్చి నెలల సంచిక మార్చి 18లోగా వెలువడుతుంది. కొన్ని అనివార్య కారణాల వల్ల జరిగిన జాప్యాన్ని పాఠకులు పెద్ద మనసుతో అర్థం చేసుకోవాల్సిందిగా కోరుతున్నాం.

**- సంపాదకుడు**

### 3

ఉన్నవ లక్ష్మీనారాయణ వ్యక్తిత్వం బహుముఖీనమైనది. మౌలికంగా ఆయన నాయకుడు, సంస్కర్త, న్యాయవాది, విద్యాబోధకుడు, గాంధేయవాది. సనాతన విశ్వాసాలను పూర్తిగా వదులుకున్నవారు కూడా కాదు. ఏ విధంగానూ కమ్యూనిస్టు కాదు. కాని నవలలో అందరికన్నా ముందుగా విశదంగా,

గౌరవంగా ఆ భావాలకు చోటు కల్పించడం రెండు వాస్తవాలను చెబుతుంది. ఒకటి వ్యక్తిగా ఆయనది విశాల దృక్పథం. రచయితగా ఆయనది సమగ్ర దృష్టి. ఒక గొప్ప రచన సమాజ పరిస్థితులకు ప్రతిబింబం అనుకుంటే నిజాయితీపరుడైన రచయిత తన స్వంత భావాలతో నిమిత్తం లేకుండా అప్పుడున్న అన్ని ధోరణులనూ చూపించాలి. శుద్ధ గాంధేయవాదిగా సుపరిచితుడైన ఉన్నవ తన కోణంలో కమ్యూనిస్టు భావజాలాన్ని పాత్రలను చిత్రించాలనుకున్నది అందుకే. అది కూడా సంగదాసు, వెంకటదాసు ఉభయుల్లోనూ రెండు రకాలుగా పలికించాడు. ఆర్థిక అసమానతల గురించే నొక్కి చెప్పి కులపరమైన అసమానతలపై పోరాటాన్ని కమ్యూనిస్టులు విస్మరించారనే విమర్శ ఇప్పటికీ వింటుంటాం. కాని లోపాలోపాలున్నా కమ్యూనిస్టులు భూస్వామ్య పీడనపై పోరాడినప్పుడు ఈ అంశాలను పరిగణనలోకి తీసుకున్నారు. మౌలికంగానే పీడిత ప్రజానీకం వర్గపోరాటంలో ముఖ్య సైన్యంగా ఉంటారనే పరమ సత్యాన్ని ఉన్నవ నాడే గుర్తించగలిగారు. అందుకే వెంకటదాసు, సంగదాసు ప్రధాన పాత్రధారులుగా కార్మిక సంఘాలతో పాటు వ్యవసాయ కార్మిక పోరాటాలనూ చెప్పి శ్రమదోపిడీపై చర్చ చేశారు. అస్పృశ్యతా వ్యతిరేక సభలూ, బెజవాడ కార్మిక సభలు కూడా చూపించారు. గాంధేయ రామదాసు కథానాయకుడు కావడం రచయిత కోణమైతే.. కులవివక్ష వద్దని మొరపెట్టుకోవడం ద్వారా హితబోధల ద్వారా మార్పు తేవాలనుకోవడం తత్ఫలితం. అంబేద్కర్ చెప్పినట్టు, ఈ మధ్య జైభీమ్ చిత్రంలో చూపినట్టు చదువే ఆయుధం అన్న అవగాహననిచ్చేలా విద్యాసంస్థ స్థాపన, విస్తరణ ఒక ముగింపుగా చూపడం ఆ కొనసాగింపు. ఇది కూడా ఉన్నవ జీవితంలో చేసిన దానికి దగ్గరగా ఉన్న వాస్తవం.

కాత్యాయనీ విద్మహే ప్రత్యేకంగా రాసినట్టు స్త్రీపురుష సంబంధాలు, ప్రేమలూ పెళ్లిళ్లూ, అసమానతలూ అనేక రూపాల్లో ఉన్నవ అక్షరబద్ధం చేశారు. ఆ క్రమంలో ప్రజాస్వామిక స్పృహ ప్రదర్శించారు. అప్పటికింకా చలం వంటి వారి రచనలు కూడా పెద్దగా ప్రాచుర్యంలోకి రాలేదని గుర్తు చేసుకుంటే ఉన్నవ సామాజిక సాహసం సాక్షాత్కరిస్తుంది. అస్తిత్వవాద రచయితలు ఇప్పుడు చెబుతున్న పలు విషయాలు ఆయన ఆనాటికే చూడగలిగారు. కందుకూరి వీరేశలింగంతో ప్రత్యక్షంగా కలసి పనిచేయడమే గాక గుంటూరు వీరేశలింగం అనిపించుకున్న ఉన్నవ చాలామంది సంస్కర్తల్లో స్వాతంత్ర పోరాటం పట్ల వున్న ద్వైదీభావాన్ని అధిగమించగలిగారు. నిజాం రాజ్యంలో సామాజిక న్యాయం కోసం పోరాడుతున్న యోధుడు భాగ్యరెడ్డి వర్మ దర్శనమిచ్చారు. అలాగే కుల భేదాల గురించి ఎంత రాసినా సహృదయులు చైతన్యవంతులైన పై కులాల వారు కూడా పోరాటంలో కలసి వచ్చే అవకాశం చూపించారు. కాని అదే సమయంలో అదే కుటుంబాల్లో కరుడుగట్టిన వారి కర్కశత్వమూ చెప్పారు. ప్రత్యక్షంగా అనేక చారిత్రాత్మక పోరాటాల్లో పాల్గొని జైలుశిక్షలనుభవించారు. బ్రిటిష్ జైళ్లలో నరకాన్ని వర్ణించారు. గాంధేయవాదిగా వాటిని ఏదో తాత్విక కోణంలో సర్దుకోవడమూ చెప్పారు. ఈ వివరాలన్నీ సంచికలో వివిధ వ్యాసాల్లో చూడొచ్చుగాని వాటి అంతస్సూత్రం తెలియడానికే ఈ ప్రస్తావన.

4

ఉన్నవకు వ్యక్తిగానూ, రాజకీయంగానూ ఉన్న పరిమితులేమిటి? మాలపల్లిలో సమతా గీతాలు పాడినా సైద్ధాంతిక స్పష్టత లేనిదేమిటి కొందరు విమర్శకులు చర్చ చేశారు గాని వందేళ్ల వెనక్కు వెళ్లి ఆలోచిస్తే వాటికి సమాధానం శాస్త్రీయంగానే దొరుకుతుంది. సోవియట్‌లో కొత్త సమాజం నిలుస్తుందా లేదా అన్న సందేహం నవలలో ఉండటం ఆసక్తికరమే గాని ఆ వ్యవస్థ విచ్ఛిన్నాన్ని ఊహించినట్టు చెప్పడానికి లేదు. ఎందుకంటే అది కొన్ని దేశాలకు సంబంధించిన తీవ్రమైన ఎదురుదెబ్బే తప్ప మొత్తం సిద్ధాంత వైఫల్యంగా చూడటానికి లేదు. ఎందుకంటే ఆ ప్రయోగం అప్పుడే మొదలవుతున్నది. నవలలో పాత్రలు గాని నవలా రచయితకు గాని పరిమితమైన అవగాహనే ఉంది. స్వాతంత్రం వచ్చేసినట్టు, చాలా గొప్ప మార్పులు జరిగినట్టు ఈ నవల పాతికేళ్ల ముందే ఊహిస్తుంది. తీరా ఆ స్వాతంత్రోదయంలో గాంధీజీ సంతోషంగా పాలుపంచుకోలేకపోవడం ఒక పరమసత్యం. స్వాతంత్ర్యం తర్వాత డెబ్బై ఏళ్లకు దేశానికి కొత్త సవాళ్లు ఎదురవచ్చునే అంచనా కూడా ఊహించనిదే. అప్పుడూ ఇప్పుడూ ఎప్పుడైనా విమర్శలు రచనలో ప్రతిబింబితమైన రచయిత చైతన్య పరిధిలో జరగాలి తప్ప లేనివాటి కోసం చూడటం, లోపాలు గొప్పలు ఆపాదించడం ఉపయోగం లేని పని. 'ప్రపంచ కార్మికులారా! ఏకం కండు పోయేదేమీ లేదు, సంకెళ్లు తప్ప. జయించడానికి ప్రపంచం వుంది' అని పిలుపు ఇచ్చిన కమ్యూనిస్టు ప్రణాళిక 175వ వార్షికోత్సవాలు ఇప్పుడు ప్రారంభమయ్యాయి. 'పనివాళ్లందరు ఒక్కటైతిరా ప్రపంచమే మీది' అని మాలపల్లిలో తక్కెళ్ల

జగ్గడు పాడే పాట దీనికి ప్రతిధ్వనిలా ఉండటం చారిత్రిక యథార్థం. గాంధేయవాద ఉన్నవ కోరుకున్నదో కాదో మనకు తెలియదు గాని ఈ పాటను కమ్యూనిస్టులు ఆ రోజుల్లో పాడేవారని అప్పటి పలువురు రాశారు. అది వాటి వాస్తవిక పాత్ర, ప్రభావం. బుర్రకథ రూపంలో వీటిని చెప్పడం, రామదాసుతో తత్వాలు పాడించడం, మరి కొన్నిసార్లు తాత్విక చర్చలు చేయడం వంటి లక్షణాలన్నీ మాలపల్లి యుగ స్వభావాన్ని చెబుతాయి. ఇందులో ఘటనలు, సభలూ సమీకరణాలు, కుటుంబాలు వ్యక్తుల పరిధిని పాటించవు. రాచపాళెం చంద్రశేఖరరెడ్డి అన్నట్టు.. రెండు కుటుంబాల కథలా కనిపించే రెండు సమాజాల కథ మాలపల్లి. వందేళ్ల కిందటిదైనా నేటికీ భారతదేశంలో కర్తవ్యాన్ని గుర్తు చేసే కథ. కార్యోన్ముఖులనూ కావ్యోన్ముఖులనూ చేసే కథ. సామాజిక జీవితంలోనూ, సాహిత్య ప్రపంచంలోనూ, రాజకీయ రంగంలోనూ విశాల ప్రజాస్వామిక దృక్పథాన్ని సదా గుర్తు చేసే కథ. ప్రజాస్వామిక శక్తుల మధ్య గీతలు గీసుకోవడం కన్నా చేతులు కలిపి కదలడం అవసరమని చెప్పే కథ. వ్యథార్థ జీవిత యథార్థ దృశ్యం నిజమే గాని మిథ్య కాదని కళ్లకు కట్టి చెప్పే కథ. తెలుగువాళ్ల సమున్నత ప్రగతిశీల సంప్రదాయాలను చాటిచెప్పే నవల మాలపల్లి.

## 5

మాలపల్లి ఇప్పటికి ఎన్ని ముద్రణలు ఎన్ని విధాలుగా వచ్చిందో చెప్పలేము. ఇంగ్లీషుతో సహా అనేక భాషల్లో అనువాదమైంది కూడా. సంక్షిప్త పాఠమూ వచ్చింది. మాలపల్లి జీవ నాటకం ఒక సంచలనమైంది. బంగోరే మాలపల్లిపై నిషేధాలు గ్రంథం నలభై అయిదేళ్ల కిందట ప్రచురించాక ఆసక్తి మరింత పెరిగింది. ఈ సంచికకు కూడా ఆ ప్రచురణ బాగా ఉపయోగపడింది. తర్వాత అనేకమంది పరిశోధకులు అమూల్యమైన అధ్యయనాలు చేశారు. దళిత సాహిత్యం విస్తరించాక మాలపల్లిని ఎలా చూడాలనే దానిపై కొత్త వ్యాఖ్యలు వచ్చాయి గాని దాని ప్రాధాన్యతను తోసిపుచ్చలేదు. కచ్చితంగా చెప్పాలంటే విస్తృతిలో చారిత్రకతలో మాలపల్లిని పోలిన నవల మరొకటి దాదాపు లేదని చెప్పక తప్పదు. ఈ సంచిక చూశాక ఆ అభిప్రాయం బలపడుతుందనే మా నమ్మకం. మాలపల్లిపై శత వార్షికోత్సవ సదస్సులు, చర్చలు చాలా జరిగాయి. ఈ ఏడాది పొడుగునా జరుగుతాయి. జరిగిన వాటిలో కొన్ని ప్రసంగాలు, పాత పరిశోధనలు కూడా స్వేచ్ఛగా ఉపయోగించుకున్నందుకు వారు సంతోషిస్తారనే భావిస్తున్నాం. ఆ రచయితలందరికీ మరీ మరీ కృతజ్ఞతలు చెప్పడం మా బాధ్యత. సదస్సులు చర్చలకు సహకరించిన, సహకరిస్తున్న, నిర్వహిస్తున్న వారందరికీ మా అభినందనలు. కరోనా నేపథ్యం, ఇతర సమస్యలు ఈ ప్రత్యేక సంచిక ఆలస్యానికి కారణమయ్యాయి. గతంలో గురజాడ, శ్రీశ్రీ, కుసుమ ధర్మన్న, పోతులూరి వీరబ్రహ్మం, వేమన వంటివారిపై ప్రత్యేక సంచికలు వెలువరించడం మీకు తెలుసు. ఇదేగాక స్వేచ్ఛాస్వరం, ప్రసిద్ధుల ప్రత్యేక సంచిక వంటివి ఉన్నాయి. కాని ఒక వందేళ్ల నవలపై ప్రస్థానం ప్రత్యేక సంచిక ఇదే ప్రథమం. ఈ సంచికలో ఏమైనా తప్పొప్పులను సహృదయంతో అర్థం చేసుకుంటారనీ, ఎప్పటిలాగే ఆదరిస్తారని ఆశిస్తున్నాం. మాకు సహాయ సహకారాలు అందించే వారందరినీ కలుసుకోవడం గానీ, రావలసిన రచనలన్నీ తీసుకోగలగడం గాని మిగిలే ఉన్నాయి. ఈ ఏడాది పొడుగునా అవకాశాన్ని, అవసరాన్ని బట్టి ఈ ప్రయత్నం కొనసాగిస్తామని తెల్పుకుంటున్నాం.

ప్రధాన సంపాదకుడు
తెలకపల్లి రవి
వర్కింగ్ ఎడిటర్
సత్యాజీ

సంపాదకవర్గం
కె.సత్యరంజన్ ◆ కెంగార మోహన్ ◆ వొరప్రసాద్
◆ చీకటి దివాకర్ ◆ గనారా ◆ కుమార స్వామి
మేనేజర్ : కె.లక్ష్మయ్య

బొమ్మలు
తుంబలి శివాజి
చిదంబరం

Owned, Printed and Published by **V. Krishnaiah** 41-9 -16, 1st Floor, F-3, Ramalayam Street, Near Kalpana Prints, Krishna Lanka, Vijayawada (Urban) - 520013, Krishna District. Andhrapradesh. Printed at Sri Chaitanya Offset Printers, 29-7-36, Vishnuvardhan Rao Street, Suryaraopet, Vijayawada - 520 002, Andhrapradesh. Published at 27-30-4, M.B.Vignanakendram, 3rd Floor, Akulavari Veedhi, Governorpet, Vijayawada - 520 001, Andhrapradesh. Editor : Telakapalli Ravi

# సాహిత్య ప్రస్థానం

## డిసెంబరు 2021, జనవరి 2022

## శత వసంతాల మాలపల్లి ప్రత్యేక సంచిక

## ఈ సంచికలో ...




**ISSN No: 2581 - 7477**

**సాహిత్య ప్రస్థానం మాసపత్రికను ప్రోత్సహించండి. తెలుగు భాష, సాహిత్య వికాసాలకు మీరూ తోడ్పడండి !**

:: రచనలు, చందాలు, విరాళాలు, మనీ ఆర్డర్లు, చెక్కులు, డిడిలు పంపవలసిన చిరునామా ::

సాహిత్య ప్రస్థానం, ప్రజాశక్తి భవనం, అమరారెడ్డి కాలనీ, తాడేపల్లి - 522501, గుంటూరు జిల్లా.,

ఫోన్ : 0866-2577248, చందా వివరాలకు : 94900 99057, రచనలకు : 94900 99167

ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com, వెబ్‌సైట్ : www.prasthanam.com

1 సంవత్సర చందా రూ. 240 ◆ 5 సంవత్సరాల చందా రూ.1000 ◆ 10 సంవత్సరాల చందా రూ. 2000

Bank A/c Details: A/c Name: PRASTHANAM, SBI, Governorpet, Vijayawada. A/c No. 52001500585, IFSC: SBIN0020343. చెక్కులు, డిడిలపై prasthanam అని రాయగలరు.



# మాలపల్లి
# ఇది తొలి చారిత్రిక నవల

❑ రాచపాళెం చంద్రశేఖర రెడ్డి

“ భారతదేశం అనేక మానవ సమూహాల కూడలి. కులం, మతం, భాష, ప్రాంతం వంటి ప్రాతిపదికల మీద జనం విభజింపబడి ఉన్నారు. ఈ విభజనల మధ్య వైరుధ్యాలు ఉన్నాయి. వీటి మధ్య ఘర్షణలూ జరుగుతాయి. విభజింపబడిన సమాజంలో ప్రతి విభాగమూ తమ అస్తిత్వం కోసం పోరాటం జరుపుతుంది. ఈ విభాగాలన్నీ కలిస్తే దేశం అవుతుంది. దేశం ఐక్యంగా ఉండాలి. అందుకోసం ఈ నవల చిన్నచిన్న సమూహాలు తమ సంక్షేమం కోసం ప్రయత్నాలు చేస్తూనే, దేశం సంక్షేమాన్ని కూడా కాపాడాలి అని ప్రతిపాదిస్తుంది. ”

“హిందూ సంఘమంతా పునర్నిర్మాణం కావలసిందేనని నాయభిప్రాయం. అది నా తోటివారికి సాధ్యమయ్యే పనిగాదు. తల్లి సంఘం యొక్క క్షేమం విడిచి పిల్ల సంఘాల క్షేమానికి మాత్రమే పూనుకుంటే దానికీ ప్రతిబంధకాలున్నవి. యావన్మంది క్షేమం మనము విచారించకపోయినా చిన్న సంఘాల అభివృద్ధికై మనమవలంబించే మార్గాలు పెద్ద సంఘం యొక్క క్షేమానికి భంగం గాకుండా వుండాలి. ఇంతేగాకుండా దేశంలో అందరూ తమ చిన్న సంఘాల క్షేమానికి పూనుకుంటే దేశం మొత్తానికి సంబంధించిన పెద్ద సమస్యలన్నీ మూలబడి చిన్న ప్రయత్నాలు సయితం నిష్ఫలమవుతవి”. **(మాలపల్లి : సంగదాసు మాటలు)**

ఉన్నవ లక్ష్మీనారాయణ రాయవేలూరు జైలులో ఖైదీగా ఉండి 1920–21 మధ్య రాసిన నవల ‘మాలపల్లి’. తెలుగులో నవల పుట్టిన యాభై ఏళ్లకు ‘మాలపల్లి’ వచ్చింది. పౌరాణిక, చారిత్రక వస్తువుల దగ్గర సంచరిస్తూ ఉండిన తెలుగు నవలను, సంస్కరణవాద సాంఘికాంశాల్లోకి చొచ్చుకు వస్తున్న తెలుగు నవలను... సంఘంలో నడుస్తున్న రాజకీయాల వైపు మళ్లించిన నవల ‘మాలపల్లి’. తొలి తెలుగు రాజకీయ నవల ‘మాలపల్లి’. నడుస్తున్న రాజకీయాలను రచయిత సాక్షీభూతుడుగా చెప్పి వదిలేయకుండా తానొక రాజకీయవాదం వైపు మొగ్గడం ఈ నవలలోని ప్రత్యేకత. సంఘంలో ఉండే సాంఘిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక, తాత్విక పార్శ్వాల న్నిటినీ చిత్రించిన సమగ్రమైన నవల ‘మాలపల్లి’. ఈ నవలలో కుల సమస్య వచ్చింది. కూలీల సమస్య వచ్చింది. పరాయిపాలన, స్వపరిపాలన ప్రస్తావన వచ్చింది. కళల చిత్రణా ఉంది. మత, ధార్మికాంశాలు కనిపిస్తాయి. అప్పటికి ఈ నవల భారతీయ భాషల్లో వచ్చిన అతికొద్ది గొప్ప నవలల్లో ఒకటి. నిర్దిష్ట స్థలంలో, నిర్దిష్ట కాలంలో కొనసాగిన సమాజ పరిణామాలను నిజాయితీగా ఆవిష్కరించిన నవల ‘మాలపల్లి’. రచయిత అభిప్రాయాలు అన్నిటితోనూ ఏకీభవించలేకపోయినా, సమగ్ర జీవిత చిత్రణగా నవల రాయడానికి ఒరవడి దిద్దింది ‘మాలపల్లి’. తర్వాత వచ్చిన ఐతిహాసిక నవలలకు మార్గదర్శి ‘మాలపల్లి’.

‘మాలపల్లి’ నవల రెండు కుటుంబాల చరిత్రగా కనిపించే ఒక గ్రామం చరిత్ర. ఒక గ్రామం చరిత్రగా కనిపించే ఒక దేశచరిత్ర. భారతీయ సమాజం అనేక రకాల మానవ సమూహాల కూడలి. వాటిమధ్య ఐక్యత, ఘర్షణ సంబంధాలనే ‘మాలపల్లి’ నవల ప్రతిబింబించింది. రచయిత ఉద్దేశించకపోయినా ఈ నవల మరొక అంశాన్ని కూడా ఆవిష్కరించింది. దేశీయంగా పరస్పర స్వేచ్ఛ ఇచ్చిపుచ్చుకోని సమాజం, పరాయి పాలకుల నుండి

**'మాలపల్లి' నవల మీద జాతీయంగా అప్పుడప్పుడే మొదలవుతున్న గాంధీజీ నాయకత్వంలోని భారత స్వాతంత్రోద్యమం, అంతర్జాతీయంగా అప్పటికే పచ్చిపచ్చిగా ఉన్న రష్యాలో 1917లో వచ్చిన బోల్షివిక్ విప్లవం ... ఈ రెండింటి ప్రభావమూ ఉంది.**



స్వేచ్ఛను కోరడంలోని ఔచిత్యాన్ని ఈ నవల ప్రశ్నించింది. ఈ అంశాన్ని మహీధర రామ్మోహనరావుగారి 'కొల్లాయి గట్టితేనేమి?' నవల మరికొంత వాస్తవికంగా ఆవిష్కరించింది.

పల్నాడు ప్రాంతంలోని మంగళాపురం అనే గ్రామంలో చౌదరయ్య, ఇతర భూస్వాములు; రామదాసు, ఇతర దళితులు ఉంటారు. చౌదరయ్యకు రామానాయుడు కొడుకు, వెంకటయ్య పెంపుడు కొడుకు. రామదాసు సంప్రదాయ వైద్యుడు. కొంత భూవసతి ఉంది. ఈయనకు వెంకటదాసు, సంగదాసు, రంగదాసు, జ్యోతి సంతానం. సంగదాసు చౌదరయ్య ఇంట్లో పాలేరు. వరికోతలు వస్తాయి. కూలీలు కూలీ పెంచమంటారు. కూలీలకు సంగదాసు మద్దతు తెలుపుతాడు. అది చౌదరయ్యకు కోపం తెప్పిస్తుంది. రామానాయుడుకు స్వాతంత్ర్యోద్యమ స్పృహ ఉంటుంది. ఇద్దరూ కలిసి విజయవాడలో జరిగిన ఆదిమాంధ్ర మహాసభకు వెళతారు. ఇద్దరూ కలిసి రైల్వేస్టేషన్లో భోజనం చేసి వెళతారు. ఇది తెలిసి చౌదరయ్య కోపం రెట్టింపవుతుంది. విజయవాడ నుండి రాగానే చౌదరయ్య రోకలిబండతో కొట్టి చంపుతాడు సంగదాసును. లంచం ఇచ్చి కేసు కాకుండా తప్పించుకుంటాడు. అంతేకాదు, రామదాసు మీదనే కేసులు పెట్టిస్తాడు. రామదాసు క్రైస్తవ మత విస్తరణకు అడ్డు పడుతున్నాడని వలస పాలకులు అరెస్టు చేస్తారు. వెంకటదాసు ఈ పరిణామాల క్రమంలో ఇల్లు విడిచిపోయి తక్కెళ్ళ జగ్గడు పేరుతో సైన్యాన్ని సమీకరించుకొని ధర్మకన్నాలు వేస్తుంటాడు. ఆయన ఉద్యమం బలపడడంతో ప్రభుత్వం ఉలిక్కిపడి ఆయనను నిర్బంధిస్తుంది. తల్లిదండ్రులూ, వెంకటదాసు ఒకే జైలులో ఉంటారు జైలు అధికారి పౌలు, రామదాసు కూతురు జీవితం నాశనం చేయబోతే, ఆమె నదిలో దూకి చనిపోతుంది. దానిని చూసి ఆమె మేనత్త కొడుకు అప్పాదాసు నదిలో దూకేస్తాడు. వెంకటదాసు పైన కోర్టు విచారణ జరుగుతుంది. శిక్ష అనుభవిస్తూనే ఆయన మరణిస్తాడు. ఈలోపల గ్రామంలో మార్పు వస్తుంది. స్వాతంత్ర్యోద్యమం బలపడుతుంది. వెంకటయ్య, రామానాయుడు తమ ఆస్తులు దానం చేస్తారు. దేశానికి స్వాతంత్ర్యం వస్తుంది. మంగళాపురంలో విజయ కళాశాల నిర్మాణమైంది. గాంధీజీ కలలుగన్న గ్రామ స్వరాజ్యం నిర్మాణమైంది.

"వెనుక జిక్కిన జాడూ బోడూ గూడా పండితేగాని పోలివుండదు. ముందు ఎక్కివచ్చిన ఏ పదికర్రలో పండితే ఏమి ప్రయోజనం? అందరూ బాగుంటేనే బాగు" అంటూ మొదలైన 'మాలపల్లి' నవల "సవర్ణులగు ఓ సనాతన సోదరులారా! అన్ని విధములకు నాశన హేతువగు అభిజనాభిమానమును విడిచి, అట్టి దురభిమానమెన్నడును లేకుండుటచే విలక్షణములైనట్టి, నిత్యులైనట్టియు హరిజన సోదరులతోడి అనువర్తనము, సర్వ సోదరభావము నలవరచు కొనుటకు ఎంతయు తోడ్పడునని మనవి చేయుచున్నాను. మనము కలసిమెలసి యుండినచో ఉభయులకును లాభదాయకమేనని భావించుచున్నాను" అంటూ ముగుస్తుంది. ఈ ప్రారంభంతాలు 'మాలపల్లి'ని మానవ సమానత్వ ప్రతిపాదక నవల అని తెలియజేస్తున్నాయి. భారతీయ సమాజ పునర్నిర్మాణమే 'మాలపల్లి' నవల లక్ష్యం. ఆధిపత్య వర్ణాలు దిగివచ్చి దళితులతో స్నేహపూర్వకంగా, మానవీయంగా ప్రవర్తించి, దేశంలో వివక్షను నిర్మూలించుకొని, మనుగడ సాగించాలన్న ప్రబోధంతో ఈ నవల ముగిసింది. పంతులు అనే అతను వేదిక పైకి వచ్చి తన ఆస్తినంతటిని సంగ కళాశాలకే చేరేటట్లు వీలునామా రాసిస్తాడు. అంతేకాదు, తాను ఆ కళాశాలలో ఉచితంగా గుమాస్తాగా పనిచేస్తానని ప్రకటిస్తాడు. రామానాయుడు వేదిక మీదకి వచ్చి తమకున్న పొలంలో 10 ఎకరాలు తమకు ఉంచుకొని తక్కిన స్థిర, చరాస్తులను విజయ కళాశాలకు దానం చేస్తున్నట్లు ప్రకటించాడు. వెంకటయ్య కూడా తన యావదాస్తిని తన తదనంతరము విజయ కళాశాలకు చెందేలా రాసిస్తాడు. ఏ సంపద చేత భూస్వాములు ఆధిపత్య అహంకారంతో బడుగు వర్గాల మీద, ముఖ్యంగా దళితుల మీద హింసకు పాల్పడుతున్నారో, ఆ భూమిని వాళ్లు విజయ కళాశాలకు అప్పగించడంతో ఆర్థిక అసమానతలు తొలగి ఆరోగ్యకరమైన సామాజిక వ్యవస్థ ఏర్పాడడానికి వీలు కలిగింది. సంగదాసు కన్నుమూస్తూ 'మనం గెలుస్తాం' అంటాడు. నవల చివర్లో సంపన్నులంతా తమ ఆస్తిని విజయ కళాశాలకు స్వాధీనం చేయడంతో సంగదాసు మాట వాస్తవ రూపం ధరించింది. పంతులు తన ఆస్తిని విజయ కళాశాలకు రాసివ్వడం 'సంగ విజయమునకు కిరీటము' అని జనం భావించారు. 'సవర్ణులకు అహంకారము ఆజన్మసిద్ధము. కడజాతికి అనహంకారము జన్మసిద్ధము' అంటూ రచయిత చివర్లో సవర్ణులకు అహంకారం ఆస్తి వల్లనే వచ్చింది. ఆ ఆస్తిని త్యాగం చేస్తే అహంకారతనం ఎగిరిపోయి 'మానవ ధర్మం' సిద్ధిస్తుంది అని ఈ నవల ప్రతిపాదన చేసింది.

'మాలపల్లి' నవల మీద జాతీయంగా అప్పుడప్పుడే మొదలవుతున్న గాంధీజీ నాయకత్వంలోని భారత స్వాతంత్రోద్యమం, అంతర్జాతీయంగా అప్పటికే పచ్చిపచ్చిగా ఉన్న రష్యాలో 1917లో వచ్చిన బోల్షివిక్ విప్లవం ... ఈ రెండింటి ప్రభావమూ ఉంది. గాంధీజీ రాజకీయాల్లోకి రాకముందు సంఘ సంస్కరణోద్యమం,

స్వాతంత్రోద్యమం విడివిడిగా నడిచేవి. గాంధీజీ రాజకీయాల్లోకి వచ్చి ఆ రెండు ఉద్యమాలను సమన్వయం చేసుకున్నారు. సంఘ సంస్కరణోద్యమాన్ని బ్రహ్మ సామాజికుల మార్గంలో కాకుండా, తనదైన పద్ధతిలో నిర్మాణ కార్యక్రమంగా రూపొందించుకున్నారు. దానికి రాజకీయంగా స్వాతంత్రోద్యమాన్ని కలుపుకొని అపార భారతదేశంలో పరాయి పాలన స్థిరపడడానికి దోహదం చేసిన ఆంతరంగిక అసమానతలను నిర్మూలించుకుంటూ దేశానికి స్వాతంత్ర్యం తీసుకురావడం ఆయన ప్రణాళిక. 'మాలపల్లి' నవలలో ఈ సమన్వయ మార్గమే చిత్రింపబడింది. సంగదాసు నడిపిన పంచమ, కార్మికోద్యమాలు నిర్మాణ కార్యక్రమం. ప్లీడరు నారాయణ రావు నడిపింది అసహాయోద్యమం. గాంధీజీ నాస్తికుడు కాదు, ఆధ్యాత్మికవాది. భౌతికవాది కాదు భావవాది. 'మాలపల్లి'లో రామదాసు భావవాది, ఆధ్యాత్మికవాది. ఉన్నవ కూడా అంతే. రామదాసు ఆధ్యాత్మికత అచలతత్వమంటారు. ఈ అచలతత్వం ఏ కష్టసుఖాలకూ కదలని తత్వమే ఈ నవలలో చివరిదాకా ప్రదర్శించాడు రామదాసు. ఉద్యమకారులైన సంగదాసు, వెంకటదాసు ముందూ వెనుకలుగా నవల మధ్యలోనే మరణిస్తారు. నవల మొదటి నుంచి చివరిదాకా బతికింది రామదాసు. సమాజంలోని ఆర్థిక, సాంఘిక, రాజకీయ పార్శ్వాలకు వెన్నుదన్నుగా తాత్వికత ఉంటుంది. ఆ తాత్వికతనే రామదాసు ద్వారా చిత్రించారు ఉన్నవ. అయితే అది భావవాద తాత్వికత. అందులో సంస్కరణ స్వభావం ఉండడం విశేషం. వీరబ్రహ్మంగారి తత్వాలు అనేక పర్యాయాలు ప్రస్తావనకు వస్తాయి నవలలో. అవి సంస్కరణ భావాలు కలిగిన తత్వాలు.

ఈ నవలలో మరొక ప్రతిపాదన ఉంది. భారతదేశం అనేక మానవ సమూహాల కూడలి. కులం, మతం, భాష, ప్రాంతం వంటి ప్రాతిపదికల మీద జనం విభజింపబడి ఉన్నారు. ఈ విభజనల మధ్య వైరుధ్యాలు ఉన్నాయి. వీటి మధ్య ఘర్షణలూ జరుగుతాయి. విభజింపబడిన సమాజంలో ప్రతి విభాగమూ తమ అస్తిత్వం కోసం పోరాటం జరుపుతుంది. ఈ విభాగాలన్నీ కలిస్తే దేశం అవుతుంది. దేశం ఐక్యంగా ఉండాలి. అందుకోసం ఈ నవల చిన్నచిన్న సమూహాలు తమ సంక్షేమం కోసం ప్రయత్నాలు చేస్తూనే, దేశం సంక్షేమాన్ని కూడా కాపాడాలి అని ప్రతిపాదిస్తుంది. "మహాసంఘం యొక్క క్షేమం దృష్టిలో లేకుండా చేసే ప్రయత్నాలు నేలవిడిచి సాము చేసినట్లే అవుతుంది. హ్రస్వదృష్టితో మనం చేసే ప్రయత్నాలు చిన్న సంఘాలను తాత్కాలికంగా ఉపయోగించినట్లు కనబడ్డా, మహాసంఘానికి అపకారములై మహాసంఘంతో పాటు మనమూ నష్టపడడమే కాకుండా మనము దేశ ద్రోహులమునూ, సంఘ ద్రోహులమునూ కావలసి వస్తుంది" (పు. 120). ఈ నవలకు ఇంత విశాలమైన ప్రాతిపాదిక ఉంది.

ఈ నవలలో ఒక ముఖ్యమైన అంశం రామానాయుడు, సంగదాసుల సంబంధం. రామానాయుడుది ఆధిపత్య కులం, సంగదాసు దళితుడు. పైగా సంగదాసు రామానాయుడి ఇంటి జీతగాడు. ఇంటి యజమాని, భూస్వామి చౌదరయ్యతో సంగదాసుకు ఘర్షణ, చౌదరయ్య కొడుకు రామానాయుడుతో ఐక్యతా సంబంధం కొనసాగడం ఈ నవలలోని వైచిత్రి. చౌదరయ్యతో ఉన్న ఘర్షణ సంబంధం సంగదాసు ప్రాణాలు

**సంగదాసు ఒకవైపు దళితుల సంక్షేమం కోసం పోరాడుతూనే .. మరోవైపు వారి ఆరోగ్యాన్ని, ఆర్థికతను ధ్వంసం చేసే అనేక అలవాట్ల నుంచి దూరం చేయడానికి కృషిచేస్తాడు. సమగ్ర జీవిత చిత్రణయే నవల అన్న నిర్వచనానికి తగినట్లుగా ఉన్నవ ప్రతి చిన్న అంశాన్నీ చిత్రించే ప్రయత్నం చేశారు.**

తీసింది. రామానాయుడులో ఉన్న ఐక్యతా సంబంధం సంగదాసు మరణించినా ఇంకా బలపడి విజయం సాధించింది. ఇది ఈ నవల విశిష్టత. రామానాయుడు ఆధిపత్య కులానికి చెందినవాడు, విద్యావంతుడు అయినా ఆయనకు జీవితం ఏమీ తెలియదు. రామానాయుడుకు వాస్తవిక భారతీయ జీవితం ఏమిటో చూపించింది సంగదాసు. దళితుల శ్రమ, వాళ్ల ఆకలి ఎలా ఉంటాయో సంగదాసు రామానాయుడుకి అనుభవంలోకి తీసుకొచ్చి తనతో పాటు విజయవాడలో ఆదిమాంధ్ర మహాసభకు తీసుకుపోతాడు. రైల్వేస్టేషన్‌లో ఇద్దరూ కలిసి భోజనం చేస్తారు. రామనాయుడు తన గదిలోకి సంగదాసును రానిస్తాడు. కూలీలకు మద్దతుగా ఉద్యమించడానికి ఇద్దరూ కౌగిలించుకొని నిర్ణయం తీసుకుంటారు.

శ్రమ-ఫలితం అనే అంశం మీద 'మాలపల్లి' నవలలో భూస్వాములకు, దళిత కూలీలకు మధ్య పెద్ద చర్చే జరిగింది. పొలాల్లో పనిచేసే కూలీలకు డబ్బులివ్వాల్నా? గింజలివ్వాల్నా? ఇస్తే ఎంతవ్వాలి? అనేవి భూస్వాములే నిర్ణయిస్తారు. గింజలకు ఎక్కువ రేటు ఉంటే డబ్బులిస్తామంటారు. రేటు లేకపోతే గింజలిస్తామంటారు. కూలీలు తమకు ఏది ప్రయోజనకరమో దానిని కోరుకుంటారు. ఈ వివాదం కూలీలు సమ్మె కట్టేదాకా వెళ్లి, చౌదరయ్యకు సంగదాసు మీద కోపం వచ్చి అతన్ని చంపేదాకా పోతుంది. మరొకటి కూలీలకు కడుపు నిండా తిండి పెట్టాల్నా, అరకొరగా పెట్టాల్నా అనేది కూడా ఒక చర్చ. కడుపునిండా తిండి పెడితే కూలీలు పనిచెయ్యరని భూస్వాముల వాదం. కడుపునిండా తిండి పెడితే బాగా పనిచేసి, ఎక్కువ ఆదాయం తెస్తారని సంగదాసు వాదం. అలాగే దళితులు జంతుమాంసం తినడం మీద కూడా చర్చ జరుగుతుంది. ముర్రికి మాంసం తినకుండా మాన్పించమని రామానాయుడు సంగదాసుకు సూచన చేసినప్పుడు సంగదాసు ఇలా అంటాడు : "అయ్యా! ఆకలి బాధ మీకు తెలియదు. మహర్షుల వంటివారు ఆకలిబాధకు నిలవలేక ఏ మాదిగ పల్లెల్లోనో జొరబడి ఎండవేసిన ముర్రికి మాంసమును దొంగిలించి తిన్నారట. అది తినవద్దని ఎవరూ బోధించనవసరం లేదు. వాండ్లకు కడుపులోకి అన్నంవుంటే తినమన్నా తినరు. అన్నం లేకపోతే ముర్రికి మాంసం కాదుకదా ఎముకలు కూడా కొరికి తింటారు" (పు 67). సంగదాసు ఒకవైపు దళితుల సంక్షేమం కోసం భూస్వాములతో పోరాడుతూనే .. మరోవైపు తనవర్గ దళితుల ఆరోగ్యాన్ని, ఆర్థికతను ధ్వంసం చేసే అనేక అలవాట్ల నుండి దూరం చేయడానికి కృషిచేస్తాడు. సమగ్ర జీవిత చిత్రణయే నవల అన్న నిర్వచనానికి తగినట్లుగా ఉన్నవ ప్రతి చిన్న అంశాన్నీ చిత్రించే ప్రయత్నం చేశారు.

**తెలుగు నవలా సాహిత్యానికి మాలపల్లి మార్గదర్శి అయింది. తనకు ముందు ఏ నమూనా లేదంటూనే, తనే ఒక నమూనా అందించి వెళ్లారు ఉన్నవ. అస్తిత్వ ఉద్యమాలు మొదలయ్యాక మాలపల్లి మీద భిన్నాభిప్రాయాలు వ్యక్తమవుతున్నాయి. వాటిని గౌరవిస్తూనే, ఆ నవలను పునర్మూల్యాంకనం చేసుకోవడం అవసరం.**

ఉన్నవ భావవాది అయినా మానవజాతి వికాస క్రమాన్ని జగ్గడు పాత్ర ద్వారా శాస్త్రీయంగానే చెప్పించారు. తక్కెళ్ళ జగ్గని బుర్రకథలో.. " *ఆదికాలమున అందరు జనులు అన్నదమ్ములండి*

*నదులు వనంబులు నానా మృగములు నానాసంద్రములను*
*కొండలు వంకలు జలములు పొలములు గుంటలు సెలయేళ్ళు*
*కాయలు పండ్లు పాడిపంటలు ఘనమయిన యిండ్లు*
*అంతరవులా భేదములేక అందరి సొమ్మండీ*
*కుదవా గట్టా ఒకరికి బెట్టా కొదవే లేదండి*
*నా నీ భేదము లేక లోకము నడుస్తూ ఉండేది...*" అంటూ ఆదిమ కమ్యూనిస్టు వ్యవస్థ క్రమంగా వర్గ వ్యవస్థగా మారిన క్రమాన్ని వివరించి వర్గ సమాజం దుర్మార్గమైంది గనుక దీనిని నిర్మూలించాలని, అది ప్రజా చైతన్యంతోనే సాధ్యమని ఈ బుర్రకథ చెబుతుంది.

*"పని వాళ్లందరు యేకమైతిరా ప్రపంచమే మీది"*

అలాగే కోర్టులో జగ్గని ప్రసంగం ఈ నవలలో తలమానికమైన సందర్భం. తాను చెప్పదలచుకున్నది చెప్పవచ్చని కోర్టు అనుమతినిచ్చినప్పుడు వెంకటదాసు (జగ్గడు) ఆదిమ కమ్యూనిజం మొదలుకొని వర్గ సమాజం దాకా జరిగిన పరిణామాలను చెబుతాడు. చివరికి "కలియుగంలో రాక్షసులు లేరంటారు. కానీ, ధనికులే కలియుగ రాక్షసులు. మా సంతానుల చర్యలవలన ధనికుల భారం తగ్గుతుంది. బీదలకు సుఖం కలుగుతుంది. దేశమాత ప్రసాదించగల సౌఖ్యాలు ఆమె సంతానమంతా సమానంగా అనుభవించడానికి అవకాశం కలిగి ఇహమే స్వర్గమౌతుంది" అని ముగిస్తాడు. (పు.434). ఈ సమ సమాజ భావనను తెలుగులో మొదట ప్రస్తావించిన నవల 'మాలపల్లి'.

ఈ నవలలో వర్ణాశ్రమ ధర్మాల చర్చ కూడా జరిగింది. విజయవాడలో ఆదిమాంధ్ర మహాసభ జరగడానికి ముందటి రోజు రాత్రి వీటిని గురించి సభాపతి వెంకటరెడ్డి (భాగ్యరెడ్డి వర్మ – కె.శ్రీనివాస్) సంగదాసుల మధ్య చర్చ జరుగుతుంది. వృత్తుల పంపకాన్ని గురించి సంగదాసు సుదీర్ఘంగా మాట్లాడతాడు. సంగదాసు మాటల్లో ఉన్నవ వారిలోని ఉదారవాది తొంగి చూస్తున్నట్లు అనిపిస్తుంది. ఈ చర్చంతా చదవవలసిందే. "ఒకటవ తరగతి వారికి ధనాకర్షణకై వృత్తి ఏర్పాటు చేయలేదు. సంఘమే వీరిని పోషించవలసింది" అని సంగదాసంటే, సభాపతి "సోమరులుగా కూర్చోమన్నారు" అని అంటారు. దానికి సంగదాసు చెప్పిన వివరణ సుదీర్ఘమైంది. అంతా చెప్పి కాలక్రమంలో వర్ణాశ్రమ ధర్మాలు శిథిలం, ప్రజా ప్రభుత్వాలకు దారి సుగమం కావడాన్ని పేర్కొన్నారు. "ప్రభుత్వం పరాధీనం కాగానే క్షత్రియ వృత్తి పోయింది. క్షత్రియులందరూ ఇతర వృత్తుల్లో నిమగ్నమైపోయారు. బ్రహ్మలు చాలావరకు ఇతర వృత్తులనాశించారు. వారికే పారతంత్ర్యం పూర్తిగా ప్రాప్తమైంది. క్షత్రియేతరులు పూర్వకాలమందే క్షేత్రధర్మం అవలంబించారు. శూద్రులనేకులు రాజులైనారు. ప్రస్తుత ప్రజాప్రభుత్వమే ఉత్తమమైందిగా పరిగణిస్తున్నారు. కూలివాడు సహితం తన ఓటిచ్చి ప్రభుత్వాన్ని నడపడమే ఉత్తమ పాలనగా ఇప్పటి ప్రభుత్వ ధర్మం చెప్తున్నది" అంటూ మన దేశంలో వచ్చిన సంస్కరణోద్యమాలను ప్రస్తావించారు.

విజయవాడలో ఆదిమాంధ్ర మహాసభలో సభాపతి ప్రసంగం, ఆ సభలో సంగదాసు ప్రతిపాదించిన తీర్మానాలు కూడా ఈ నవల వైశిష్ట్యాన్ని పెంచాయి. సభాపతి ప్రసంగంలో రష్యన్ విప్లవ ప్రస్తావన రావడమే విశేషం. అయితే ఆయన ఆ ప్రభుత్వ మనుగడ మీద అనుమానం వ్యక్తం చేశాడు. దురదృష్టవశాత్తు ఆయన అనుమానం డెబ్బై ఏళ్ల తర్వాత నిజమైంది. ఇదొక విషాదం. మనము విప్లవ మార్గాలకు దిగకూడదు. ఇంగ్లండులో ఏర్పడుతున్న పద్ధతుల ననుసరించి ఆచి అడుగువేయడం ఉత్తమ మార్గం" అన్నారు సభాపతి. ఆయన మాట ప్రకారమే మనం ఆచి అడుగులు వేశాం. దశాబ్దాలు గడిచిపోయాయి. మనం ఏమి బావుకున్నామో ఆలోచించాలి. సంగదాసు తీర్మానాలు చాలావరకు ఇవాళ నిజమయ్యాయి. అయినా చాలా సమస్యలు అపరిష్కృతంగానే ఉన్నాయి.

ఈ నవల ప్రత్యేకతల్లో మరొక ముఖ్యమైనది ఉరిశిక్షను గురించిన చర్చ. తలారి వెంకటస్వామికి, రామదాసుకు మధ్య ఉరిని గురించి ఆసక్తికరమైన చర్చ జరుగుతుంది.

రామదాసు "ఉరిశిక్ష ఘోరం (పు.499). జన్మ శిక్ష వేస్తే చాలదా, చంపకపోతేను?" అంటాడు. నూరేళ్ళ తర్వాత కూడా మనం ఉరిశిక్ష అమలు చేస్తూనే ఉన్నాం. "కుక్క కరవంగానే పచ్చియెత్తి అందరినీ కరుస్తుందని భయపడి చంపినట్టు, ఒకరిని చంపగానే వారిని ఉరిదీయడం అవివేకాన్ని తెలియజేస్తున్నది. ఖైదీలో ఖూనీ నేరస్తుణ్ణి దీర్ఘకాలముంచితేనే బాగుచేయడానికి మార్గం చేయవచ్చు. తాత్కాలిక క్రోధంతో చంపినవాండ్లను ఉరిదీయడం కంటే అన్యాయం లేదు. శిక్ష ఎప్పుడూ నేరస్తుని బాగుపడడానికి ఉద్దేశించాలి. అందుచేత చంపినవాడు ఏవిధంగానూ బాగుపడడానికి అవకాశమివ్వని ఉరిశిక్ష సర్వవిధాలా నింద్యమే! (పు: 497)" అన్నది రామదాసు తీర్పు.

మొదట సంఘసంస్కర్త, తరువాత రాజకీయ నాయకుడు అయిన ఉన్నవ లక్ష్మీనారాయణలోని భావవాదాన్ని పక్కనబెట్టి, ఆయనలోని సంస్కరణ భావాలను, రాజకీయ భావాలను అర్థం చేసుకోవాలి. ఆయన సంప్రదాయం పోతులూరి వీరబ్రహ్మం వంటి తత్వవేత్తల మార్గానికి చెందినది. ఆ నవల తెలుగు నవలా సాహిత్యానికి మార్గదర్శి అయింది. తనకు ముందు ఏ నమూనా లేదంటూనే, తనే ఒక నమూనా అందించి వెళ్లారు ఉన్నవ. 'మాలపల్లి' నవల మీద ఇవాళ అస్తిత్వ ఉద్యమాలు మొదలయ్యాక భిన్నాభిప్రాయాలు వ్యక్తమవుతున్నాయి. వాటిని గౌరవిస్తూనే, ఆ నవలను పునర్మూల్యాంకనం చేసుకోవడం అవసరం.

**"నాది హృదయరాజ్యం**
**నా రాజ్యం నశించదు"**

**(వెంకటదాసు మాట ఇది. నవలలో పుట : 435)** ■



# మాలపల్లి
# సమకాలీన సమాజ చిత్రణ

❑ పెనుగొండ లక్ష్మీనారాయణ

తెలుగు నవల 1872లో నరహరి గోపాలకృష్ణసెట్టి 'రంగరాజ చరిత్ర'తో మొదలైంది. తరువాత యాభై సంవత్సరాలకు 1922లో ఉన్నవ లక్ష్మీనారాయణ గారి 'మాలపల్లి' వెలువడింది. తెలుగులో ఇప్పటివరకూ ఓ 35 వేల నవలలు కాస్త అటో ఇటో వచ్చి ఉంటాయి. అయినా మాలపల్లి నవలతోనే 'తెలుగు నవలా రచనకు స్వర్ణ గోపుర ప్రతిష్ఠ జరిగినట్ల'ని ప్రముఖ సాహిత్య విమర్శకులు, 2011లో సాహిత్య అకాడమీ గుంటూరులో నిర్వహించిన సదస్సు పత్రాలతో కూడిన పుస్తకం సంపాదకులు కోడూరి శ్రీరామమూర్తి అభిప్రాయం వ్యక్తం చేశారు.

ఇది మాలపల్లి శతజయంతి ప్రారంభ సంవత్సరం. ఉన్నవ వారి కార్యక్షేత్రం, సాహిత్య క్షేత్రం అయిన శారదా నికేతనానికి అతి సమీపంలో నేడు ఈ సదస్సు జరుగుతుంది. ఈ నవల గురించి కేంద్ర సాహిత్య అకాడమీ 2011 మార్చి 14, 15 తేదీల్లో గుంటూరులో ఒక సదస్సు నిర్వహించింది. మరోమారు నవల వెలువడిన 99 సంవత్సరాల అనంతరం శతజయంతి మహోత్సవాల పేరిట ఈ వేదికపై నిర్వహించటం జరుగుతోంది. ఈ నవలను గురించి ఇన్నేళ్ల తరవాత కూడా చర్చాగోష్ఠులు, సదస్సులు, సమావేశాలు జరుగుతున్నాయంటే ఈ నవలకు 'నూరేళ్లు నిండలేద'ని సజీవంగా ఉందని అర్థం. దానికి కారణం ఆ నవలలోని అనేక అంశాలతో పాటు కావలసినంత సమకాలీనత, ప్రాసంగికత ఉండటమే!

"ఈ నవలను గురించి ఇన్నేళ్ల తరవాత కూడా చర్చాగోష్ఠులు, సదస్సులు, సమావేశాలు జరుగుతున్నాయంటే ఈ నవలకు 'నూరేళ్లు నిండలేద'ని సజీవంగా ఉందని అర్థం. దానికి కారణం ఆ నవలలోని అనేక అంశాలతో పాటు కావలసినంత సమకాలీనత, ప్రాసంగికత ఉండటమే!"

మాలపల్లి నవలలో దళితుడిని కథానాయకుడిని చేయటం, దళితులు ఇతరులపై ఆధారపడకుండా తమను తాము సంస్కరిం చుకునే దిశలో ముందడుగు వెయ్యడం అనే విషయం సమకాలీన రచయితలకు ఒక సూచనగా పరిగణించాలి. అగ్రవర్ణాలు, ధనిక, భూస్వామ్య, మధ్య తరగతి సమాజం చుట్టూ తిరిగే నవలల కన్నా సమాజంలో అట్టడుగున వున్న, అణచివేతకు గురైన వర్గాలను, వర్ణాలను కేంద్రంగా తీసుకొని నవలా రచన చేయవల్సిన అవసరాన్ని మాలపల్లి ద్వారా ఉన్నవ లక్ష్మీనారాయణ ఈ తరం రచయితలకు సూచించారు.

ఈ నవలా రచనలో ఉన్నవ వారు ఎంతో అవగాహనతో ప్రాంతీయ, దేశీయ, అంతర్జాతీయ విషయాలను చర్చించారు. ఏ రచయిత అయినా ఉపరితల స్పర్శతో కాక ప్రాపంచిక దృష్టి



కలిగి ఉండాల్సిన అవసరాన్ని, దానికి కావలసిన అధ్యయనం, అవగాహన వుండాల్సిన అవసరాన్ని మాలపల్లి ద్వారా రచయితలకు ఉన్నవ సూచించారు.

మాలపల్లి నవలలోని ధర్మకన్నము, దొంగల కోవలు, బుర్రకథ అధ్యాయాలు నేటి సమాజంలోని అనేక విషయాలను గుర్తుకుతెస్తాయి. రాజ్యం, పోలీసు వ్యవస్థ, ప్రజాయుద్ధం ప్రస్తావనలు ఉన్నాయి. ప్రధాన పాత్ర తక్కెళ్ళ జగన్నాథం (జగ్గడు) ధర్మతత్వాలు, జంగాల కీర్తనలు ఆనాటి వ్యవస్థకు చెందిన విస్తుపోయే వాస్తవాలను వెల్లడి చేస్తాయి.

*"యెవరో కొందరు అరువుకొందురు –*
*యెల్ల ఉద్యములను*
*కోటి కొక్కరై ఉన్నారండి – కోటీశ్వరలంటు*
*కుచేలులందరు అయినారండి –*
*కోట్ల కొలదిగాను*
*కోటీశ్వరుల కనిష్ఠ బిడ్డలూ – కోట్లకు కర్తలట*
*మనుమలెగారూ మనంతరాలూ – మారు హక్కులంట*
*అరువు జెప్పితె అడ్డిగకూలి – పనికి పాతికెలట*
*రామరామ శ్రీరామా శ్రీరామా రామా*
*రామా రఘురామా*
*తక్కెళ్ళ జగ్గని ధర్మపన్నముల్*
*తలచి బ్రతుకరండి*
*ధనికుల బొర్రలు నిమురుకొందురు – తలపరొకరి బాగు*
*చేతుల వేళ్ళ పనులు ముట్టక – చెడి సోమరులయిరి*
*కాలిమీదనే కాలు వేసుకొని – కాలం బుచ్చేరు*

ఈ మాటలతో ఉన్నవ వారు ఆనాటి సామాజిక జీవన పరిస్థితుల గురించి వివరించారు.

వర్తమానంలోనూ జరుగుతున్నదే ఏమిటంటే.. ఉత్పత్తి శక్తులు అంటే శ్రమజీవులు, కష్టంతో అనుత్పాదక శక్తులు అంటే పెట్టుబడిదారులు పెరగడం, శ్రమకు సంబంధం లేని వారు, శ్రమ జీవులు సృష్టించిన పరాన్న భుక్కులు సంపదకు వారసులవడం. ఇందులో ఉన్నవ వారి వర్గదృక్పథం స్పష్టమవుతుంది.

ఇంకా

*"భాగ్యవంతులకు– బీదలెల్లరు బానిసలయినారు*
*పొద్దుగూకులు చాకిరి చేస్తురు – బుక్కెడు కూటికిగా*

**ఇటీవలనే కేంద్ర ప్రభుత్వం ప్రవేశపెట్టిన రైతాంగ వ్యతిరేక నల్లచట్టాలపై స్వాతంత్ర్యానంతరం జరిగిన మరో మహత్తర ఉద్యమాన్ని నిర్మించి నిర్వహించి భారత రైతాంగం సాధించిన మహత్తర విజయం 'శ్రేణులు గట్టి సమ్మెగట్టితే – చెల్లును మీ మాట' అన్న ఉన్నవ వారి మాటను నిజం చేసింది.**

*యెంత చేసినా తృప్తి లేదయా – యజమానుల కెల్ల*
*రోగంరానీ నొప్పిరానీ – నాగా దప్పదయా*
*కూలికి విలువగలదని మీరు – గుట్టు తెలుసుకోండి*
*కూలికి దగిన విలువ పుచ్చుకుని – కూలికి మారిపోండి*
*నీళ్లకూలికి వొప్పుకుంటినా – నెవరు చెరుపుకొంద్రు*
*పనివాండ్లందరు యేకమైతిరా – ప్రపంచమే మీది*
*ఐకమత్యమే అన్ని పనులకు – ఆధారము సుండి*
*శ్రేణులగట్టి సమ్మెగట్టితే – చెల్లును మీ మాట*
*కొట్టావద్దు తిట్టావద్దు – కోర్కెలు నిడివేరున్*
*అసహాయ యోగము తరుణము చూచి – అవలంబించండి*
*దానికి మిగిలిన మంత్ర తంత్రములు – ధరలో లేవండి*
*శంకలు దక్క మీరలల్లెరు – శపథము చేయండి*
*సమతా ధర్మం ప్రపంచమందున – స్థాపింతురుగాని"*

గాంధీజీ భావజాలం పట్ల అచంచల విశ్వాసం కలిగిన ఉన్నవ వారు తక్కెళ్ళ జగన్నాథం ద్వారా 'బుర్రకథ'లో చెప్పిన ఈ విషయాలు పూర్తి మార్క్సిస్టు అవగాహన, చైతన్యంతో, కార్మికవర్గ పక్షపాతంతో చెప్పినట్లు స్పష్టమవుతూనే ఉంది.

ఈ సందర్భంలో 'నూరేళ్ళ తెలుగు నవల – విశ్లేషణ' పుస్తకంలో సహవాసి గారు చెప్పిన మాటలను మీ దృష్టికి తెస్తాను. "మార్క్సిజం మూలపురుషుడు కారల్ మార్క్స్ 'ప్రపంచ కార్మికులారా ఏకంకండి..' అని ఇచ్చిన పిలుపునకు ప్రతిధ్వనిగా 'పనివాండ్లందరు ఏకమైతిరా – ప్రపంచమే మీది' అని తత్వం పాడించడం ద్వారా గాంధీయవాది అయిన ఉన్నవ సామ్యవాద వ్యవస్థను సమర్థించాడు."

ఉన్నవ వారు ఈ కీర్తనలో చెప్పిన సంగతులను నేడు కాలాతీతంగా కార్పొరేట్ సెక్టార్లలో, ఐటి పరిశ్రమల్లో పనిచేస్తున్న ఉన్నత తరగతి ఉద్యోగులుగా చెప్పబడుతున్న 'వైట్ కాలర్' ఉద్యోగులు ఆలోచించాల్సినవి. అంతేగాక కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు పరిశ్రమల్లో ప్రైవేటు రంగ పరిశ్రమల్లోని కార్మికుల హక్కులను కాలరాస్తున్న ఈ తరుణంలో మరోసారి మనకు ఉన్నవ వారి ఈ అభ్యుదయ గీతిక సమరశీల సందేశాన్నిస్తుంది.

ఇటీవలనే కేంద్ర ప్రభుత్వం ప్రవేశపెట్టిన రైతాంగ వ్యతిరేక నల్లచట్టాలపై స్వాతంత్ర్యానంతరం జరిగిన మరో మహత్తర ఉద్యమాన్ని నిర్మించి నిర్వహించి భారత రైతాంగం సాధించిన మహత్తర విజయం 'శ్రేణులు గట్టి సమ్మెగట్టితే – చెల్లును మీ మాట' అన్న ఉన్నవ వారి మాటను నిజం చేసింది.

ఉన్నవ వారు ఈ గీతంలో కార్మికవర్గం, శ్రమజీవులు ఆచరించాల్సిన ఉద్యమ లక్షణాలను, లక్ష్యాలను వర్గదృష్టితో వివరించారు. సమకాలీన వ్యవస్థకూ ప్రబోధగీతమిది.



ఈ బుర్రకథ అధ్యాయంలోనే తక్కెళ్ళ జగన్నాథం కరపత్రాల ద్వారా పోలీసుల హింస గురించి చేసిన ప్రకటన నేటి పోలీసుల చర్యలనూ గుర్తుకు తెస్తోంది. ఆ ప్రకటనలోని కొన్ని విషయాలు..

*"మా అనుచరులను శత్రువులు పట్టుకున్నప్పుడు న్యాయశాస్త్ర ప్రకారం శిక్షించకుండా మీ నాయకుల పేర్లు చెప్పవలసిందనీ, మీ సంఘం యొక్క ఏర్పాట్లు బయటబెట్టవలసిందనీ నిర్బంధపెట్టి అంగీకరించని వాండ్లను హింసించి ఇనుప కడ్డీలతో కొట్టి చిత్రవధలు చేస్తున్నట్టూ, మా సైనికుల తాలూకు స్త్రీలను తమ భర్తల జాడలను చెప్పవలసిందని బాధించి అవమాన పరుస్తున్నట్టూ మాకు తెలియవచ్చింది.."*

ఈ సందర్భంలో కాశీనాథుని నాగేశ్వరరావు గారు 'మాలపల్లి'కి రాసిన 'తొలి పలుకులు'లోని కొన్ని మాటలను మీ ముందుంచుతున్నాను.

"మాలపల్లి యందు వర్ణించిన సెటిల్‌మెంట్లు జైళ్లు, కోర్టులు, బడులు, పోలీసు, ఖద్దరు, సహాయ నిరాకరణము, ధర్మ దోపిడీలు, స్వరాజ్యము, పని పాటలు, అహింసా ధర్మము మొదలగు విషయాలకు సంబంధించిన ఆఖ్యానోపాఖ్యానముల మూలమయిన 'మాలపల్లి' ఒక మహాభారతమైనది. ఈ విషయముల పరిశీలనము జ్ఞానదాయకము."

ఈ విషయాలు ఆధునిక భారతంలో నిత్యమూ, నిరంతరమూ జరుగుతూ ఉన్నవే. తక్కెళ్ళ జగ్గడు చెప్పిన ఈ విషయాలు నేడు చట్టవిరుద్ధంగా పెడుతున్న అనేక కేసుల ద్వారా నిరూపితమవుతూనే ఉన్నాయి. అక్రమ అరెస్టులు, నిర్బంధాలు, నిషేధాలు, చట్టవిరుద్ధ సంఘటనలు మనకు తెలిసినవే. పౌరహక్కులు, మానవ హక్కుల ఉల్లంఘనలు మన ఎరుకలోనివే. స్వాతంత్ర్య పూర్వం రాసిన మాటల్లోని ఈ ఉదంతాలు సమకాలీన వ్యవస్థలో మనకు నిత్యానుభవాలే!

'మాలపల్లి' నవల ముగింపులో ఉన్నవ వారు చెప్పిన విషయాలు వందేళ్ల తరువాత మళ్లీ మనం ఆలోచించాల్సినవి. అవి అగ్రవర్ణాలకు ఒక హెచ్చరిక – దళిత వర్గాలకు ఒక సాంత్వన.

75 సంవత్సరాల స్వాతంత్ర్య భారతావనిలో కుల జాడ్యం తొలగక పోవడమే గాక వివిధ మార్గాల్లో ప్రత్యక్షంగా పరోక్షంగా చొచ్చుకుపోతూ నేటికీ మన సమాజంలో అన్ని రంగాల్లో మరీ ముఖ్యంగా రాజకీయ రంగంలో మనకు కనిపిస్తున్న వికృత దృశ్యం. సమాజం యావత్తూ విస్తరించిన ఒక

**"మాలపల్లి యందు వర్ణించిన సెటిల్‌మెంట్లు జైళ్లు, కోర్టులు, బడులు, పోలీసు, ఖద్దరు, సహాయ నిరాకరణము, ధర్మ దోపిడీలు, స్వరాజ్యము, పని పాటలు, అహింసా ధర్మము మొదలగు విషయాలకు సంబంధించిన ఆఖ్యానోపాఖ్యానముల మూలమైన 'మాలపల్లి' ఒక మహాభారతమైనది. ఈ విషయముల పరిశీలనము జ్ఞానదాయకము." – కాశీనాథుని నాగేశ్వరరావు**

భీకరవాస్తవమైంది. కులం, మతం పునాదుల మీద నిర్మితమైన ఈ వ్యవస్థ కూలిపోవాలనేది మనకు భారతరత్న బి.ఆర్.అంబేద్కర్ ఇచ్చిన సందేశం. ఇది అభ్యుదయవాదుల లక్ష్యం. అయితే దానికి ముందు సామరస్య పూర్వకంగా, సోదరభావంతో కులాలు మనగలగాలని ఉన్నవ వారు ఆనాటి సామాజిక పరిస్థితుల్లో చెప్పిన సంగతులు. ఇది ఆనాటి ఉన్నవ వారి అభిప్రాయమే కాదు, మేధావుల్లోనూ నెలకొన్న అభిప్రాయం. ఉన్నవ వారు ఈ మాటలు చెప్పేనాటికి దేశానికి స్వాతంత్ర్యం రాలేదు, రాజ్యాంగ రచనా జరగలేదు. కానీ ఆ మాటల్లోని 'సమకాలీనత'ను గ్రహిద్దాం.

ఇవిగోండి... ఉన్నవ వారు ఈ నవలకు ముగింపులో ఇచ్చిన సందేశాత్మక వాక్యాలు ...

*"సవర్ణులగు ఓ సనాతన సోదరులారా! అన్ని విధములకు నాశన హేతువగు అభిజానాభిమానమును విడిచి, అట్టి దురభిమానమెన్నడును లేకుండుటచే విలక్షములైనట్టి, నిత్యులైనట్టియు హరిజన సోదరులలో అనువర్తనము సర్వసోదర భావము నలవరచుకొనుటకు ఎంతయో తోడ్పడునని మనవి చేయుచున్నాను. మనము కలిసి మెలిసి యుండినచో ఉభయులకును లాభదాయకమేనని భావించుచున్నాను."*

మహా దార్శనికుడైన ఉన్నవ వారి 'మాలపల్లి' ప్రభావం తరువాతి తరాల రచయితలపై కూడా ప్రసరించింది. అందుకు అందే నారాయణ స్వామి, మాగోఖలే తదితరులు మంచి ఉదాహరణలుగా నిలుస్తారు. ఉన్నవ ఎప్పటికీ నిలిచివుండే రచయిత.

**( కేంద్రసాహిత్య అకాడమీ, అమరావతి సామాజిక అధ్యయన సంస్థ గుంటూరులో 5 డిసెంబర్ 2021న నిర్వహించిన మాలపల్లి నవల శత జయంతి సదస్సులో సమర్పించిన ప్రసంగ వ్యాసం.)**



# మాలపల్లి
# కుటుంబం
# స్త్రీ పురుష సంబంధాలు



❑ కాత్యాయనీ విద్మహే

" మాలపల్లి నవల రాసే నాటికి భారతీయ సమాజంలో కుల మత వర్గ రాజకీయ వ్యవస్థలలో ఏ సంఘర్షణ, సంవాదం సాగుతున్నాయో వాటన్నిటిని గురించిన అవగాహన, ప్రభావాల నేపథ్యం నుండి ఇతివృత్తాన్ని అభివృద్ధి చేసినట్లే ...

స్త్రీ పురుష సంబంధాల విషయంలో సమకాలంలో జరుగుతున్న చర్చలో లేవనెత్తబడుతున్న కొత్త ప్రశ్నలకు జవాబులు వెతికే క్రమాన్ని కూడా ఇతివృత్తంలో భాగం చేసాడు ఉన్నవ లక్ష్మీనారాయణ. "

**మా**నవ జీవిత సమస్య ఏది సాహిత్యానికి వస్తువైనా ఆ సమస్యకు కారణమైన వాళ్ళు కావచ్చు, కర్తలు కావచ్చు, కర్మ ఫలం అనుభవిస్తున్నవాళ్ళు కావచ్చు అంతా అయితే ఆడవాళ్లు, లేదా మగవాళ్లు. భౌతిక రూపం ఒకటై మరొక లింగ స్వభావాన్ని, అస్తితను స్వాయత్తం చేసుకొన్నవాళ్ళు కూడా కావటానికి వీలుంది అన్నది నేటి అవగాహన. మాలపల్లి నవల వరకు మాట్లాడుకొంటే వాళ్ళు స్త్రీ పురుషులు మాత్రమే. అంటరాని సమస్యా, అస్వతంత్రత, ఆకలి సమస్య లేదా సంపద అనుభవం స్త్రీపురుషులకు ఒకటే కావచ్చు కానీ స్త్రీలకు మాత్రమే ప్రత్యేకమైన సమస్యలు ఉంటాయన్నది స్పష్టమే. అట్లాగే స్త్రీ పురుషుల మధ్య కౌటుంబిక సామాజిక సంబంధాలతో పాటు లైంగిక సంబంధాలు ఉంటాయి. ఈ సంబంధాలు ఇలా ఉండాలని నిర్దేశించిన ధర్మశాస్త్రాలు ఉన్నాయి. అయితే ఆ సంబంధాలలోని గతానుగతికత్వానికి, మనో ప్రవృత్తులకు మధ్య ఘర్షణ ఏర్పడినప్పుడు ఉన్న సమస్యల సరసన సరికొత్త నాటకం నడుస్తుంది. ఇది జీవితంలోనూ ఉంటుంది. కానీ సాహిత్యంలో సాంద్రీకరించి ప్రదర్శించబడుతుంది. మాలపల్లి నవలలో అదెట్లా జరిగిందో పరిశీలించటమే ఈ వ్యాసం ఉద్దేశం.

## 1

మాలపల్లి నవలకు మాల మాదిగల సాంఘిక ఆర్థిక జీవిత సంఘర్షణ ప్రధాన వస్తువు. మాలపల్లి ఉనికి ఊరి తోటి సాపేక్ష సంబంధంలోనే. కనుక మాలపల్లి జన జీవిత సంఘర్షణ ఊరిలోని సవర్ణ హిందువుల సంబంధంలోదే. వాళ్ళ ప్రయోజనాలకు అనుగుణంగా పనిచేసే ప్రభుత్వాధికార వ్యవస్థలతోనే. దీనిని సమకాలీన అస్పృశ్యతా వ్యతిరేక ఉద్యమం, రైతుకూలీ ఉద్యమం, స్వరాజ్య ఉద్యమం అన్న మూడు ముఖాలతో అన్వయిస్తూ ఇతివృత్తాన్ని అభివృద్ధి చేసి ఉన్నవ లక్ష్మీ నారాయణ 1922లో వ్రాసిన నవల మాలపల్లి. అయితే ఇతివృత్తానికి చలన చైతన్యాలు ఇచ్చే మనుషుల మధ్య అంటే పాత్రల మధ్య ఉండే సంబంధాలు. అవి సేవ్య సేవక సంబంధాలు, స్నేహ సంబంధాలు, ప్రేమ సంబంధాలు, ప్రజాస్వామిక సంబంధాలు, అధికార సంబంధాలు, స్త్రీ పురుష సంబంధాలు ... ఇలా రకరకాలుగా ఉంటాయి. వాటిలోని భావోద్వేగాలు, మానసిక ఉద్రేకాలు, ఆవేశాలు, ఆగ్రహాలు,

**సమకాలీన అస్పృశ్యతా వ్యతిరేక ఉద్యమం, రైతుకూలీ ఉద్యమం, స్వరాజ్య ఉద్యమం అన్న మూడు ముఖాలతో అన్వయిస్తూ ఇతివృత్తాన్ని అభివృద్ధి చేసి రాసిన నవల మాలపల్లి. ఇతివృత్తానికి చలన చైతన్యాలు ఇచ్చే మనుషుల మధ్య అంటే పాత్రల మధ్య ఉండే సంబంధాలు. అవి సేవ్య సేవక సంబంధాలు, స్నేహ సంబంధాలు, ప్రేమ సంబంధాలు, ప్రజాస్వామిక సంబంధాలు, అధికార సంబంధాలు, స్త్రీ పురుష సంబంధాలు ...**

ఆలోచనలు ఆచరణగా పరివర్తితమవుతూ ఆచరణలో పొందే అనుభవం మళ్ళీ ఆలోచనలకు, ఉద్వేగాలకు కారణమవుతూ మనిషి చేసే ఒక నిరంతర జీవన యాత్రా సౌందర్యం ఆవిష్కృతం అవుతుంటుంది. ఈ దృష్ట్యా మాలపల్లి నవలలోని స్త్రీపురుష సంబంధాల పరిశీలన, విశ్లేషణ అవసరం.

మాలపల్లి నవల వ్రాసే నాటికి భారతీయ సమాజంలో కులమతవర్గ రాజకీయ వ్యవస్థలలో ఏ సంఘర్షణ, సంవాదం సాగుతున్నాయో వాటన్నిటిని గురించిన అవగాహన, ప్రభావాల నేపథ్యం నుండి ఇతివృత్తాన్ని అభివృద్ధి చేసినట్లే ఉన్నవ లక్ష్మీనారాయణ స్త్రీ పురుష సంబంధాల విషయంలో సమకాలంలో జరుగుతున్న చర్చలో లేవనెత్తబడుతున్న కొత్త ప్రశ్నలకు జవాబులు వెతికే క్రమాన్ని కూడా ఇతివృత్తంలో భాగం చేసాడు.

సంఘ సంస్కరణోద్యమం ప్రధానంగా స్త్రీ సమస్యను చర్చించింది. వితంతు వివాహాలను తలపెట్టటంలో ఒక రకంగా స్త్రీకి శరీరం, దానికి యవ్వన సహజమైన కోరికలు ఉంటాయి కదా, వాటిని తీర్చుకొనటానికి గౌరవకరమైన మాధ్యమం ఒకటి ఉండాలి కదా అన్న ఆలోచన ఉంది. రహస్య సంబంధాలలో, అక్రమ సంబంధాలలో, అవాంఛనీయ గర్భాలతో, గర్భస్రావాలతో స్త్రీలు హింసామయ జీవితం గడపాల్సిన అవసరం లేదన్న మానవీయ స్పందన నుండే వీరేశలింగం వంటి వారు పునర్వివాహాలకు సామాజిక ఆమోదం సమకూర్చిపెట్టేందుకు ఉద్యమించారు. అక్కడ నుండి మొదలు పెట్టి స్త్రీల శారీరక బౌద్ధిక మానసిక వికాసానికి వీరేశలింగం నుండి గురజాడ మీదుగా జరుగుతున్న ఒక పరిణామాన్ని ఉన్నవ గమనిస్తూ ఉన్నాడు. అదే సమయంలో 1912 నాటికి రాయప్రోలు సుబ్బారావు లలిత, తృణకంకణం అనే రెండు కావ్యాలు వ్రాసి అమలిన శృంగారం అనే ఒక కొత్త భావనను ఆధునిక సాహిత్య ప్రపంచంలోకి ప్రవేశపెట్టాడు. స్త్రీపురుష సంబంధాలను కేవలం లైంగిక సంబంధాలుగా మాత్రమే చూసే భూస్వామ్య సమాజం బూర్జువా సమాజంగా పరివర్తన చెందుతున్న దశలో స్త్రీ పురుషులు కలిసి పనిచేయవలసి ఒక సామాజిక వాతావరణం ఏర్పడుతున్నప్పుడు స్త్రీ పురుషుల మధ్య ఉండవలసిన సంబంధాలు పూర్వంలాగానే ఉంటాయా? స్నేహం, ప్రేమ అనేవి ఇద్దరు పురుషులకు మధ్య వున్నట్లు స్త్రీపురుషుల మధ్య ఉండటానికి వీలులేదా అన్న ప్రశ్నలతో రాయప్రోలు చేసిన ఒక ఊహ అమలిన శృంగారం. అట్లాగే 1921లో చలం మొదటి నవల శశిరేఖ వచ్చింది. కుటుంబం కంటే, పెళ్లి కంటే స్త్రీ ఆకర్షణకు ప్రాధాన్యం ఇచ్చి ఆ ఆకర్షణ నుండి స్వేచ్ఛగా ఇల్లు వదిలి వెళ్ళటానికి ఉన్న అవకాశాలను, అవసరాన్ని గురించిన కొత్త భావజాలాన్ని చర్చకు తెచ్చిన నవల అది. ఈ విధంగా అటు సామాజిక రంగంలో, ఇటు సాహిత్య సాంస్కృతిక భావజాల రంగాలలో స్త్రీ పురుష సంబంధాలకు సంబంధించి తన కాలానికి వస్తున్న ఈ కొత్త ప్రశ్నలను ఉన్నవ మాలపల్లి నవల ఇతివృత్తంలో భాగం చేసాడు.

నవల అంటే బహుళత్వం, వైవిధ్యంతో కూడిన మానవ సమూహపు సంబంధ వైరుధ్యాల సంఘర్షణల సమన్వయాల ఆచరణల నుండి సత్య సుందరంగా, సారవంతంగా రూపొందే జీవిత సమగ్ర చిత్రపటం. స్త్రీపురుష సంబంధాలు అందులో సహజ భాగం. స్త్రీపురుషులు కుటుంబంలో తల్లీ బిడ్డలు, తండ్రీ బిడ్డలు, సోదరీ సోదరులు ఇలా రకరకాల రక్త సంబంధాలలో, బంధుత్వ సంబంధాలలో ఉంటారు. అది ఒక రకం. భార్యాభర్తలుగా సాహచర్య సంబంధాలలో ఉండటం మరొక రకం. సామాజిక స్నేహ సంబంధాలు ఇంకొక రకం. ఈ మూడు రకాల సంబంధాలు మాలపల్లి నవలలో కనబడతాయి. మాలపల్లి నవల స్త్రీపురుష సంబంధాలు ఎలా ఉన్నాయో, ఎలా ఉంటున్నాయో, ఏ రకమైన వైరుధ్యాలతో కూడుకొని ఉన్నాయో, ఇతివృత్త గమనంలో భాగంగా పాత్రల ప్రవర్తనా రీతుల నుండి నిరూపిస్తుంది. అదే సమయంలో స్త్రీపురుష సంబంధాల గురించిన భావజాల విచికిత్సనూ చేస్తుంది.

ఈ నవలలో ప్రధానంగా కనబడే కుటుంబాలు రెండు. అవి రామదాసు కుటుంబం, చౌదరయ్య కుటుంబం. కుటుంబాలు పురుషులవి. వాళ్ళ పెత్తనం కింద వర్ధిల్లేవి. కుటుంబంలో పెద్ద, యజమాని అయిన పురుషుడికి మిగిలిన పురుషులతో మొత్తంగా స్త్రీలతో ఉండే సంబంధాలు అధికార సంబంధాలే. స్త్రీల అవసరాలు, శక్తి సామర్థ్యాలు, స్వీయ వికాసం మొదలైనవి చర్చకు వచ్చిన సంస్కరణ కాలం కానీ, వ్యక్తుల, జాతుల విముక్తిని ఆకాంక్షించే సమానత్వం, స్వేచ్ఛ, స్వాతంత్ర్యం మొదలైనే ఆధునిక విలువల కాలం కానీ, స్వరాజ్య సాధన కోసం జరుగుతున్న ఉద్యమం కానీ కుటుంబంలోని అధికార సంబంధాలను ఏమైనా కదిలించగలిగిందా అన్న ప్రశ్నకు ఈ రెండు కుటుంబాలలోని మనుషుల సంబంధాలను పరిశీలిస్తే జవాబు దొరుకుతుంది.

రామదాసు కుటుంబంలో భార్య మాలక్ష్మి, కూతురు జ్యోతి, కొడుకులు వెంకటదాసు, సంగదాసు ఉన్నారు. రామదాసు చెల్లెలు సుబ్బలక్ష్మి ఉంది. ఆమె కొడుకు అప్పదాసు మేనమామ ఇంట్లోనే వ్యవసాయపు పనులకు తోడుగా ఉన్నాడు. రామదాసుకు కొడుకులకు మధ్య స్నేహం, ఒకరి అభిప్రాయాలు ఒకరు వినగలిగిన సహనం ఉన్నాయి. చిన్న వాళ్ళు చెప్పటం నేను వినటం ఏమిటన్న అహంకారం, అధికార ప్రదర్శన రామదాసులో లేవు. జనం ఆరోగ్యానికి హానికరమైన పొగాకు పండించి వ్యాపారం చేయటం అనైతికం అనుకున్నాడో బ్రిటిష్ ప్రభుత్వ పొగాకు ఉత్పత్తులకు ముడి సరుకు పోకూడదు అని అనుకున్నాడో కానీ సంగదాసు పొగాకు పంట పెట్టవద్దని అంటే తండ్రి దానిని ఆమోదించటం అందులో భాగమే. సంగదాసు

**ఊరి నుండి ఎదుర్కొంటున్న వివక్షకు విరుగుడుగా మాలపల్లిని మానవుల సాధు జంతువుల, క్రూరమృగాల సహవాస సహజీవన కేంద్రాలుగా ఉండే మునిపల్లెగా పరివర్తింప చేసే క్రమానికి ప్రాధమిక యూనిట్‌గా కుటుంబం ప్రయత్న పూర్వక అభ్యాసంతో పరివర్తన చెందవలసిన రీతి గురించి ఉన్నవ లక్ష్మీ నారాయణ కన్న కలా ఇది?**

మరణానికి, ఆ తరువాతి పరిణామాలకు క్రుద్ధుడై ప్రతీకారంగా పెద్ద కొడుకు వెంకటదాసు పట్టిన మార్గం తనకు అంగీకారం కాకపోయినా గౌరవించటమూ అందులో భాగమే. అప్పాదాసును పెళ్లి చేసుకొనటం జ్యోతికి ఇష్టమో కాదో తెలుసుకొనమని భార్యకు చెప్పటం కానీ, పెళ్లి అక్కరలేదన్న కూతురి సమాధానానికి 'ఇష్టపూర్తిగా అక్కర లేకపోతే పోనీ' అనగలిగిన నిబ్బరం కానీ రామదాసుకు అధికార స్వభావాన్ని చైతన్యవంతంగా వదుల్చుకొనే క్రమంలో అలవడిన సంస్కార ఫలితమే.

ఇంటి ఇల్లాలిగా బిడ్డల పోషణ, వంటా వడ్డన, చేను నుండి వచ్చిన భర్తకు దాహానికి నీళ్లియ్యటం, స్నానానికి నీళ్లు తోడి పెట్టటం వంటి అన్ని పనులూ మాలక్ష్మివే. కష్టకాలంలో రామదాసు గుడ్డల మూటలు నెత్తిన పెట్టుకొని అమ్ముకురావటానికి పోతున్నాడని బాధపడుతూ ఇంట్లో పనికి భంగం లేకుండా మగ్గం ఏకుల రాట్నం పెట్టుకొని కూతురితో కలిసి పనిచేయటం గురించి కూడా ఆలోచించిన స్త్రీ ఆమె. ఇంటికి, పశువులకు కావలసిన నీళ్లన్నీ తోడిపోసే వెంకటదాసు, అప్పదాసు, వాళ్లకు సైదోడుగా వచ్చే రామదాసు... ఇంట్లో మాలక్ష్మి కష్టాన్ని గుర్తించి పంచుకొన్నవాళ్ళే. రామదాసుది ఆధ్యాత్మిక విద్య. కొడుకులవి లౌకిక విద్యలు. ఆడపిల్ల జ్యోతికి పంచకావ్యాలు చదివి పాండిత్యాన్ని పొందగల స్థాయిలో అవకాశం కల్పించటం సమానత్వం అనే విలువ ఆ కుటుంబపు సంస్కారంగా పరివర్తన చెందిన స్థితినే చెబుతుంది. మృదుత్వం, పరస్పర అభిమానాలు తప్ప ఆ కుటుంబంలో మనుషుల సంబంధాలలో కాఠిన్యం అన్నది కనబడదు.

రామదాసైనా కొడుకులైనా, కూతురైనా మాలక్ష్మి పట్ల ప్రేమానురాగాలు గౌరవం కలవాళ్లే. ఆమెకు అంతకన్నా అతనిని చెట్టబెట్టినందుకు, ఆ పిల్లలను కడుపున కన్నందుకు సంతోషం, సంతృప్తి. కల్పాంతన బ్రహ్మ నశించినా రామదాసు తోటి వివాహ బంధం చెదరకుండుగాక అన్నది ఆమె ప్రగాఢ వాంఛ. జన్మజన్మలకు ఆ పిల్లలు తన కడుపున పుట్టాలన్నంత ప్రేమ. ఆ పిల్లలకు కూడా అంతే. జన్మజన్మలకు వాళ్లే తల్లిదండ్రులు కావాలన్నంత ఇష్టం. భార్యాభర్తల సంబంధంలో గానీ తల్లిదండ్రులకు బిడ్డలకు మధ్య సంబంధంలో గానీ ఈ పరస్పర విశ్వాసం ఎలా సాధ్యమైనది? ఒకరి మీద ఒకరికి పెత్తనం లేని, చిన్న చూపే లేని ప్రజాస్వామిక సంస్కారం వల్ల, వినికిడి వల్లనో, స్వయంగా చదువుకొనో జీవితం విలువ, ప్రేమ విలువ తెలుసుకొన్నవాళ్ళు కావటం వల్ల, ఎవరికి కలిగిన ఆలోచనలు వాళ్ళు బయటకు చెప్పగల చనువు ఎదుటివారి ఆలోచనల అభిప్రాయాల సామంజస్యాన్ని అర్థం చేసుకొనే సహనం అభివృద్ధి చేసుకోగలిగినందు వల్ల. ఒకరిమీద ఒకరికి పెత్తనాలు లేని ప్రజాస్వామిక సంబంధాలు వాళ్ళు ఎలా నిర్మించుకోగలిగారు? ఆచరించగలిగారు? కత్తి పద్మారావు గారు వంటి వాళ్ళు చెప్తున్నట్లు ... మాల మాదిగలు శ్రమ జీవులుగా ప్రకృతి సహజమైన, ఆరోగ్యకరమైన ఆదిమ తత్వానికి దూరం కాకపోవటం వల్లనా!? ఊరి నుండి ఎదుర్కొంటున్న వివక్షకు విరుగుడుగా మాలపల్లిని మానవుల సాధు జంతువుల, క్రూరమృగాల సహవాస సహజీవన కేంద్రాలుగా ఉండే మునిపల్లెగా పరివర్తింప చేసే క్రమానికి ప్రాధమిక యూనిట్‌గా కుటుంబం ప్రయత్నపూర్వక అభ్యాసంతో పరివర్తన చెంద వలసిన రీతి గురించి ఉన్నవ లక్ష్మీ నారాయణ కన్న కలా ఇది?

ఇక చౌదరయ్య కుటుంబం ఎలా ఉన్నది? కొడుకు ఏమి చేయాలో చౌదరయ్య నిర్ణయిస్తాడు. తహసీల్దార్ కాగలిగిన చదువు రామానాయుడికి చెప్పించాడు. ఊళ్ళో ఉండి వ్యవసాయం నేర్చుకొని చేసుకోవాలని అతను అనుకొంటుంటే ఉద్యోగంలో ప్రవేశ పెట్టాలని ఆయన అనుకొంటాడు. కొడుకులో చలనం లేదని భార్య మీద విసుక్కొంటాడు. ఉ ద్యోగానికి పొమ్మని కొడుక్కు చెప్పమని భార్యను ఒత్తిడి పెడతాడు. బియ్యాలు, పప్పులు అప్పులు పెడుతున్నదని, అడిగినవాళ్లకు చల్ల పోస్తుందని, ఆకలిగొన్నవాళ్లకు అన్నం పెడుతుందని కొంప గుల్ల చేస్తున్నదని భార్యపై విసుక్కొంటాడు. సంగదాసుతో కొడుకు స్నేహాన్ని మాల సావాసం అంటూ ఈసడించుకొంటాడు. కొడుకును తాసీల్దారును చెయ్యాలనుకొన్నవాడు మనుమడిని డిప్యూటీ కలెక్టర్‌ను చేద్దామనుకొంటాడు. వారసత్వపు వ్యాజ్యంలో వచ్చిన పది ఎకరాలు సాహూ పేరపెట్టి, దాని మీద వచ్చే ఆదాయం అంతా వాడి పై చదువుకు ఉపయోగిస్తానని అంటాడు. ఇంగ్లీషు చెప్పిస్తే రెపరెపా పైకొస్తాడని, వాడిచేత డిప్టీ కలెక్టర్ చేయించాలె అని అనుకొన్నాడు.

ఇందులో రెండు అంశాలు ఉన్నాయి. ఒకటి : అందరి జీవితం తానే జీవించాలనుకొనటం. కొడుకుకైనా, మనవడికయినా వాళ్లకు ఏమి కావాలని ఉన్నదో ఆయనకు అవసరం లేదు. వాళ్ళేమి కావాలో తాను నిర్ణయిస్తాడు. అది పూర్తిగా అధికార లక్షణం. ఇది ఆయనకు ఎక్కడినుండి వచ్చింది? డబ్బుతో దేనినైనా సాధించగలను అన్న అహం నుండి వచ్చింది. డబ్బు సంచులు కుమ్మరించి హత్యానేరాన్ని తప్పించుకోగలడు. డబ్బు ఖర్చయిందన్న అక్కసుతో బాధితుడి మీదే వారసత్వపు దావా తెచ్చి మళ్ళీ డబ్బు పెట్టి గెలవగలడు. ఇక రెండవది : దానిని చదువుకు పెట్టుబడిగా పెట్టి మనుమడిని అంతకు అనేక రెట్లు ఆదాయమూ , అధికారమూ తెచ్చిపెట్టగల డిప్యూటీ కలెక్టర్ చెయ్యాలని అనుకొనటం. అందులో ఆస్తి సంపాదించగలిగిన ప్రయోజకత్వం గురించిన అహం ఉన్నది. నీలిమందు, పత్తి మొదలైన వాణిజ్య పంటలు పండించటంలో ఏ పెట్టుబడి లాభం సూత్రం పని చేస్తున్నదో మనుమడి చదువు విషయంలో కూడా అదే సూత్రాన్ని అన్వయించుకొనే దృష్టి ఉంది. ఆస్తులను కాపాడుకొనటానికి,

ఆస్తుల సంపాదనకు చేసే నేరాలు కప్పి పుచ్చుకొనటానికి అధికార వర్గంలో పలుకుబడి అవసరం ఉంటుంది. దానిని తీర్చుకొనటానికి మనుమడికి ఇంగ్లిష్ చదువు, డిప్యూటీ కలెక్టర్ పదవి. పెట్టుబడి పెట్టగలనన్న బడాయి, పెట్టుబడి గిట్టుబాటు అయ్యే హోదాను సంపాదించగల చదువు పట్ల ఆశ ఇవి నడిపించాయి చౌదరయ్యను. లక్షలు కోట్లు పెట్టుబడిగా ప్రయివేట్ రంగంలో విద్య పొందటం ఎక్కువైన ఈ కాలపు స్వార్థ సంపాదనా పర దృష్టికి చౌదరయ్య ఒక మూల నమూనాగా అనిపిస్తాడు. మొత్తం మీద ఆస్తిపర వర్గాలు కన్న పిల్లల విషయంలో కూడా ప్రజాస్వామిక సంస్కృతికి, మానవతకు దూరం అయిపోవటం విషాద వాస్తవం.

రామానాయుడికి కూడా తండ్రి పట్ల చనువు కనబడదు. తన అభిప్రాయాలను నిక్కచ్చిగా సంగదాసో, వెంకటదాసో తండ్రి దగ్గర చెప్పగలిగినట్లు రామానాయుడు చెప్పలేడు. తండ్రి ఉద్యోగంలో చేరమంటే ముఖాముఖీ ఎదిరించలేదు, కానీ ఉద్యోగంలో చేరే వయసు దాటేవరకు తాత్సారం చేస్తూ తాను అనుకొన్నది చేసాడు. వ్యవసాయం చేయటం, సంగదాసుతో స్నేహం, పంచమోద్యమంలో పనిచేయటం మొదలైన ఏ విషయంలోనైనా తండ్రితో ముఖాముఖీ ఘర్షణ పడవలసిన సందర్భాలను తప్పించుకొంటూ పోవటమే అతని వ్యూహం. తండ్రిని ప్రతి విషయంలోనూ ప్రతిఘటించటం ఇష్టంలేక సమ్మెలలో ప్రత్యక్ష సంబంధం పెట్టుకోలేదంటే రామానాయుడు తనను తాను కుదించుకొనటం ఏ స్థాయిలో ఉందో ఊహించ వచ్చు. తండ్రి చనిపోయాక గానీ బంధనాలన్నీ వదిలినవి అని భావించి పూర్తిగా పంచమ, కార్మిక ఉద్యమాలలోకి వెళ్లలేకపోయాడు. కుటుంబం, తండ్రి అధికారం అనేవి వ్యక్తిత్వ వికాసానికి, ఆశయాలను, ఆదర్శాలను వాస్తవీకరించుకోగల మార్గంలో ప్రయాణానికి అవరోధం అయ్యే స్థితిని చూస్తాం.

భర్త డబ్బు యావ, తన ఇష్టప్రకారం అందరూ నడవాలనే పెత్తందారీ లక్షణం లక్ష్మమ్మకు ఇష్టం కావు. తోటి మానవుల పట్ల కరుణ, కష్టంలో ఉన్నవాళ్లను చూసి కరిగిపోవటం, శ్రమ పట్ల గౌరవం, కృతజ్ఞత వంటి లక్షణాలు ఆమె మిగుల్చుకోగలిగింది. వ్యవసాయం చూసుకొంటూ రామానాయుడు ఇంటిపట్టునే ఉంటాననంటే కొడుకును విడిచి ఉండలేని తల్లిగా సంతోషపడటంలో కొడుకు అభిప్రాయాన్ని మన్నించగల సంస్కార లక్షణం కూడా మిళితమయ్యే ఉంది. ఆస్తితో ప్రత్యక్ష సంబంధం లేకపోవటం వలన స్త్రీలు మిగుల్చుకొన్న మానవత్వ లక్షణంగా దానిని భావించవచ్చేమో!

చౌదరయ్య అన్న కొడుకు వెంకటయ్య. కన్నకొడుకు రామానాయుడు. ఉమ్మడి సంసారం. వెంకటయ్యకు నలుగురు కూతుళ్లు. రామానాయుడికి ఒక కొడుకు సాహూ. వాడికి జబ్బు చేసినప్పుడు నాయనమ్మ లక్ష్మమ్మ బాధపడుతూ శాంతమ్మతో "దరి మాలిన ఆస్తి ఉంది. పెద్దవాడికి ఆడచెత్త తప్ప ఇంత మగనలుసు పుట్టకబోయేను. రెండు కుటుంబాలకూ తారకం వీడే. పంచ ప్రాణాలూ వీడి మీద బెట్టుకొని ఉన్నాం" అని చెబుతుంది. ఆస్తి ఉన్న చోట ఆడపిల్లలు చెత్త అయిపోతారు. మగపిల్లవాడు ఉద్ధరించే వాడవుతాడు. కుటుంబ జీవనానికి అందరూ శ్రమచేయటానికి అవసరమైన భూమి మాత్రమే ఉన్నచోట వ్యత్యాసాలకు తావుండదు అని రామదాసు కుటుంబం నుండి తెలుసుకోవచ్చు. చేనులో ఉన్న తండ్రికి మధ్యాహ్నం అన్నం తీసుకువెళ్లిన జ్యోతి కూడా పనిలో భాగస్వామి అయినట్లే. చౌదరయ్య కుటుంబాన్ని చూపి 'దరి మాలిన ఆస్తి' మానవ సంబంధాలలో సృష్టించే విధ్వంసం వైపు మన ఆలోచనలను ప్రేరేపిస్తాడు రచయిత.

**ఆస్తి ఉన్న చోట ఆడపిల్లలు చెత్త అయిపోతారు. మగపిల్లవాడు ఉద్ధరించే వాడవుతాడు. కుటుంబ జీవనానికి అందరూ శ్రమచేయటానికి అవసరమైన భూమి మాత్రమే ఉన్నచోట వ్యత్యాసాలకు తావుండదు. ఈ విషయాన్ని రామదాసు కుటుంబం నుండి తెలుసుకోవచ్చు.**

## 2

మాలపల్లి నవలలో కమలమ్మ ఉదంతం ఒక ఉపకథ. కమలమ్మ రామానాయుడి భార్య. నవల రెండవ భాగంలో గానీ ఈ పాత్ర పరిచయం కాదు. విజయవాడలో పంచమ మహాసభకు వెళ్లి అటునుండి రామానాయుడు పుట్టింట్లో ఉన్న భార్యను కొడుకును తీసుకొని వెళ్ళటానికి నాదెళ్ల వెళతాడు. మేడ దిగివస్తున్న కమలమ్మ అందాన్ని, నాగరిక అలంకరణను రచయిత వర్ణిస్తాడు. ఇంటి పనికి ముందుబడని స్వభావాన్ని కూడా సూచిస్తాడు. కొడుకు సహదేవరావుని సాహూ అని ముద్దు చేసే అలివి మాలిన ప్రేమ. భర్త పట్ల అసంతృప్తి కూడా ఏమీ కనబడదు. పైగా భర్తకు తనపట్ల ఉన్న అభిమానం గురించి ఒకింత గర్వం కూడా లోలోపల ఉండటం నాదెళ్లలో తనను చూడవచ్చిన సావాసకత్తె కోటమ్మ తోటి సంభాషణలో కనబడుతుంది. అటువంటి కమలమ్మ మొదటి పరిచయంలోనే మోహనరావు ఆకర్షణలో పడి అతనితో వెళ్ళిపోవటం ఎలా సాధ్యమైంది? ఆలోచించాల్సిన విషయం.

పుట్టింటి వాళ్ళు అత్తింటివాళ్ళు కూడా లక్షాధికారులు కావటం కమలమ్మకు కాస్త పై చూపును ఇచ్చాయి. శ్రమ పట్ల ఆసక్తి, గౌరవం లేకుండా చేశాయి. చాకిరీ చేసే కర్మ నాకేమి అనుకొనే స్థాయి ఆమెది. కొడుకును ఉద్యోగానికి పంపాలన్న మామగారి ఆలోచన ఆమెకూ ఇష్టమైనదే. అందుకనే గుంటూరుకు ఉద్యోగానికి వెళతారా అని, రామానాయుడు వెళ్తే బాగుండు అన్నట్లుగానే మాట్లాడుతుంది. గుంటూరులో కాపురం పట్ల తన కోరికను కూడా తెలిపింది. పాతికేళ్ల ఉద్యోగ వయో పరిమితి కాలం దాటిపోయిందని భర్త చెప్పాక ఆమె ఆలోచన ఆస్తి పంపకాల వైపు పోయింది. ఒక తల్లి బిడ్డలు కాదు గనుక కలిసి ఉండాల్సిన అవసరం లేదన్నట్లు అన్నదమ్ములు భాగాలు పంచుకోమని సలహా ఇచ్చింది. ఆస్తిని మూడు వాటాలు చేసి చౌదరయ్య, వెంకటయ్య, రామానాయుడు పంచుకోవాలన్న అభిప్రాయం కూడా ప్రకటించింది. వెంకటయ్య మూడవ భాగానికి కాక ఆస్తిలో సగం వాటాకు హక్కుదారుడు అని భర్త

**ప్రపంచమంతా మగవాడిది అయితే ఆ మగవాడు ఒక్కడే ఆడదాని ప్రపంచంగా చేయబడిన సమాజం ఇది. రామానాయుడికి బయటి స్నేహాలు, వ్యవసాయ వృత్తులు, పంచమోద్యమ కార్మికోద్యమ ఆసక్తులు పుష్కలం. కమలమ్మ ప్రపంచం భర్త రామానాయుడు ఒక్కడే.ప్రపంచాన్ని గురించి ఆలోచించే అతడికి భార్య అవసరాలు, ఆకాంక్షలు పట్టలేదు.**

చెప్పిన మాట ఆమెకు తెలివి తక్కువదిగా అనిపించింది. 'చాలా ఆస్తి మీ నాయన స్వార్జితమట కదా' అంటూ దానిని సవాల్ చేయబోయింది. ఈ మొత్తం క్రమంలో మనుషుల సంబంధాలను ఆస్తి సంబంధాలుగా చూసే లక్షణమే కమలలో ప్రముఖంగా కనబడుతుంది.

భర్త ఉద్యోగానికి వెళ్లే అవకాశం లేదని తెలిసి గుంటూరులో కాపురం పెట్టే మార్గం మూసుకుపోయిందన్న అసంతృప్తి ఒకవైపు, ఆస్తి పంపకం విషయంలో అతను కనబరచిన వైఖరి మరొక వైపు చిత్తవృత్తిని కలవరపరచిన సందర్భంలో ఆ ఇంటికి చుట్టపు చూపుగా వచ్చాడు మోహనరావు. రామానాయుడికి పినతల్లి కొడుకు. గుర్రపు బండిలో నుండి దిగిన అతనిని మేడ పైనుండే గుర్తించింది కమల. అందువల్ల ఇది వాళ్లకు తొలి పరిచయం కాదు. కానీ ఇదివరకు లేని కలవరం ఆమెలో ఎందుకు బయలుదేరింది? ఓరకంట అతని షోకు పురుషుడి వేషాన్ని చూడటం, బావి దగ్గర నీళ్లు తోడిపోసుకొనే అతని శరీర సౌష్టవాన్ని చూస్తూ నిల్చోటం ఇవన్నీ ఉద్యోగం పట్ల, గుంటూరు కాపురం పట్ల, ఆస్తి పట్ల ఏ మాత్రం ఆసక్తి చూపని భర్త పట్ల అంతరంగంలో మొలకెత్తిన ఒకానొక వైముఖ్య భావం యొక్క ప్రతిచర్యలో భాగం అయివుండాలి.

మధ్యాహ్నం భోజనం చేసి మేడమీదకు వచ్చిన అన్నదమ్ములిద్దరికీ తాంబూలాలు చుట్టి ఇచ్చిన కమల వాళ్ళ సంభాషణ వింటూనే ఉంది. భర్త మోహనరావును పంచమోద్యమం పట్ల అతని ఆసక్తి గురించి అడిగాడు. పంచముల దుస్థితి నీవెప్పుడూ స్వయంగా చూడలేదా అని ప్రశ్నించాడు. వాళ్ళతో నాకేమి పని అన్నది మోహనరావు సమాధానం. ఈ ఉద్యమాలు తనకు గిట్టవని, ఉద్యమాలు నెత్తిన పెట్టుకొని అహోరాత్రాలు ఊపిరి సలపకుండా తిరిగేవాళ్ళంటే జాలి అని తన అభిప్రాయం చెప్పాడు. అతనిని విశ్రాంతి తీసుకోమని చెప్పి రామానాయుడు ఆ పని మీదే పాలెం వెళ్ళాడు. ఈ సన్నివేశం కమలమ్మ మనసులో భర్త పట్ల మొలకెత్తుతున్న వైముఖ్యానికి నీరుపోసి పెంచి ఉండాలి. భర్తకు పంచమోద్యమం పట్ల ఉన్న ఆసక్తి, ఆ పనిలో ఊపిరి సలపకుండా ఊళ్ళు పట్టుకు తిరిగే స్వభావం కారణంగా తాను అనుభవిస్తున్న ఒంటరితనం గురించిన స్పష్టత మోహనరావు మాటలవల్ల ఆమెకు కలిగి ఉంటుంది. ఉద్యమాల్లో తిరిగే వాళ్ల పట్ల మోహనరావు ప్రకటించిన జాలికి అసలైన అర్థాలు తానే అనిపించినా ఆశ్చర్యం లేదు. పాలెం వెళ్లి భర్త కలిగించిన ఆ ఏకాంతంలో మోహనరావు ఆమె మనసును ఆక్రమించటం అర్థం చేసుకోవచ్చు.

మోహనరావుకు సాయంత్రపు ఫలహారం తయారు చేసి తెచ్చి అతనింకా నిద్రలేవక పోవటంతో కమల వీణను వాయిస్తూ 'రమణీమణి వేగమె పోగదె – సామిని తేగదె' అంటూ పాడిన జావళి అప్పటి ఆమె మనోస్థితిని సూచించేదే. రామానాయుడి సాన్నిధ్యం, సాహచర్యం తగినంత లభించక పోవటం వలన అంతరంగంలో ఏ మూలకో తోసేసిన అసంతృప్తి విరహ శృంగార గానంగా వ్యక్తమైంది. అదే అసంతృప్తి మూలం మోహనరావుపై ఆకాంక్షా రూపం తీసుకొన్నది.

కమల వీణ వాయించగలదని, సమ్మోహనంగా పాడగలదని అప్పటివరకు పాఠకులకు తెలియదు. భర్తతో కలిసి పచ్చీసు ఆడాలనుకొనే కమల భర్తను తన వీణావాదనతో, గాన మాధుర్యంతో మురిపించి మెప్పు పొందాలనుకొనటం సహజం. కానీ రామానాయుడి అన్యకార్యవ్యగ్రత ఆమెకు పెద్దగా అటువంటి అవకాశం ఇచ్చి ఉండదు. తనలోని కళను భర్త గుర్తించనట్లు తెలుస్తుంటే అది కూడా అసంతృప్తి మొలక రెమ్మలు వేయటానికి కారణం అయివుంటుంది. పాలెం పోయిన భర్త ఆ రాత్రికే కాదు, అదే పంచమోద్యమ పనుల మీద పక్క ఊళ్లకు తిరుగుతూ మర్నాడు కూడా ఇంటికి రాలేదు. ఈ వ్యవధి మోహనరావు ఆమె హృదయంలో మరింత పాతుకు పోవటానికి ఉపయోగపడింది. మోహనరావు పట్ల పెరిగిన మోహం కాపురాన్ని, కన్న కొడుకుని వదిలి వెళ్లిపోవటానికి ఆమెను సిద్ధపరిచింది.

ప్రపంచమంతా మగవాడిది అయితే ఆ మగవాడు ఒక్కడే ఆడదాని ప్రపంచంగా చేయబడిన సమాజం ఇది. రామానాయుడికి బయటి స్నేహాలు, వ్యవసాయ వృత్తులు, పంచమోద్యమ కార్మికోద్యమ ఆసక్తులు పుష్కలం. కమలమ్మ ప్రపంచం భర్త రామానాయుడు ఒక్కడే. ఆమె స్వభావానికి అత్తతో, తోడికోడలితో ఆంతర్యాన్ని విప్పిచెప్పుకొనే అలవాటు కూడా లేదు. అత్తగారికి ఉన్నట్లు వూళ్ళో మనుషులతో అర్థవంతమైన సంబంధాలు లేవు. తినటానికి మాత్రమే మేడ దిగివచ్చే ఆమెకు ప్రపంచం అంటే భర్తే మరి. ప్రపంచాన్ని గురించి ఆలోచించే, పనిచేసే ఆయనకు భార్య అవసరాలు, ఆకాంక్షలు ఏమిటో పట్టలేదు. పాలెం పోయి రెండు రాత్రులు, ఒక పగలు అతను కల్పించిన ఏకాంతం మిగిల్చిన శూన్యాన్ని కమలమ్మ- చూడటానికి అందగాడు, తన సౌందర్యాన్ని గుర్తించి కళ్ళతోనే మెప్పు ప్రకటించినవాడు, చదువుకున్నవాడు, ఉద్యోగమో, లా ప్రాక్టీసో చేయబోయేవాడు అయిన మోహనరావుతో నింపుకొనటం జరిగిపోయింది. కమల మోహనరావు పట్ల తనది సహజమైన ప్రేమానుబంధంగా భావించింది. భర్త గురించి ఆలోచించలేదు కానీ కొడుకు గురించి కాస్త చింతపడ్డది. సహజ ప్రేమానుబంధాలకు వివాహబంధాలు ప్రతిబంధకాలని సర్ది చెప్పుకొన్నది. మోహనరావుతో వెళ్ళిపోయింది.

మద్రాసు వెళ్లిన రెండు రోజులకే వాస్తవానుభవం నుండి

తన జీవితం ఎంత అభద్రతలో ఉందో గ్రహించగలిగింది కమలమ్మ. మోహనరావు ఒక ఉదయం స్నేహితుడిని కలవటానికి వెళ్లి అయిదు గంటలు రాకపోతే ఒక్కతే ఉండలేక విలవిల లాడిపోయింది. అతనిక అసలే రాడేమోనన్న భయంతో వణికిపోయింది. తనకు మోహనరావు తప్ప మరొక ప్రపంచం లేదు. ప్రపంచానికి తాను లేనట్లే అని అర్థమై గుండెలు అవిసిపోయాయి. పెళ్లితో సంబంధం లేకుండా ఒక పురుషుడు ఒక స్త్రీతో జీవిస్తున్నా ప్రపంచంలో, సభ్య సమాజంలో అతనికి నిషిద్ధ స్థలాలు ఉండవు కానీ అదే ఒక స్త్రీ పెళ్లి లేకుండా ఒక పురుషుడితో ఉంటే ఆమె ప్రపంచానికి బహిష్కృత. మగవాండ్లకు ఒక ధర్మం, ఆడవాళ్లకు ఒక ధర్మం అమలుచేస్తున్న సామాజిక దుర్నీతి ఆమెకు అర్థమైన సందర్భం అది. ఇక్కడే ఉన్నవ 'ఇద్దరూ ప్రవాహంలో దూకారన్న మాట వాస్తవమే అంటూ... కమలమ్మకు కాలు నేలకు తగలటం లేదు, గట్టు కనబడటం లేదు. మోహనరావుకు మాత్రం గట్టు అందికలోనే వున్నది, నెల కాళ్లకింకా తగులుతూనే ఉన్నది' అని ఇద్దరి స్థితిలో ఉన్న భేదాన్ని స్థిరీకరించాడు.

పరిణామంలో కమలమ్మ గర్భవతి అయి మోహనరావు స్వగ్రామం వెళ్ళటంతో ఒంటరిదై, శిశువును కని స్ఫోటకం సోకి శిశువు మరణించి, తాను రూపురేఖలు కోల్పోయి అనాథగా మంగళాపురం చేరింది. తన ఇంటనే పని మనిషిగా చేరి సాహూ పోషణ చూస్తూ, జబ్బు చేసి వాడు మరణించగా తాను కమలనన్న విషయం ఏకాంతంలో రామానాయుడికి చెప్పి అతని పాదాల వద్ద ప్రాణాలు వదిలింది.

కమలమ్మ ఉదంతాన్ని స్త్రీ పురుష సంబంధాల విషయంలో సమాజంలో సంభవించటానికి వీలున్న ఒక అంశంగా ఇతివృత్తంలో భాగం చేసాడే కానీ రచయిత దానిమీద తన తీర్పులు ప్రకటించకపోవడం విశేషం. కమలమ్మ వెళ్లి పోయినప్పుడు పట్టెమంచం దగ్గరకు పోయి మోహం చిట్లించి దుప్పటీ పరుపూ తీసివేయించి 'కమలమ్మా! సాహూకు ఆజన్మాంతమూ అపకీర్తి వస్తుందనయినా యోచించావు కాదు గదా' అనుకొన్న రామానాయుడు ఆమెను తన హృదయం నుండి తొలగించలేదు. శాంతమ్మ అవసాన కాలాన అతని పాదాలమీద చేతులుంచి పెద్దపెట్టున ఏడ్చి నేను కమలమ్మను అని ఎరుక పరచుకొన్నప్పుడు 'అయ్యో! నా కమలవా' అనటాన్ని బట్టి ఆ విషయం రూఢీ అవుతున్నది. 'నా కమలవా' అనటంలో ఆమెను తన స్వంత మనిషిగానే భావిస్తున్న సూచన ఉంది. మరణం తరువాత కూడా ఆమె అతని ఆంతరిక ప్రపంచాన్ని ఆవరించుకొనే ఉంది.

రామదాసును మాలక్ష్మిని దొంగ కేసు బనాయించి సెటిల్మెంట్ నుండి జైలుకు తరలించినప్పుడు అక్కడ ఒంటరిగా ఉన్న జ్యోతికి, ఆమె తమ్ముడికి గార్డియన్ నియామకం గురించి పిటీషన్ తయారు చేయించటానికి రామానాయుడు వకీల్ నారాయణరావు దగ్గరకు వెళ్ళాడు. అక్కడ జ్యోతీ అప్పాదాసుల భావనాత్మక ప్రేమ సంగతి ప్రస్తావనకు వస్తుంది. అప్పుడు రామానాయుడు నారాయణరావు సమాధానాన్ని కోరి ఒక ప్రశ్న వేసాడు. 'భార్యాభర్తలన్యోన్యం ప్రేమించారు. కొన్ని కారణాల

**పెళ్లితో సంబంధం లేకుండా ఒక పురుషుడు ఒక స్త్రీతో జీవిస్తున్నా ప్రపంచంలో, సభ్య సమాజంలో అతనికి నిషిద్ధ స్థలాలు ఉండవు. అదే ఒక స్త్రీ పెళ్లి లేకుండా ఒక పురుషుడితో ఉంటే ఆమె ప్రపంచానికి బహిష్కృత. మగవాండ్లకు ఒక ధర్మం, ఆడవాళ్లకు ఒక ధర్మం అమలుచేస్తున్న సామాజిక దుర్నీతి ఆమెకు అర్థమైన సందర్భం అది.**

చేత భార్య ప్రేమ సంచలిస్తుంది. కానీ అత్యంతంగా పశ్చాత్తప్తురాలవుతుంది. వారిద్దరికీ భావనా రూపంగా ప్రేమ సాధ్యమవుతుందా? అన్నది ఆ ప్రశ్న. ఇది కమలమ్మ పట్ల తన అంతరంగ వర్తన గురించి సందేహ నివృత్తికి అడిగినదే కానీ మరొకటి కాదు. కమలమ్మకు తనకు అన్యోన్య ప్రేమబంధం ఉన్నదనే అతని సంపూర్ణ విశ్వాసం. తనపట్ల కమలమ్మ ప్రేమను తాము కలిసి జీవించిన కాలం నాటి అనుభవాన్ని బట్టి నమ్ముతాడే కానీ మోహనరావుతో వెళ్ళిపోయిన తరువాతి కాలపు చర్యనుబట్టి అనుమానించకపోవటం అతని సంస్కారం. కమలమ్మ భౌతికంగా లేకపోయినా భావనాత్మక ప్రేమతో తనలో నిలుపుకొనటానికి తాను చేస్తున్న అభ్యాసం సముచితమేనా అన్న సందేహం మనసులో ఎక్కడో వేధిస్తుంటే తీర్చుకొనటానికి వేసిన ప్రశ్న అది. భావనారూపంగానే కాదు దైహికంగా కూడా సాధ్యమేనని వకీలు సమాధానం. ఆ ప్రశ్న, ఈ సమాధానం రెండూ ఉన్నవ దాంపత్య ప్రేమలోని ఉ దాత్తతను సంభావిస్తూనే ప్రేమ సంచలించటం, ప్రేమ మారటం మొదలైన వాటిని సహజ విషయాలుగా స్వీకరించటాన్నే సూచిస్తాయి. స్త్రీపురుషుల మధ్య ప్రేమను నైతికత ప్రాతిపదికగా విలువకట్టక పోవటంలో ఉన్నది ఉన్నవ లక్ష్మీనారాయణ ఆధునిక దృష్టి. ఆ తరువాత ఒక దశాబ్దికి విశ్వనాథ సత్య నారాయణ చెలియలి కట్ట నవల వ్రాయటానికి ప్రధాన కథా సూత్రం మాలపల్లి నవలలోని కమలమ్మ ఉదంతమే ఇచ్చింది.

### 3

స్త్రీపురుష సంబంధాలలో మనస్సు, శరీరం రెండూ ముఖ్యమైనవే. స్త్రీకి పురుషుడు, పురుషుడికి స్త్రీ ఆలంబనగా చిత్తవృత్తి సంచలనం తీగలు సాగి భావోద్వేగాలు బలీయమై నిత్య సాన్నిధ్యం ఆకాంక్ష అయి సంయోగంలో అది అభేద స్థాయికి చేరి సంతృప్తి, ఆనందం అనుభవం అవుతాయి. అయితే అందరికీ అన్నివేళలా సంతృప్తికరమైన ఈ అనుభవం అందిరానీయని సామాజిక భౌతిక భావజాల అవరోధాలు అనేకం. అయితే అసలు అలాంటి అవరోధాలు ఉన్నాయని గానీ, వాటిని అధిగమించే మార్గాలను తెలుసుకోవాలని గానీ కనీసపాటి జ్ఞానం కూడా లేక గతానుగతికమైన దాంపత్య సంబంధాలలో జీవితం వెళ్లబుచ్చటమే సాధారణంగా జరిగిపోతుంటుంది. ఆ సాధారణత్వంలో ఊపిరాడని తనం ఏ క్షణానో అనుభవానికి వచ్చినవాళ్లు కొత్త మార్గాలను వెతుకుతారు. జీవితాలను ప్రయోగంగా మార్చుకొంటారు. అలాంటి వాళ్లలో కమలమ్మది ఒకరకమైన ప్రయోగం అయితే

**పంతులు పని సంపాదించుకొని తమ్ముడిని, తల్లిదండ్రులను పోషించేభారం తీసుకొనటానికి సిద్ధపడిన వ్యక్తికి తిండి బట్టకోసం అయితే పెళ్లి చేసుకొనే అవసరమే లేదు. ఆర్థిక స్వాతంత్ర్యం, విద్య ఇచ్చే ధైర్యం, తనను తనే రక్షించుకోగల నన్న ఆత్మవిశ్వాసాన్ని ఇస్తాయి. అందువల్ల రక్షణ కోసం కూడా పెళ్లి అక్కరలేదు.**

జ్యోతిది మరొక రకమైన ప్రయోగం. కమలమ్మ ప్రయోగం ప్రధానంగా శరీర సంబంధి అయితే జోతిది మనసుకు, భావనకు సంబంధించింది. కమలమ్మ ప్రయోగం దాంపత్య సంబంధాల అసంతృప్తి మూలమైతే జ్యోతి ప్రయోగం అసలు దాంపత్య సంబంధాల వరకు వెళ్లకుండా ఉండటాన్ని ఉద్దేశించింది.

జోతి రామదాసు కూతురు. పూర్తి పేరు ఆరంజోతి. నవల ప్రారంభంలో చేనులో పనిచేసుకొంటున్న తండ్రికి అన్నం దుత్త తీసుకుపోయిన చీరకట్టులో ఉన్న జోతి పన్నెండు పదమూడేళ్ల వయసు బాలిక అయి ఉంటుంది. తండ్రిని అడిగి ఊచబియ్యం కొట్టించుకొని తిన్న, తియ్యదోసకాయలు తెంపించి తెచ్చుకొన్న ఆ ముగ్ధ బాలిక బడికి పోవటం కనిపించదు కానీ తండ్రి, అన్నలు ఆమెను చదివిస్తున్నారు. సంగదాసు ఆ పిల్ల చదువు సంగతి విచారించినప్పుడు 'నీవిచ్చిన పుస్తకం అంతా అయింది. ఇంకొకటి తెచ్చి పెట్టు' అని జవాబియ్యటం చదవు పట్ల ఆమె శ్రద్ధను సూచిస్తుంది. ఆ తరువాత ఆరేడు నెలలకు మంగళాపురంలో ఒకనాడు ప్రహ్లాద నాటక ప్రదర్శన జరిగింది. అది చూడటానికి తండ్రితో పాటు వచ్చి కూర్చున్న జోతి నాటకం ముగిశాక జరిగిన చర్చలో హిరణ్యకశ్యపుడిని పౌరుష ప్రవృత్తిని ప్రశంసిస్తున్న అన్న వెంకటదాసుతో ఆమె చేసిన వాదం ప్రౌఢమైనదే. దోపిడీ తప్పయినా దొంగల ధైర్యం ప్రశంసనీయమనటం అన్న వైఖరి అని విమర్శిస్తుంది. దోపిడి తప్పని నేననలేదు అని చెల్లెలిని సవరిస్తాడు వెంకటదాసు. ఇంకా పై మెట్టుకే పోయినావు అని మాటకు మాటా అనగలిగిన స్థాయిలో జ్ఞానం, వివేకం ఆమె సంపాదించగలిగింది అన్నది స్పష్టం. వెంకటదాసు దేవుడు లేదని, ఉన్నవాళ్లను కొట్టి లేనివాళ్లకు పెట్టేందుకు చేసే దొంగతనం ధర్మమే నని, పితృవాక్య పాలన తనకు సాధ్యం కాని విషయం అని మాట్లాడుతుంటే సంగదాసు హత్య తరువాత అంతగా ద్వేషంతో రగిలిపోతున్న పెద్దన్నను చూసి ఏడ్చేసిన జోతి ఆ తరువాత అన్న ధర్మనిష్టను ప్రశంసిస్తూనే అది సాధించేందుకు ఆయన ఎన్నుకొన్న మార్గం అధర్మం, అసత్యం, లోక కంటకం అని నిష్కర్షగా చెప్పగలిగింది.

చౌదరయ్య తెచ్చిన దావాతో ఇళ్ళూ, పొలం అన్నీ పోగొట్టుకొనే దశకు వచ్చేసరికి ఆ పరిణామాలను ఎదుర్కొనటానికి తనను తాను సిద్ధం చేసుకొంటున్న తండ్రిని చూస్తూ కర్తవ్యాన్ని నిర్దేశించుకొని నిలబడగల స్థితికి వచ్చింది. 'జప్తు కాకుండా మిగిలిన బండీ ఎద్దులు వాడుకొంటూ వెంకటదాసు కుటుంబాన్ని ఈదే భారం మీద వేసుకొంటే కాలం గడవక పోదని, జోతిని ఒక అయ్యచేతిలో పెడితే తనభారం తీరినట్లే అని, ఇంకొక ఐదేళ్లు గడిస్తే చిన్న కొడుకును గొడ్లు కాయటానికి ఎవరి దగ్గర పెట్టినా పొట్టకూ బట్టకూ గడుస్తుందని, ఇక తమ దంపతుల సంగతి ఏమైనా ఫరవాలేదని' తండ్రి అన్న మాటలకు జవాబుగా 'పంతులు పని సంపాదించుకొని పిల్లవాడినీ, ముసలివాండ్లను పోషించేభారం నాది' అని ప్రకటించగలిగింది. అంతే కాదు; తన పెండ్లిసంగతి పెట్టుకోవద్దని కచ్చితంగా చెప్పగలిగింది.

కానీ ఆమెకు అప్పటికే అప్పాదాసు మీద మనసు లగ్నమై ఉంది. జోతికి మేనత్త కొడుకు అప్పదాసు. వాళ్లింట్లోనే పశువులు కాసే పనిలో ఉన్నాడు. ఈడైనవాళ్లు. వరుసైనవాళ్ళు. తల్లి, అత్త తమ పెళ్లి ముచ్చట ఎత్తటం వాళ్ళు చిన్నప్పటి నుండి వింటూనే ఉన్నారు. బహుశా అప్పటికే వాళ్ళ మధ్య పరస్పర అనురాగ బీజమేదో నాటుకొని ఉంటుంది. ధూర్తుల దుండగానికి తల్లి, బావ బలికావటంతో అప్పాదాసు పంచముల బాధా నివారణకు బావ మార్గంలో సంఘసేవకు పూనుకొనటం, సంగ మందిరంలో ఏర్పాటు చేసిన పంచమ పాఠశాలలో ఉపాధ్యాయుడుగా చేరటం సంగదాసు మార్గం పట్ల గౌరవం ఉన్న జోతి హృదయంలో అప్పాదాసు స్థానాన్ని సుస్థిరం చేసి ఉంటుంది. ఉపాధ్యాయుడై పంచకావ్యాలను క్షుణ్ణంగా చదువుకొన్న బావను గురువుగా స్వీకరించిన క్షణంలో జోతి హృదయంలో అతను ఉన్నత పీఠాన్ని ఏర్పరచుకున్నాడు.

అప్పాదాసుతో భాగవత కృష్ణుడి గురించిన చర్చ చేసిన సందర్భంలో జోతి అతని పట్ల తనకు కలిగిన ఆబాల్య ప్రేమను గురించి చెప్పింది. బాల్యంలో ఆడుకొన్నప్పుడు, అప్పాదాసు పశువులు కాస్తున్నప్పుడు, పశువుల కొట్టం ఊడుస్తున్నప్పుడు కావడి వేసుకొని నీళ్లు మోసు కొస్తున్న ప్పుడు– ఇలా సర్వకాలాల్లో తాను అతనిని ప్రేమిస్తూనే ఉన్నానని చెప్తుంది. శ్రమ, అధ్యయనం, ఆదర్శాలు, ఆచరణ ఈ నాల్గింటి సంబంధంలో అప్పాదాసు జ్యోతికి ప్రేమించదగినవాడు అయినాడు. పంచమ కార్మికోద్యమాలలో తన ఆచరణలో ఎదురయ్యే చిక్కులు, మేనమామ రామదాసు మీద పెట్టబోతున్న జామీను కేసు వల్ల సంభవించబోయే పరిణామాలను దృష్టిలో పెట్టుకొని జోతి ఎవరినైనా పెళ్లిచేసుకోటం క్షేమం అని అప్పాదాసు ఇచ్చిన సలహా కు జోతి 'నేను పోషణకోసం వివాహం చేసుకోను' అని జవాబు చెప్పింది.

పోషణ కోసం పెళ్లి చేసుకోను అనటంలో జోతి ఆంతర్యం ఏమిటి? పోషణలో రెండు అంశాలు ఉన్నాయి. ఒకటి : తిండి బట్ట వసతి సమకూర్చటం. రెండవది : భద్రత, రక్షణ ఇయ్యటం. వీటికోసమైతే తాను పెళ్లి చేసుకోను అంటుంది జోతి. పంతులు పని సంపాదించుకొని తమ్ముడిని, తల్లిదండ్రులను పోషించేభారం తీసుకొనటానికి సిద్ధపడిన వ్యక్తికి తిండి బట్టకోసం అయితే పెళ్లి చేసుకొనే అవసరమే లేదు. ఆర్థిక స్వాతంత్ర్యం, విద్య ఇచ్చే ధైర్యం, తనను తనే రక్షించుకోగల నన్న ఆత్మవిశ్వాసాన్ని ఇస్తాయి. అందువల్ల రక్షణ కోసం కూడా పెళ్లి అక్కరలేదు. అలా పోషణ కోసం అయితే పెళ్లి అక్కరలేదన్న

కల్యాణి శ్రీదేవి వ్రాసిన కాలాతీతవ్యక్తులు (1957) నవలలో కనబడుతుంది. మూడు దశాబ్దాల తరువాత రూపొందబోయే ఆధునిక మహిళకు తొలి రూపం జోతి అనుకోవచ్చు.

పోషణ, రక్షణ కోసమైతే పెళ్లి అక్కర లేకపోవచ్చు కానీ ప్రేమ కోసం, ప్రేమ ఉన్నచోట చేసుకోవచ్చు కదా! అయితే అప్పాదాసు పట్ల అంత ప్రేమ ఉండి కూడా జోతి అతనితో పెళ్లిని ఎందుకు కాదనుకొన్నది? జోతి అప్పదాసుల ఆలోచనల అభిప్రాయాల ముఖంగా ఎదుటివాళ్ళు ప్రేమిస్తున్నారా లేదా అన్న ప్రశ్నతో సంబంధం లేకుండా నిష్కామంగా నిర్గుణ బ్రహ్మను ప్రేమించినట్లు ప్రేమించటమే ప్రేమ అని నిర్ధారించి ఐహికాముష్మికాలకు లంకె ప్రేమేనని దానిని ఒక తాత్విక స్థాయికి తీసుకొని వెళ్లటంలో రచయిత ఆంతర్యం ఏమై ఉంటుంది? భావనాత్మక ప్రేమతో సాన్నిహిత్యాన్ని సంభావిస్తూ మానసికంగా శారీరకంగా సుఖిస్తూ పొందే ఆనందాన్ని ఆదర్శంగా చేయటంలో ఉద్దేశం ఏమై ఉంటుంది? నారదభక్తి సూత్రాలు భక్తి ప్రేమరూపం అని చెబుతూ భగవంతుడిని ప్రియుడు అని సంభావిస్తూ సేవించటం ముక్తికి దగ్గర మార్గం అని చెప్తాయి. అలాంటి ఆధ్యాత్మిక భావ సాధనకు జోతి, అప్పాదాసును ఆలంబనగా చేసుకొని కథను నడిపించటం ద్వారా ఉన్నవ లక్ష్మీ నారాయణ అమలిన శృంగారం అనే సమకాలీన సాహిత్య భావనకు ఆధ్యాత్మిక ప్రేమకు లంకె కలిపే ప్రయత్నం చేసాడేమో అనిపిస్తుంది.

జోతి అప్పాదాసు పట్ల అంత ప్రేమ ఉన్నా అతనికీ తనయందు అంతే స్థాయిలో ప్రేమ ఉన్నా పెళ్లి వద్దని అనటానికి కారణం భౌతికమైనదే. తల్లిదండ్రుల పోషణ, తమ్ముడి పోషణ బాధ్యత స్వీకరించ నిర్ణయించుకొన్న క్రమంలో పెళ్లి అందుకు అవరోధం అవుతుందన్న కారణమే ప్రధానం. తల్లిదండ్రుల పోషణ, సేవ కొడుకుల ధర్మంగా నిర్దేశించిన సమాజం ఆడపిల్లల సొమ్ము తినటం అపరాధంగా చూపిస్తుంది. ఆడపిల్లలు పెళ్లి చేసుకొని అత్తమామల సేవ చేయవలసిన వాళ్ళని చెప్తుంది. పెళ్లయ్యాక ఆమె సంపాదన భర్తకు, అత్తింటివారికి చెందినదిగా భావిస్తుంది. మొత్తంగా పెళ్లితో స్త్రీ పరాధీనత స్థిరీకరించబడుతుంది. ఈ సాంస్కృతిక వాతావరణంలో తాను పెళ్లి చేసుకొంటే తల్లిదండ్రులకు పరాయిది అవుతుంది. దాని పరిణామాలు తల్లిదండ్రులను రెక్కలు రాని తమ్ముడిని దిక్కులేనివాళ్లను చేస్తాయి అన్నది జోతి అసలు భయం. ఉద్యోగం సంపాదించగల విద్యార్హతలు, కుటుంబ బాధ్యత స్వీకరించ గల శక్తి సామర్థ్యాలు ఉంది కూడా పెళ్ళి వల్ల తాను ఆ అవకాశం కోల్పోతానేమోనన్న సందేహమే ఆమెను ఆ నిర్ణయం తీసుకొనటానికి ప్రేరేపించి ఉంటుంది. అప్పాదాసుకు తండ్రి లేడు. తల్లి ఉన్న కాలంలోనే తమ ఇంట్లో పని ఆసరాకు వచ్చి తమలో వాడుగానే పెరిగాడు. తల్లి కూడా చనిపోయింది. అన్నలిద్దరూ లేని కొరతను తీరుస్తూ అతనే కుటుంబం అవసరాలు చూస్తున్నాడు. తనకు చదువు



**తల్లిదండ్రుల పోషణ, సేవ కొడుకుల ధర్మంగా నిర్దేశించిన సమాజం- ఆడపిల్లల సొమ్ము తినటం అపరాధంగా చూపిస్తుంది. ఆడపిల్లలు పెళ్లి చేసుకొని అత్తమామల సేవ చేయవలసిన వాళ్ళని చెప్తుంది. పెళ్లయ్యాక ఆమె సంపాదన భర్తకు, అత్తింటివారికి చెందినదిగా భావిస్తుంది. మొత్తంగా పెళ్లితో స్త్రీ పరాధీనత స్థిరీకరించబడుతుంది.**

చెబుతున్నాడు. గురుదక్షిణగా తన హృదయాన్ని కోరాడు. అటువంటప్పుడు అతనిని పెళ్లి చేసుకొని ఇద్దరూ కలిసి వాళ్ళ ఆలనాపాలనా చూసుకోవచ్చుగదా! అని ఎవరికైనా అనిపించవచ్చు. స్నేహితుడు, ప్రేమికుడు భర్త అయ్యాక, మేనల్లుడు అల్లుడు అయ్యాక ఆ సంబంధాలు యథాపూర్వకంగా స్వేచ్ఛగా, స్వచ్ఛంగా ఉంటాయన్న నమ్మకం తక్కువ. ఈ పరిస్థితులలో అధీన అధికార సంబంధాలలోకి ప్రవేశించకపోవటమే మంచిది అని జోతి అనుకొనటానికి వీలుంది. ఆ లోపలి తర్కానికి బాహిర ఆచరణ భావనాత్మక ప్రేమను ఆశ్రయించటం.

## 4

రామదాసు, అప్పాదాసుల సంభాషణ నెపంగా ఉన్నవ పెళ్ళికి ప్రేమకు ఉండే సంబంధం గురించి కొన్ని ప్రశ్నలు లేవనెత్తాడు. ప్రేమ భార్య మీద తప్పక కుదురుతుందా? ప్రేమలేకుండా పెళ్లి చేసుకోవచ్చా? పెళ్లి చేసుకున్న తరువాత



ప్రేమ ప్రాతిపదికగా గల స్త్రీపురుష సంబంధాల గురించి, భావనాత్మక ప్రేమ సూత్రం ద్వారా శారీరక సంబంధంతో నిమిత్తం లేని ఆత్మోన్నత్య సాధకమైన స్నేహం గురించి చర్చ జరుగుతున్న కాలంలో స్త్రీని అనుభవ వస్తువుగా మాత్రమే చూసే ఒక హీన సంస్కృతి అధికార మత రాజకీయాల దన్నుతో ఎలా కొనసాగుతున్నదో జోతి మరణం సూచిస్తుంది. కులం రీత్యా, దానం రీత్యా కింది స్థాయిలో ఉన్న స్త్రీలను బలి తీసుకొంటున్న ఈ హీన సంస్కృతి వర్తమానంలోనూ నిరాటంకంగా కొనసాగటం స్త్రీల మీద పెరిగిపోతున్న అత్యాచార ఘటనలలో వాటిపట్ల అధికార వర్గాల వ్యవహార సరళిలో చూడవచ్చు.

ప్రేమించటమా? ప్రేమ ఉండి గానీ లేక గానీ కామం, పెళ్లి, భోగం, సంతానం మొదలైన లోక వ్యవహారం అంతా నడుస్తున్నది కదా! దాని మాటేమిటి? ఇలాంటి ప్రశ్నలు స్త్రీపురుష సంబంధాలను ఉన్నతీకరించుకొనటం గురించి మనుషులు చేసే అన్వేషణలో భాగమే. అయితే లోకంలో స్త్రీపురుష సంబంధాలు కామ సంబంధ స్థాయిలోనే ఉన్నాయని సెటిల్‌మెంట్ జీవితం సూచిస్తుంది. పాల్ సెటిల్‌మెంట్ ఉద్యోగి. కులం రీత్యా రామదాసుతో బంధుత్వం ఏదో ఉన్నది. జోతి మీద అతని కన్ను పడింది. ఆమె మీద కోరిక తీర్చుకొనటానికి పెళ్లి మాట ప్రస్తావించటం, రామదాసుని మామా అని సంబోధించి మాట్లాడటం చేస్తుంటాడు. మరదలు అని జోతిని, బావమరిది అని ఆమె తమ్ముణ్ణి సంబోధిస్తూ తన కోరికను ప్రకటించుకొంటుంటాడు. జోతి, మా లక్ష్మి, రామదాసు అందరూ అతని కోరిక నెరవేరేది కాదని సూచిస్తూనే ఉంటారు. దూరం పెడుతూనే ఉంటారు. జోతినే కాదు ఏ స్త్రీని పెళ్లి చేసుకొనే ఉద్దేశం అతనికి ఉన్నట్లు కనబడదు. తాను అనుభవించటం, సెటిల్మెంట్‌లోని స్త్రీలను కాంట్రాక్టు పనులకు కూలీలుగా పంపటమే కాదు, కాంట్రాక్టర్లకు తార్చి స్వప్రయోజనాలు సాధించుకొనటం అతని ప్రవృత్తి అని జోతి ఒకటి రెండు రోజులలోనే గ్రహించింది. రామదాసు గ్రహించాడు కనుకనే మాన రక్షణ ధర్మం గురించి యధాలాపంగా హెచ్చరిక చేసాడు. పాల్ ఏ దుర్మార్గానికి తలపడతాడో అన్న అనుమానం భయాన్ని కలిగించింది. పోషణ కోసం పెళ్లి అక్కర లేదన్న జోతి ధీరత్వానికి సవాల్ అయింది. ఆత్మహత్యే శరణ్యమని అనుకొనేట్లు చేసింది.

పాల్ కాముకత్వ స్థాయి దొంగ కేసు బనాయించి రామదాసును మాలక్ష్మిని సెటిల్‌మెంట్ దాటించి జోతిని వంటరిని చేసి అనుభవించాలనుకొనేంతవరకు వెళ్ళటం, అందుకు సెటిల్మెంట్ సూపరెండెంట్ సహకారం ఉండటం చూస్తాం. తెల్లవారు జామున స్నానానికి వెడుతూ వెన్నాడి దాడిచేయబోయిన పాల్‌ను తప్పించుకొని కృష్ణా నదిలో పది మునిగి చనిపోవటంతో జోతి జీవితం ముగిసింది. ప్రేమ ప్రాతిపదికగా గల స్త్రీపురుష సంబంధాల గురించి, భావనాత్మక ప్రేమ సూత్రం ద్వారా శారీరక సంబంధంతో నిమిత్తం లేని ఆత్మోన్నత్య సాధకమైన స్నేహం గురించి చర్చ జరుగుతున్న కాలంలో స్త్రీని అనుభవ వస్తువుగా మాత్రమే చూసే ఒక హీన సంస్కృతి అధికార మత రాజకీయాల దన్నుతో ఎలా కొనసాగుతున్నదో జోతి మరణం సూచిస్తుంది. కులం రీత్యా, దానం రీత్యా కింది స్థాయిలో ఉన్న స్త్రీలను బలి తీసుకొంటున్న ఈ హీన సంస్కృతి వర్తమానంలోనూ నిరాటంకంగా కొనసాగటం స్త్రీల మీద పెరిగిపోతున్న అత్యాచార ఘటనలలో వాటిపట్ల అధికార వర్గాల వ్యవహార సరళిలో చూడవచ్చు.

ఇంత చదువు, జ్ఞాన చైతన్యాలు, ఆలోచనా సామర్ధ్యం, స్వాభిమానం కలిగి సాధికారత దిశగా ప్రయాణం ప్రారంభించిన జోతి జీవితం అర్ధాంతరంగా ముగిసింది. నిజానికి భావనాత్మక ఆధ్యాత్మిక పొరలను తొలగిస్తే చైతన్యవంతమైన క్రియాశీల దళిత మహిళకు ఒక నమూనాగా నిలపటానికి వీలైన జోతి హఠాత్ నిష్క్రమణ పెద్ద విషాదం. 1945 (నవంబర్ భారతి)లో మాలపల్లి నవలపై వ్రాసిన వ్యాసంలో శ్రీనివాస శిరోమణి 'పంతులుగారు మహా గొప్ప పాత్రలను సృష్టించి– ఆ సఅష్టించిన వారిని ఒక్కొక్కరినే చంపుకొంటూ వచ్చి చివరకు ఎందుకూ పనికిమాలిన ముసలీ ముతక పాత్రలను బతికించారని' ఒకింత నిరసన స్వరంతో చేసిన ఫిర్యాదు ఎంత సమంజసమైనదో ఈ సందర్భం నుండి అర్ధం చేసుకోవచ్చు. ■



# మాలపల్లి దళిత జీవితం

❑ కత్తి పద్మారావు

**100** సంవత్సరాల తరువాత మాలపల్లి నవలపై చర్చ జరుగుతుందంటే– ఆ నవల గొప్పదనం మనకు అర్థమవుతోంది. ఏ గ్రంథమైనా వందేళ్లు నిలబడిందంటే దానిలో శైలి భాష, వాతావరణ నేపథ్యం, సిద్ధాంత బలం, రచయిత యొక్క గొప్పదనం బలీయంగా ఉన్నట్టు లెక్క. కారల్ మార్క్స్ కాపిటల్, అంబేద్కర్ కుల నిర్మూలన, జాషువా రాసిన గబ్బిలం ... ఇలాంటి కొన్ని పుస్తకాలు మాత్రమే ఇంతకాలం నిలిచాయి. మాలపల్లి నవల చాలామంది భావజాలాలను మార్చింది. చాలామందికి మార్గదర్శకంగా నిలిచింది. కులనిర్మూలన ఎలా చదువుతామో, మార్క్స్ రాసిన జర్మన్ ఐడియాలజీ ఎలా చదువుతామో.. అలా దేశంలో, లేదా రాష్ట్రంలో ఎక్కువగా చదివే పుస్తకం మాలపల్లి. చాలామందికి తెలియనిది ఏమిటంటే పుస్తకంలో ఆయన ఒక చేను అనే మూడు పేజీల్లోనే జున్నచేను, అరకవిడిచి, ఎద్దులు, కుంట, నీళు పెట్టి, తుమ్మపీట, కంకులు, ఎర్రజొన్న, దుద్దనెత్తిన, ఎద్దులు, అరమురుకులు, దద్దుర్లు, ముల్లు పోట్లు, కుచ్చులు, జున్నపైరు, దంపు .. మాటలు రాశారు. ఇవన్నీ ఈనాటికీ దళిత పేటల్లో ఉన్నాయి. దళితులు నిఘంటుకర్తలు, వాళ్లేమీ మురికి వాళ్లు కాదు. దళితులు ప్రాకృతిక జీవులు. ఎక్కువ ఎండ, వాన, గాలి తగిలేవారిని ప్రాకృతిక జీవులు అంటాము. ఉన్నవ లక్ష్మీనారాయణ తప్పకుండా పల్లెను చూశాడు.

> ❝ ఏ గ్రంథమైనా వందేళ్లు నిలబడిందంటే దానిలో శైలి భాష, వాతావరణ నేపథ్యం, సిద్ధాంత బలం, రచయిత యొక్క గొప్పదనం బలీయంగా ఉన్నట్టు లెక్క. మాలపల్లి నవల చాలామంది భావజాలాలను మార్చింది. చాలామందికి మార్గదర్శకంగా నిలిచింది. కులనిర్మూలన ఎలా చదువుతామో, మార్క్స్ రాసిన జర్మన్ ఐడియాలజీ ఎలా చదువుతామో.. అలా దేశంలో, లేదా రాష్ట్రంలో ఎక్కువగా చదివే పుస్తకం మాలపల్లి. ❞

చిన్నప్పుడు మాకు పొలం ఉండేది. ఈ పదాలన్నీ చిన్నప్పుడే మాకు తెలుసు. వ్యవసాయం దళితులదే. ఈ మిగతా భూస్వాములు అంతా వలస వచ్చిన వారు. 300, 400 సంవత్సరాల క్రితం దళితులను చంపడం ద్వారా, ఆక్రమించుకోవడం ద్వారా, దోచుకోవడం ద్వారా, కూలి ఎగ్గొట్టడం ద్వారా, పల్లెలను తగలబెట్టడం ద్వారా వారు భూములు అక్రమించారు. నీతిమంతులైన వారు దళితులు. దళితుల్లో ఎకరం నేల పోగొట్టుకున్నవాడే గానీ.. . ఎక్కడా ఒక ఎకరం ఆక్రమించిన వాడు ఉండడు. ఉన్నవ దళితుల భాషను తన నవల కోసం తీసుకున్నాడు. వాడిన పదం ఎక్కడా వాడలేదు. కుండ, తట్ట, బుట్ట, కొడవలి, నాగలి, కొయ్య, కొర్రు, మేడి ఇవన్నీ దళితులు సృష్టించినవే. వారు కూడు, బువ్వ, గోచి, గుడ్డ వంటి మాటలు వాడారు. తరువాత వాటిని సంస్క

**ఉన్నవ అన్ని వాదాలను ఈ నవలలో ప్రస్తావించారు. చార్వాకం, లోకాయతం, జైనం, బౌద్ధం అన్నింటినీ ఆయన తీసుకొచ్చాడు. శ్రీకృష్ణదేవరాయలు మాల దాసరి అనే కథ రాశాడు. ... దళితులు తమ జీవన విధానంలో ప్రకృతిని గుర్తించారు. నీటిని గుర్తించారు. భూమిని గుర్తించారు. మానవ శ్రమను గుర్తించారు.**

ృతీకరించిన భాషలో అన్నం, వస్త్రం అన్నారు. దళితవాడ చాలా కాంప్రెహెన్సివ్‌గా ఉంది. అందరూ అందుకే దళితవాడలపై దృష్టి పెట్టారు. గాంధీ గారు, అంబేద్కర్ గారు, కమ్యూనిస్టులు దళితుల్లో పనిచేశారు. అంతకు ముందు ప్రధానంగా చార్వాకులు దళితుల్లోనుంచే వచ్చారనేది మాలపల్లిలో ఉంది.

ఉన్నవ అన్ని వాదాలను ఆ నవలలో ప్రస్తావించారు. చార్వాకం, లోకాయతం, జైనం, బౌద్ధం అన్నింటినీ ఆయన తీసుకొచ్చాడు. శ్రీకృష్ణదేవరాయలు మాల దాసరి అనే కథ రాశాడు. అప్పటికే రామానుజాచార్యులు విశిష్టాద్వైతం ద్వారా దళిత వాడల్లోకి చొరబడ్డారు. అయితే భక్తి ఉద్యమంలో కూడా కొంత మానవత్వం ఉంది. మొగలాయి సామ్రాజ్యంలో సూఫీ వాదం ద్వారా రాజులు చొరబడితే దక్షణ భారతదేశంలో భక్తి ఉద్యమం ద్వారా ద్వైతము, అద్వైతము, విశిష్టాద్వైతము వచ్చాయి. విశిష్టాద్వైతమును శంకరాచార్యులు తెచ్చారు. అది కూడా దళితులకు ఎక్కలేదు. ఆత్మ, పరమాత్మ కలిసిపోవడం శూన్యవాదం. దానిలో సారం లేదు. ఆ తరువాత రామానుజాచార్యులు, మధ్వాచార్యులు తీసుకు వచ్చినట్టి విశిష్టాద్వైతానికి హీరో అక్కడ మాల దాసరి. ఈ నవలలో రామదాసు. శ్రీకృష్ణదేవరాయలు 12 ఎకరాల్లో విస్తరించిన మర్రిచెట్టు ఆకులో వాడిన లిపిని బట్టి ఆ ప్రాంతం ఎలా ఉంది? ఆ మర్రి ఊడలు ఎంత ఉన్నాయని గ్రహించగలిగిన వాడు ఒకడు ఉన్నాడు. వారు మౌఖిక జ్ఞాని. నక్షత్రాల గురించి చెప్పగలిగిన వాడు. వర్షం ఎప్పుడు వస్తుందో చెప్పగలిగిన వాడు. ఏ నేల ఏ స్వభావాన్ని కలిగి ఉంటుందో చెప్పగలిగిన వాడు. ఎర్ర నేల ఏమిటి, తెల్ల నేల ఏమిటి, చిగురు నేల ఏమిటి చెప్పగలిగిన వాడు. అయితే వాడిని కూడా దేవాలయ గర్భ గుడిలో నుంచి జాలు వారిన నీటి ద్వారా అది కూడా రాజు వచ్చిన తరువాత ప్రసాదం తీసుకోవాలనే నియమం పాటించాలి. కాబట్టి చాతుర్వర్ణ నియమాన్ని పాటించేవాడు వైష్ణవుడు అని కృష్ణదేవరాలు చెప్పాడు. అది గాంధీగారి కాలం వచ్చేటప్పటికి పల్లెల్లో గాంధీగారికి ముందే అనేక తత్వాలు వచ్చాయి. అందరికీ భిక్ష వేసేవాళ్లు దళితులే. మిగిలిన వారంతా దోపిడీదారులే. పోతులూరు వీరబ్రహ్మం గారికి భిక్ష వేయాలంటే దళితులే. ఎవడు పాడుతూ వెళ్లినా ఆ పాట విని చక్కగా బిక్ష వేసేవాడు దళితుడే. ఊరు కూడా ఇచ్చేశాడు. జీవితాన్ని ఇచ్చేశాడు. వ్యవసాయాన్ని సృష్టించాడు. భారత దేశంలోని అన్ని నదులకూ కాలువలు తీసింది దళితులే. ధవళేశ్వరంలో ఆనకట్టకు కాలువలు తీసింది దళితులే. వారి గురించి సర్ అర్థర్ కాటన్ అక్కడ లిస్టు కూడా పెట్టారు. వారిలో బ్రాహ్మలు లేరు. క్షత్రియులు లేరు. శూద్రులు కూడా లేరు. వాళ్లంతా దళితుల భూములు ఎలా ఆక్రమించాలనే కుట్రదారులు. లేకుంటే వారికి భూమి ఎక్కడి నుంచి వచ్చింది?

ఈ విషయాన్ని ఉన్నవ లక్ష్మీనారాయణ చాలా తెలివిగా చెప్పాడు. దళిత రామదాసుకు చేను, దొడ్డి, పశువులు ఉంటాయి. చక్కని ఇల్లు ఉంటుంది. ఎప్పుడూ అలుక్కుంటారు. విసనకర్రలు అల్లుతారు. ఇది నేను చూసిన పల్లె. ఉన్నవ లక్ష్మీనారాయణ గారు నిజాయతీగా రాశాడు. రామదాసు కుటుంబం ఏమిటి అనేది రాశాడు. ఇక్కడ గుర్తించాల్సినది ఏమిటంటే దళితుల జీవన విధానంలో ప్రకృతిని గుర్తించారు. నీటిని గుర్తించారు. భూమిని గుర్తించారు. మానవ శ్రమను గుర్తించారు. మాటల్లో కమ్మవారిని, రెడ్లను, నాయుళ్లను అయ్యా అంటారు. వారు తూలనాడి మాట్లాడతారు.

అందరూ కలిసి పొలంలో అన్నం కలుపుకుని పచ్చడి వేసుకుని, లేనివారికి కూడా పంచడం నుంచి కూడు అనే పదం వచ్చింది. అయితే బ్రాహ్మలు ఇతరులు చూస్తుండగా తినరు. దద్దోజనం, చక్రపొంగలి, వడియాలు తింటారు. మరి పోతులూరు వీరబ్రహ్మం ఎందుకు చెప్పాడు? వేమన ఎందుకు చెప్పాడు? తత్వాలు ఎక్కడి నుంచి వచ్చాయి. రచ్చబండ మీద తత్వాలు ఎందుకు వచ్చాయి. కృష్ణదేవరాయలు మాల దాసరి కథలో మౌఖికుడు గొప్పవాడని ఎందుకు చెప్పాడు. రామదాసు సాత్వికంగా ఉండి వీరోచితమైన పిల్లలను ఎందుకు కన్నాడు? భూస్వాములు, వారి కొడుకులు ఒక పాతిక ఎకరాలు ఉంటే వారి పిల్లలు 50 ఎకరాలు సంపాదించాలని అనుకుంటారు. అదే దళితుల పిల్లలు గాంధేయవాదం నుంచి మార్క్సిజం వైపు వెళ్లారు. అంబేదర్ వాదం వైపు వెళ్లారు. బౌద్ధం వైపు వెళ్లారు. చార్వాకం, బౌద్ధం ఎక్కడ బతికిందంటే అంబేద్కర్ చెప్పినట్టు దళిత పల్లెల్లో బతికింది. దళితులను వెలి వేయడం వెనక వారు బౌద్ధాన్ని అనుసరించడమే కారణం. ఈ ఫిలాసఫీ అర్థమైతే తప్ప ఈ పుస్తకం అర్థం కాదు. గాంధీ గారు ఒక పిరియడ్‌లో మాలపల్లిని ప్రభావితం చేశారు. అంబేద్కర్ గురించి కూడా థాట్ తీసుకోవచ్చు. చెప్పినవాడు ఫిలాసఫర్ కాదు. గాంధీ ఫిలాసఫర్ కాదు. ఆయన డిప్లమాట్‌గా ఉన్నాడు. సమన్వయకర్తగా ఉన్నాడు. కులాలన్నీ ఐక్యంగా ఉండాలి. కులాలు సామరస్యంగా ఉండాలి అని చెప్పాడు. హరిజనులను జాగ్రత్తగా చూడండి అని చెప్పాడు.

పట్టణాలు ఏర్పడినప్పుడు 1922లో వీరు గ్రామాల నుంచి వెళ్లగొట్టడంతో పట్టణాలకు వలస వెళ్లి మురికివాడల్లో నివసించారు. గాంధీ గారికి కాంగ్రెస్ పార్టీ ఉంది కాబట్టి, అదే దేశమంతా వ్యాపించి ఉంది కాబట్టి పల్లెల్లో ఆయన ప్రభావం ఎక్కువ ఉంది. ఆయన అంబేద్కర్ నుంచి తీసుకున్నప్పటికీ కూడా గాంధీ ప్రభావం ఎక్కువ ఉంది. గాంధీని రామదాసు అధిగమించాడని చెప్పారు. ఎలా అధిగమించాడు? అప్పటికే రామదాసుకు జ్ఞానం ఉంది. గాంధీకి రామానుజాచార్యులు, మధ్వాచార్యుల భావజాలం లేదు. శైవులు, పండితారాధ్య చరిత్ర, కబీర్, వేమన, చక్రధర్, నానక్, భిక్షమడిగిన వాడికల్లా

భిక్షమేసింది ఎవరు? కమ్యూనిస్టులు ఎక్కడ ఎక్కడ ఆశ్రయం తీసుకున్నారు? బసవపున్నయ్య గారు ఎక్కడ ఆశ్రయం తీసుకున్నారు, చంద్ర రాజేశ్వరరావు ఎక్కడ ఆశ్రయం తీసుకున్నారు. వేములపల్లి శ్రీకృష్ణ గారు ఎక్కడ ఆశ్రయం తీసుకున్నారు. వీళ్లంతా పల్లెల్లోనే ఆశ్రయం తీసుకున్నారు. పై కులాలవాళ్లు ఆశ్రయం ఇవ్వలేదు. అసలు వారికి వాడే లేదు. దళిత పల్లె అసలు ఊరు. భారతదేశంలో అసలు ఊరే లేదు. చాతుర్వర్ణం అనేది కల్పించబడింది. అంబేద్కర్ చెప్పాడు. పల్లె అంటే వ్యవసాయం చేస్తుండాలి, ఉత్పత్తి పరికరాలు ఉండాలి అని అద్భుతంగా చెప్పారు. ఉన్నవ గారు చెప్పిన గొప్ప విషయం ఏమిటంటే ఆయన వేదార్థమేమీ చెప్పడం లేదు. వేదాంతం మాత్రమే చెప్పడం లేదు. ఆయన చేతిలో కొడవలి ఉంది. ఆయన చేతిలో పార ఉంది, ఆయన చేతిలో పలుగు ఉంది. ఆయన మడి కడుతున్నాడు. నాగిరెడ్డి గారికి, పుల్లారెడ్డి గారికి మాలపల్లెలు ఆశ్రయాలుగా ఉన్నాయి. అంబేద్కర్ చెప్పాడు. కులం ఒకనాడు పుట్టింది. మళ్లీ పోతుంది. ఇది ఒక వాదన. మాలపల్లె, మాదిగ పల్లె వేరు కాదు. రెండూ ఒకటే. ఉత్పత్తి పరికరాలు వేరంతే. వీడు కొడవలి తీసుకుంటే వాడు ఆరె తీసుకుంటాడు. అందరూ అన్నదమ్ములే. వారు తాత్వికులు. ఇప్పటి వారు పాడుకునే పాటలు చూడండి. ఎవరూ చదవకుంటే వారికే భాష రాలేదు. మరి తత్వాలు ఎలా వచ్చాయి? అంబేద్కర్‌కు ఇంగ్లీష్ ఎలా వచ్చింది? బ్రాహ్మలు ఎంతోమంది సంస్కర్తలు అయ్యారు. కందుకూరి వీరేశలింగం పంతులు, ఉన్నవ లక్ష్మీనారాయణ... గోరా గారు దేవుడే లేడని చెప్పాడు. వాళ్లను ఎవరినీ మేము కాదనలేదు. సాంస్కృతిక విలువలు దళిత పల్లెలో ఎక్కువ. అందరూ దళిత పల్లె నుంచి నేర్చుకున్నవారే. పోరాటం ఎక్కడ నేర్చుకున్నారు. చంద్ర రాజేశ్వరరావు గారు నాకు చెప్పారు. మాలపల్లెలో నేర్చుకున్నానని. బాకులు, ఈటెలు, గండ్రగొడ్డళ్లు తిప్పిందెవరు? అసలు మాల కన్నమనీడు కత్తులు, కటార్లు తీసుకున్నాడు. వీళ్లు భూముల కోసం తీసుకున్నారు. గాంధీగారు చంపబడ్డారు. ఆర్ఎస్ఎస్, విహెచ్‌పి ఇవాళ మళ్లీ ఆయనను ఓన్ చేసుకుంటున్నాయి. ఉన్నవ లక్ష్మీనారాయణ గారు, రామదాసు గారు ఎమోషనల్ విప్లవకారులు. బసవపున్నయ్య గారు ఏమన్నారు? కమ్యూనిస్టు పార్టీ అంటే మాలల పార్టీ, మాదిగ పార్టీ అన్నారు. మొత్తం నక్సలైట్లు అందరూ ఎవరు?

భూస్వామ్య కులాల నుంచి సెక్యులరిస్టులు వచ్చారు. నీతిమంతులు ఉన్నారు. ఆ కులాల్లో ప్రజాస్వామ్యవాదులు ఉన్నారు. మేము కాదడనం లేదు. కానీ ఈ కులం పోవాలి. కులం పునాదుల మీద మీరు ఒక జాతిని, నీతినీ నిర్మించలేరు. అది గాంధేయవాదమైనా, అంబేద్కర్ వాదమైనా, మార్క్సిజమైనా. ఒక తాత్వికతను గురించి ఆలోచించండి. ఉన్నవ మాలపల్లెలో అన్ని వాదాలూ ఉంటాయి. అన్ని వాదాల్లోకెల్లా నిజమైన వాదం నీతివాదం. ప్రకృతివాదం ఉంది. మాలపల్లెను రచించిన ఉన్నవ వారు మహోజ్వలమైన రచయిత, కేవలం సంస్కర్త కాదు. పాత్రలను మన కళ్ల ముందు చూపించారు. వాదాలను ఉన్నదున్నట్టు చూపించారు. దళితుల జీవన చిత్రం గీసిన ఉన్నవ వారికి సెల్యూట్!



## తలవొంచరు

అణిగి ఉన్న యువరక్తం తిరిగి మరలా ఉరకలేస్తూ
వారి నరనరాల్లోకి దూకింది
వారు ఎదిరించింది గద్దె తీర్పునే కాదు
కాలం నదిలో పొర్లుతున్న వయసుని కూడా...
భాష్పవాయువులు...
జలఫిరంగులతో పాటుగా
దురహంకారానికి కూడా
అకుంఠిత దీక్ష ఎదురొడ్డి నిలిచింది

వెలిగించిన దివిటీలు
సుడిగాలికైనా తలొగ్గలేదు
మట్టితలనొంచిన వాళ్ళకి
పాలకుల తలనొంచడం చేతనవుతుంది

రాకేష్ టికాయత్, పాల్, మొల్లా....
జోగిందర్ సింగ్, సుఖదేవ్ సింగ్,
బల్బీర్ సింగ్ గుర్నాంసింగ్ తదితర యోధులు
ఇంటిని వసారా కప్పచెప్పి
రైతన్నల భుజాలపై తువ్వాలులయ్యారు

తంత్రాల యంత్రాలు వృథా నీరై
కాలువ లోనికి దొర్లాయి
రాయలన్నీ కలిసి దుర్గమై నిల్చున్నై
ఆకాశాన్ని చుట్టేసిన నక్షత్రాల్లా
చట్ట నేతల మస్తిష్కాన్ని ఉండచుట్టేసినై!

సమీకరించడంలోనూ
సమాయత్తపరచడంలోనూ
మెట్టు ఎక్కినప్పుడు
అపజయాలు కింద మెట్టుకు దొర్లిపోతాయి

నాయకత్వం అంటే..
జనాల భుజాలపై ఊరేగటం కాదు
ప్రజల వైపుకేసిన రాయికి అడ్డుపడటం
అలాంటి నాయకులు ఉద్యమాలనే కాదు
మనసులూ గెలుస్తారు!

– శ్రీధర్ బాబు అవ్వారు
**85001 30770**



# ఖైదీ నెం. 6657 రాసిన 609 పేజీలు

1922 ఏప్రిల్ 9..

గుంటూరు జిల్లాలో సహాయ నిరాకరణోద్యమం, పన్నుల నిరాకరణ వంటివి జోరుగా సాగాయి. ఆ తరుణంలోనే ఉన్నవ లక్ష్మీనారాయణను మాడభూషి నరసింహాచార్యులను అరెస్టు చేయడం పెద్ద దుమారానికి కారణమైంది. వారిని రాయవేలూరు జైలుకు పంపించారు. ఉన్నవకు కన్విక్టు నెంబర్ 6657 ఇచ్చారు. ఏడాది పాటు ఖాళీగా వుండటం వూహించలేని వున్నవ తనలో కదిలే భావాలను నవల రాయాలనుకున్నాడు. జైలు అధికారులను అనుమతి కోరడంతో పాటు కాగితాలు కూడా అడిగాడు. రాసిన తర్వాత అభ్యంతరం లేకపోతేనే అనుమతిస్తామనే షరతుతో వారు అంగీకరించారు. ఆ విధంగా ఎనిమిది ఎక్సర్‌సైజు పుస్తకాల్లో 609 పేజీలు రాశాడు. నాలుగు భాగాల నవల 1922 ఏప్రిల్ 9కి పూర్తయినట్టు రాతప్రతిని బట్టి తెలుస్తుంది. జులై 21న విడుదల చేయబోతున్నట్టు ప్రకటించిన అధికారులకు నవలను పరిశీలించే పని పడింది. జైలు సూపరెండెంట్ ఎనిమిది నోట్ పుస్తకాలు తీసుకెళ్లాడు. దాన్ని ఉత్తర ఆర్కాట్ జిల్లా కలెక్టర్‌కు పంపించి పరిశీలించాలని కోరాడు. అయితే తమ దగ్గర తమిళం తప్ప తెలుగు లోతుగా తెలిసిన వారు లేరంటూ ఆయన వెనక్కు పంపేశాడు. సూపరెండెంటు యాండర్సన్ దాన్ని జైళ్లశాఖ కార్యదర్శికి పంపించాడు. ఆయనా దాన్ని న్యాయశాఖ కార్యదర్శికి పంపించాడు. ఉత్తరోత్తరా సంచలనం కాబోతున్న మాలపల్లి నవల ఇలా అధికారుల శాఖల చుట్టూ తిరిగింది. ఖైదీ విడుదలవుతున్నాడు గనక తన నవల ప్రతి ఇచ్చేసి అచ్చయిన తర్వాత తప్పులుంటే చూసుకోవచ్చని జైలు అధికారులు రాస్తే చాలా వరకూ అలాగే అనుకున్నారు. అయితే హఠాత్తుగా ఒక ఉన్నతాధికారి చక్రం అడ్డు వేశాడు. జైలునుంచి బయటకు వెళ్లిన వున్నవ ఈ నవల గురించి మాట్లాడుతున్నాడనీ, తను ఏం చెప్పాడో తెలుసుకోవాలని పురమాయించాడు.

వున్నవ విడుదలైన రోజునే ఆంధ్ర పత్రిక సంపాదకీయంలోనే స్వాగతం పలుకుతూ... మాలపల్లె నవలను గురించి ప్రస్తావించింది. 1922 సెప్టెంబరు 23న చిత్తూరులో ఆంధ్ర మహాసభల్లో హేమాహేమీ నేతలు పాల్గొన్నారు. వున్నవ అధ్యక్షుడుగా వెళ్లాడు. ఆయన గురించి ఆంధ్ర పత్రిక ఒక పేజీ నిండా జీవిత చరిత్ర ప్రకటించింది. 'కారాగృహముననున్న సమయమున వారు కాలమును వృథా పుచ్చక మాలపల్లె యను సాంఘిక నవలను రచించి ఆంధ్ర

[illegible]

"The book could probably be forfeited under section 99 (A) of C. P. C. I do not however think that this would be the proper course. The Superintendent, on being informed of the contents should destroy the book as consent to its writing was only given subject to censoring. To hand the book over would in my opinion render jail administration rather ludicrous."
24-2-23.

[illegible]

"If, as a matter of fact, the book has been published and reviewed, there is no point in returning or immediately destroying the manuscript. If, however as is likely no application for its return is made, it may be destroyed after a few months. There is no basis in giving a handle to frail criticism. It is however a matter for investigation as to how the publication of the book took place. Much of the book seems to be silly stuff but there is a portion which is provocative and suggestive.

"The translation may be sent to the Advocate General for his opinion as to whether the book offends against civil law or invites the application of section 99A (vide Act XIV of 1922)
5-3-23.

వాఙ్మయాభివృద్ధికి తోడ్పడిరి' అని కూడా రాశారు. స్వరాజ్య, హిందూ ఇంగ్లీషు పత్రికలు కూడా ఆయన రాసిన నవల గురించి పేర్కొని వుంటాయని బంగోరె వూహించారు.

ఇప్పుడు మళ్లీ వెనక్కు వెళితే చీఫ్ సెక్రటరీ ఆదేశాలతో 1922 డిసెంబర్‌లో ఈ ఎనిమిది నోట్ పుస్తకాలనూ మద్రాసు ప్రభుత్వ తెలుగు అనువాదకుడు బి.సోమసుందరరావుకు పంపించారు. దానిపై రాజద్రోహం ఆరోపణకు అవకాశం ఇస్తూ నివేదిక రాశాడు. ప్రభుత్వ శాఖలు చాలావాటిని నిరసించాడనీ, బొల్షివిక్ విప్లవానికి, సహాయ నిరాకరణోద్యమానికి అనుకూలంగా అతిశయంగా రాశాడని ఫిర్యాదు చేశాడు. ఈ నవలకు అనుమతినివ్వడమంటే కొరివితో తలగోక్కోవడమేనని అభిప్రాయపడ్డాడు. 1923 జనవరి 6న ఇదంతా ఒక పోస్టు కార్డు మీదనే రాసిన బి.సోమసుందరరావు నవలలో అభ్యంతరకర భాగాల అనువాదం, తర్జుమాలతో విడిగా పంపుతానన్నారు. ఫిబ్రవరి 8న అదంతా 20 పేజీల టైపు అనువాదంతో సహా పంపించారు. ఇప్పుడు మనం ఉత్తేజకరంగా భావించే భాగాలనే ఆ బ్రిటిష్ ఉద్యోగి రంగు పెన్సిల్‌తో గీతలు గీసి మరీ ఏలినవారి దృష్టికి తెచ్చాడు.

ఇంకేముంది? మళ్లీ కలకలం..

బొల్షివిక్ విప్లవం గురించి గొప్పగా రాశాడని తెలిశాక అండర్ సెక్రటరీ మరీ రెచ్చిపోయాడు. ఈ విషయంలో ఉపేక్ష ఎందుకు? దాన్ని కాల్చి మసిచేస్తే పోతుంది కదా? అని రాశాడు. 1923 జనవరి 22న. బ్రిటిష్ అధికారులు మనవారి కంటే మెరుగనిపించేలా ఒక అధికారి అందుకు అభ్యంతరం తెలిపాడు. 'కాల్చిపారేయడానికి మనకేం అధికారముంది? అతను అచ్చువేస్తే తప్పులుంటే చూడాలి. కాదు ధ్వంసం చేయాలంటే మరింత లోతుగా పరిశీలించి తేల్చాలి' అని సలహా ఇచ్చాడు. అప్పుడు చర్చ ఇంకా వెనక్కు వెళ్లింది. అసలు జైలులో ఎందుకు రాయనిచ్చారు? అందుకు చట్టాలు అనుమతిస్తాయా? అని తర్జనభర్జన పడ్డారు.

చదువుకోవడానికి, ఉత్తరాలు రాసుకోవడానికి వీలుంది కానీ నవలలు రాయనిస్తారా అని ప్రశ్నించారు. అప్పటికి రాయవేలూరు జైలు సూపరెండెంటు అండర్సన్ మారిపోవడంతో– తనకు తెలియదని తర్వాత వచ్చిన ఆఫీసర్ తప్పించుకున్నాడు. అప్పుడు పైనుంచి కిందివరకూ పెద్ద మధనం జరిగింది. 1894 జైళ్ల నిబంధనల ప్రకారం అసలు రాయనివ్వచ్చునా? రాస్తే రాతప్రతి ఇవ్వాలా? రాసుకున్న దానిపై హక్కులేంటి? ఇదంతా అయ్యాక న్యాయ శాఖ ఒక పెద్ద నోట్ తయారు చేసింది. పుస్తకాన్ని లేకుండా చేయడమే సరైందని న్యాయశాఖ కార్యదర్శి రాయనే రాశాడు. అయితే అప్పుడే పిడుగులాటి వార్త వచ్చింది. ఆ నవల అచ్చయిపోయింది! అంతేగాక స్వరాజ్య పత్రిక వివరమైన సమీక్ష కూడా రాసేసింది! పైనుంచి కిందవరకూ అధికార గణం తెల్లబోయింది. రాతప్రతి జైలులోనే ఉంది. కాని కాపీ బయటకు పోయింది. ఎలాగంటే వున్నవ రాసిన దాన్ని సహఖైదీ మాడభూషి నరసింహాచార్యులు అందంగా కాపీ రాయగా దాన్ని బయటకు పంపించారు. బెజవాడ ఆంధ్ర పరిషత్ వారు రెండు భాగాలుగా ప్రచురించారు. మూడో భాగం ఇంకా రావలసి వుంది. నాలుగో భాగం గురించి తెలియదు. ఇదీ సిఐడిల సమాచారం. దాంతో అడ్వకేట్ జనరల్ సి.మాధవన్ నాయర్ నవల మొత్తం రాజద్రోహం కిందకు వస్తుందనీ, 124, 153 సెక్షన్ల కింద సిఆర్‌సిపి 93 కింద చర్య తీసుకోవాలనీ సిఫార్సు చేశాడు. వున్నవను ప్రాసిక్యూట్ చేయాలని ఆయనతో సహా అధికారులంతా సిఫార్సు చేశారు. లా మెంబర్ సిపి రామస్వామి నాయర్ కొన్ని సన్నాయి నొక్కులు నొక్కినా గవర్నర్ వెల్లింగ్టన్ మాత్రం నిషేధానికే నిర్ణయించాడు. జైలు అధికారులను చివాట్లు పెడుతూ నవలను నిషేధించకపోతే బాధ్యతలను ఉల్లంఘించడమే అవుతుందని ప్రకటించారు. 1923 ఏప్రిల్ చివరలో ఆయన ఈ లేఖ రాయగా, ఆ మే నెల 14న మద్రాసు ఫోర్ట్‌సెంట్ జార్జి గెజిట్ మాలపల్లిపై నిషేధ ఉత్తర్వులు జారీ చేసింది.

అప్పటికి రెండు భాగాలు మాత్రమే విడుదలయ్యాయి. మరో రెండు భాగాలు వచ్చాక తెలియజేయాలని సిఐడిలకు ఆదేశాలకు వెళ్లాయి. 1923 జులై 27న మూడోభాగం విడుదలైందని వారు నివేదించారు. అచ్చుగాని ఈ మూడో భాగానికి నిషేధం ఉత్తర్వు వర్తించదనీ కొత్తగా జారీ చేయాలని ధర్మ సందేహం లేవనెత్తారు. ఎందుకైనా మంచిదని దానిపై మరో నిషేధం విడుదల చేశారు.

**(బంగోరె పుస్తకం ఆధారంగా)**

గవర్నర్ విలింగ్డన్ ఈ క్రింది విధంగా వ్రాశాడు:

> "I quite agree to the book being declared forfeit. I own I can't see that it was a very disgraceful thing for the individual to have written two copies in the hope that he might get out of jail with one in his pocket, undiscovered, and having done so, to get it printed at once. It should be gross slackness and stupidity on the part of the jail management." 27.4.23.

ఈ ఆర్డర్ పడడంతో, 9 నెల్లక్రితం ప్రారంభమైన ఫైల్ యిన్నాళ్ళకు ఒక కొలిక్కివచ్చింది.

1928 మే నెల 14 న మద్రాసు ఫోర్ట్ సెంట్ జార్జి గెజెట్‌లో ఈ క్రింది ప్రకటనను ప్రచురించి మాలపల్లి నవలను ప్రభుత్వం నిషేధించింది:

## NOTIFICATION

*(G.O. No. 396 public.)*

**No. 176 - In exercise of the powers conferred by the section 99-A of the Code of Criminal Procedure, 18°8, the Governor in Council hereby declares to be forfeited to His Majesty all copies wherever found of the Telugu book entitled "Malapalle" (The Adi-Andhra Hamlet) or "Sanga Vijayamu" (The Triumph of Sangadas) written by Vunnava Lakshminarayana of Guntur while confined in the Central Jail, Vellore, and published in contravention of the terms on which permission was granted by the Andhra Parishad, Bezwada, and all other extracts from the said book inasmuch as it contains seditious matter the publication of which is punishable under section 124-A of the Indian Penal Code.**

E. S. LLOYD,
Acting Chief Secretary.



# మాలపల్లి
# ఎప్పుడు, ఎలా మొదలైంది?

 బంగోరె

ఉన్నవ ... జన జీవితంతో ముఖ్యంగా, శ్రామికవర్గ జీవితంతో ఆ మాత్రమైనా తాదాత్మ్యం చెందినవాడు కాకపోతే మాలపల్లి నవల సృష్టి సాధ్యమై ఉండేది కాదు. తెలుగు నేలను దద్దరిల్ల చేసిన ఆనాటి అనేక రకాల రాజకీయ సాంఘిక ఉద్యమాల్లో నుంచి నేరుగా వూడిపడ్డ నవల మాలపల్లి.

దేశమంటే మట్టి అనే భావన కాదు వున్నవది. దేశమంటే మనుషులోయ్ అని నిత్యానుభవ రీత్యా మనసుకు తెచ్చుకుని మసులుతూ వచ్చాడు. అందువల్లనే సమకాలీకులైన కొందరు భావకవుల మోస్తరు దేశాభిమానాన్ని మింటిలో మట్టిలో చుక్కల్లో పూలమొక్కల్లో, కాకుంటే చరిత్ర గుర్తుల్లో వెదజల్లుకోకుండా- మనుషుల మధ్యలో నిమగ్నం జేసుకుని వాళ్ల చిక్కుకున్న సుడిగుండాల్లో నిమజ్జనం చేసుకుని తాను అర్పించుకునే క్రియానిరతికి తనకు చేతనైన పరిధిలో ఒక వుదాహరణగా వుంటూ వచ్చాడు. జన జీవితంతో ముఖ్యంగా, శ్రామికవర్గ జీవితంతో ఆ మాత్రమైనా తాదాత్మ్యం చెందినవాడు కాకపోతే మాలపల్లి నవల సృష్టి సాధ్యమై వుండేది కాదు. తెలుగు నేలను దద్దరిల్ల చేసిన ఆనాటి అనేక రకాల రాజకీయ సాంఘిక ఉద్యమాల్లో నుంచి నేరుగా వూడిపడ్డ నవల మాలపల్లి.

దేశ రాజకీయ ఉద్యమాల్లో స్పష్టమైన ఆర్థిక లక్ష్యాలు కూడా చోటు చేసుకుంటున్న రోజులవి. కమ్యూనిస్టు పార్టీ అనేది తెలుగునాట అవతరించకముందే మార్క్సిస్టు భావప్రేరణకు నాంది పలికిన తొలి సృజనాత్మక రచనగా మాలపల్లిని పేర్కొనవలసి వుంటుంది. రష్యాలో అక్టోబర్ విప్లవం మహా విజయం పొంది కమ్యూనిస్టు ప్రభుత్వం ఏర్పడ్డంతో మనదేశంలో కూడా వామపక్ష సిద్ధాంతాలు, వర్గ పోరాట భావ బీజాలు స్లోగా పాటమరిస్తున్న రోజులవి. (మన దేశంలో సాగుతున్న బొల్షివిక్ ప్రచారాలపై నిఘా వేసి ప్రభుత్వానికెప్పటికప్పుడు చేరవేస్తూ వుండేందుకు గాను మద్రాసు ప్రభుత్వం 1920లోనే చర్యలు తీసుకుంది. అబ్దుల్ హసన్ అనే సిఐడి సబిన్‌స్పెక్టర్ బెంగుళూరు ప్రాంతంలో ప్రత్యేకంగా పనిచేసేందుకు గాను 1920 మే నెల ఆరవ తేదీ నుంచి కొన్ని నెలల పాటు మద్రాసు ప్రభుత్వం డెప్యుటేషన్‌లో వుంచిందంటే అప్పటి బ్రిటిష్ ప్రభుత్వానికి బొల్షివిక్ ప్రచారమంటే యెంతగా కంపరం పుట్టించిందో- యీ వొక్క సాదృశ్యం చాలు.

(మద్రాసులోని తమిళనాడు ఆర్కివ్స్‌లో 16.10.1920 నాటి హోం డిపార్టుమెంట్ జీవో 729)

దీనికి సమాంతరంగా ఆంధ్రలో (అప్పటి మద్రాసు సంయుక్త రాష్ట్రంలో) బ్రాహ్మణేతరోద్యమం పేరుతో తారాజువ్వలా దూసుకొచ్చి మాంటేగు చేమ్స్‌ఫర్డ్ సంస్కరణల పేర జరిగిన యెన్నికల్లో జస్టిస్ పార్టీ వేషంలో భూస్వామ్య ప్రాతినిధ్య ప్రభుత్వం గద్దె మీదకు వచ్చింది. జస్టిస్ పార్టీకి గుంటూర్లో మంచి పట్టే దొరికింది. దీనికి రియాక్షన్‌గా మాలపల్లి వుద్భవించిందా అనేది కూడా చూడాల్సి వుంది. భారత రాజకీయాకాశంలో గాంధీజీ నక్షత్ర ప్రభలు వెలుగొందడం ప్రారంభమైన రోజులవి. బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సహాయ నిరాకరణ, సాత్విక నిరోధం ఒక వుద్యమావేశంగా తెలుగు భావుకులను ముంచెత్తుతున్న సన్నివేశమది. ఆంధ్రలో ఇంకో ఏడాది లోపునే అల్లూరి సీతారామరాజు లేవనెత్తబోతున్న సాయుధ విప్లవం సంసిద్ధమవుతున్న దశావిశేషమది.తెలుగు నాట వెల్లివిరిసిన ఈ ప్రజా సంరంభమే వున్నవ నవలకు విశాల నేపథ్యం. సంక్లిష్టమైన ఈ నానా రకాల మార్పుల ముడుల్లోబడి అస్తవ్యస్తమైన అస్పష్టమైన అలజడిలో చిక్కుకున్న తెలుగు ప్రజ స్థితిగతులను సృజనాత్మక ప్రక్రియలో చిత్రీకరించి వొక గమ్యసూచన చేయాలనే తపన మాలపల్లిలో గోచరమవుతుంది.

'వొక్క యేడాదిలో స్వరాజ్యాన్ని సాధించి తీర్తాం' అని గాంధీజీ నినాదమివ్వడంతో ఆ స్వరాజ్యం యెట్లుండాలి అని స్వప్నించడం ఎక్కువైంది వున్నవకు. స్వరాజ్యం సురాజ్యంగా కూడా వుండాలనుకున్నాడు... రాజ్యాధికారం చేతులు మారడమేనా స్వరాజ్యం? కాకూడదు కారాదు అనుకొన్నాడు వున్నవ. దేశంలో వొకేవొక్క అఖండమైన జాతినే గాదు వున్నవ చూచింది. జాతిపొరల్లో వర్గాల్ని చూశాడు. వర్గాల మధ్య విరుద్ధ స్వభావాలను ఆకళించుకున్నాడు. నిరంతరం సాగే వర్గపోరాటాల్ని చూశాడు. వొక జాతిని మరొక జాతి శాసించడాన్ని, దోచుకోవడాన్ని అధర్మం, అక్రమం అని యెట్లంటున్నామో – వొక జాతిలోని వొక వర్గాన్ని యింకో వర్గం నిలువుదోపిడీ చేయడం, అణగదొక్కడం అంతకంటే యెక్కువ అధర్మం అక్రమం కాదా? వొక జాతిలో అన్నానికి వస్త్రానికి గతిలేని దరిద్రులధికులై.. కొందరు మాత్రం అంతులేని సంపదల్లో సౌఖ్యాల్లో వోలలాడేవారు అయితే యెట్లా? యీ స్థితి వున్నంత వరకూ శాంతి యెట్లా సాధ్యం? స్వాతంత్ర సమత్వ సౌభాగ్యాలతో కూడిన సమగ్ర జీవనంతో కళకళలాడుతుండడమే కదా శాంతి? దీనికి ప్రతీకగా వుండాలి ఆ వచ్చే స్వరాజ్యం. యిదీ వున్నవ కల!

గాంధీయిజాన్ని, బోల్షివిజాన్ని సమ్మిశ్రం చేసి సమన్వయం వంటిదేదో చూపాలనుకొన్నాడు. ఆ చూపడం యెట్లా? బోల్షివిజాన్ని పూర్తి విజాతీయమైన సిద్ధాంతంగానే సంభావించుకోవాలా? విజాతీయమే అయితే దానికి అంట్లుగట్టి సజాతీయం చేసుకోవడానికి వీలు లేదా? ఈ రెండు భిన్న మార్గాలకు, ధోరణులకు ప్రాతినిధ్య సన్నిభమైన, ప్రాణపూర్వమైన రెండు సజీవ పాత్రలను సోదరులుగా ప్రవేశపెట్టి నవలీకరిస్తే యెట్లుంటుంది? యీ రెండు పాత్రల్లో యేది మంచిదో బేరీజు వేసినట్లుండకూడదు. అట్లా బేరీజు వేసి చూపడానికి తనెవరు? పాఠకుల ఆలోచనకే వదలడం బాగుంటుంది. కథా చిత్రణ అట్లా కొనసాగాలి. తన నవలలో స్వరాజ్య ధర్మం సరసన సమతా ధర్మం సమవుజ్జీగా వుండి నడవాలి. ఆనాటికి మన దేశంలో వున్నదల్లా వొక్క స్వరాజ్య గత్తరే. సమతా రాజ్య సామ్యవాద ధర్మ ప్రస్తావనలను యీమాత్రమైనా సృజనాత్మకంగా తీసుకురావడం అనేది ఆనాడే ఉన్నవ వేసిన గొప్ప ముందడుగు. ■



## ఉన్నవ

# ఉద్యమంలోకి ఎందుకొచ్చారు?

" ఉన్నవ లక్ష్మీనారాయణగారితో ఒకప్పుడు నేను సంభాషించియుంటిని. అప్పుడు వారిని .. 'ప్లీడరు వృత్తి మీరు మానదలచినట్టు మీ గుమాస్తాల వల్ల నాకు తెలిసినది. 'మీ స్థితియేమి? మీరు ఎందుకు తొందరపడెదరు?' అని నేను ప్రశ్నించితిని. అందుకు వారు 'నిజమే. నేను ధనవంతుడను కాదు. నాకు ఆర్థిక లోపమున్నది. కాని ఏ వ్యక్తియైనను స్వలాభమును చూచుకొనుట ధర్మము కాదు. నేను ద్రవ్యము సంపాదించి నా యక్కరలు తీరువరకు యీ నాన్ కో ఆపరేషన్ మూవ్‌మెంట్ వుండునా? ఈ సమయంలో ఉద్యమమునకు తగిన సహాయము చేయకపోయినచో ముందు దేశమునకు మహా అనర్థకము రాగలదు గాన వెంటనే నా వృత్తిని నేను వదలి ఉద్యమ ప్రచారము చేయుటకు నిశ్చయించుకొంటిని' అని చెప్పి యుండెను."

పేరాల నుంచి రావుల సీతారామయ్య అను వ్యక్తి మామూలు పొడిపొడి మాటలో వ్రాసిన పై వాక్యాల్లో వున్నవ సహజ వ్యక్తిత్వాంశాలేవో ద్యోతకమవుతున్నాయి. ఆంధ్ర దేశము సహాయ నిరాకరణము అనే వార్తా విభాగంలో **1921** ఆగష్టు **4**వ తేదీ గురువారం నాటి ఆంధ్ర (దిన) పత్రిక **10**వ పేజీలో వచ్చిన ఒక చిన్న లేఖలోని వాక్యాలివి. వున్నవ లక్ష్మీనారాయణను మాచర్ల వద్ద అరెస్టు చేసి గుంటూరు మీదుగా పోలీసులు తీసుకుపోయిన పది రోజుల్లో అచ్చయిన చిన్న లేఖ అది.

..................

హిందూ **1910** జూన్ **7**వ తేదీన 'ద సెకండ్ వీరేశలింగం ఆఫ్ గుంటూరు' అని ఉన్నవను అభివర్ణించింది.

..................




THE HINDU.



# ఉన్నవ జీవితం భావ పరిణామం

❑ కెవి రమణా రెడ్డి

❝ ఉన్నవ .. గాంధీ భావ పరిధిలోకి రాకముందు తలపాగా, లాంకోటు, బూట్లు మీసాలతో రాజసం రూపుకట్టినట్టుండేవాడని ఆనాటి ఫోటోలను బట్టిచెప్పవచ్చు. ట్రినిటీ కాలేజీ ప్రిన్సిపల్ తన పంచె, తలపాగా చూసి వాటిని తీసేసే వరకూ క్లాసులోకి రాకూడదని ఆజ్ఞాపిస్తే అసలు క్లాసుకు రానేరాను అని రాసిపెట్టారట ఉన్నవ. 'ఆత్మగౌరవంతో జీవించని వాడు మృత్యుతుల్యుడని నా ఉద్దేశం' అని రాసిపెట్టారని నాటి సహాధ్యాయుడు త్రిపురనేని రామస్వామి రాశారు. ❞

ఉన్నవ లక్ష్మీనారాయణ గారిది చాలా గంభీర స్వభావమనీ, నలుగురితో కలిసి వుండరని కొందరి అభిప్రాయం. కాని ఆన్యోన్యంగా వుండేవారితో కుర్రవాని కంటే కొంటెతనంగా మాట్లాడి నవ్వించేవారు. ఏకాంతంగా వున్నప్పుడు వున్నవీ లేనివీ చెప్పి స్నేహితులను నవ్వించేవారు. ఆయన పెద్దవారైన కొద్ది అచ్చంగా నీర్కావి పట్టిన ముతక ఖద్దరు బట్టలు కట్టుకోవడం మొదలుపెట్టారు.

వంగీపురం కృష్ణయ్య గారింటిలో చదివే రోజుల్లో గుంటూరు రామచంద్రాపుర అగ్రహారం వెలుపల నల్లచెరువు గుట్టపై కోనేటి వద్దనో, అగ్రహారంలోని శివాలయంలో మల్లాది సోమయాజి కార్యదర్శిగా ఆంధ్ర భాషా సమాజ సభ్యుడుగా అంటే నవయువకుడుగా ఉన్నవ రూపం ఎలా వుండేది ఊహించుకోవలసిందే! ఐర్లండ్ బిన్ కింగ్స్ ఇన్‌లో మూడేళు ండి తిరిగి వచ్చాక గాంధీ భావ పరిధిలోకి రాకముందు తలపాగా లాంకోటు, బూట్లు మీసాలతో రాజసం రూపుకట్టినట్టుండేవాడని ఆనాటి ఫొటోలను బట్టిచెప్పవచ్చు. డబ్లిన్‌లో సహ భోజనాల క్రమంలో హ్యాట్‌కు బదులు తలగుడ్డ మాత్రమే ధరించేవాడు గనక తనకేదో జమీందారీ పాయ ఉ ందనుకునేవారట. ట్రినిటీ కాలేజీ ప్రిన్సిపల్ తన పంచ తలపాగా చూసి వాటిని తీసేసే వరకూ క్లాసులోకి రాకూడదని ఆజ్ఞాపిస్తే అసలు క్లాసుకు రానేరాను అని రాసిపెట్టారట. 'ఆత్మగౌరవంతో జీవించని వాడు మృత్యుతుల్యుడని నా ఉద్దేశం' అని రాసిపెట్టారని నాటి సహాధ్యాయుడు త్రిపురనేని రామస్వామి రాశారు.

పుట్టగానే ఉన్నవ అతివాది లేదా జాతీయ వాదిగా పుట్టలేదు. పైగా తన వ్యక్తిత్వంలో రాజకీయానిదే సర్వస్వం కాదు. సంఘ సంస్కరణలో కందుకూరి వీరేశలింగం నాయకత్వాన్ని గుర్తించి అనుసరించినట్టు 1902 నాటికే దాఖలాలు కనిపిస్తున్నాయి. రాజమండ్రిలో లాగే గుంటూరులో విడోస్ హోం స్థాపించడంతో మొదలైంది ఉన్నవ సంఘసంస్కరణ కృషి. గుంటూరు ప్రాడ్వివాకులు (రిజిస్ట్రార్) విశ్వనాథశాస్త్రి వీరేశలింగంను గుంటూరు పిలిపించారు. వీరి ఇంటిలోనే 1902 అక్టోబరు 11న బేతపూడి జోగిప్రకాశరావు వితంతువైన వేంకట రమణమ్మను పెళ్లాడినట్టు ఉన్నవ ఈ

**దాదాపు 40 దాకా వితంతు పునర్వివాహాలు చేయించి గుంటూరు వీరేశలింగం అని పేరు బడిన ఉన్నవ ... స్వకులస్తుల వెలినే గాక భార్య లక్ష్మీబాయమ్మ బలవంతపు ఎడబాటును కూడా ఎదుర్కొవలసి వచ్చింది. అయితే వీరేశలింగం ఉద్యమానికి, ఉన్నవ ఉద్యమానికి గల భేదాన్ని గమనించవలసి వుంది.**

పెళ్లిలో భోజనానికి వచ్చి యీ పక్షంతో చేరినట్టు వీరేశలింగం స్వీయ చరిత్రము రెండవ భాగం మొదటి ప్రకరణంలో రాశారు. తర్వాత గుంటూరులో చేయంబడిన స్త్రీపునర్వివాహములన్నియు శ్రీలక్ష్మీనారాయణచే చేయంబడినవి అని కూడా రాశారు.

దాదాపు 40 దాకా వితంతు పునర్వివాహాలు చేయించి గుంటూరు వీరేశలింగం అని పేరు బడిన ఉన్నవ స్వకులస్తుల వెలినే గాక భార్య లక్ష్మీబాయమ్మ బలవంతపు ఎడబాటును కూడా ఎదుర్కొవలసి వచ్చింది. అయితే వీరేశలింగం ఉద్యమానికి ఉన్నవ ఉద్యమానికి గల భేదాన్ని గమనించవలసి వుంది. సంఘ సంస్కరణం ముందా, స్వరాజ్యం ముందా అని మితవాదులూ అతివాదులూ తర్జనభర్జనలు చేస్తూ వచ్చారు. ఇది రాజకీయ సమస్యగా ముదిరింది. హైందవ పునరుద్ధరణ వైఖరిని సైతం రాజకీయ సాధనంగా మలుచుకోగలిగిన తిలక్ తాను సంస్కరణలకు వ్యతిరేకంగాననీ, పరరాజ్ అండదండలతో దేశీయులు నెగ్గింపచూసే సంస్కరణ ఉద్యమానికే వ్యతిరేకినని స్పష్టం చేశారు. రాజకీయాన్ని తగ్గించి సంఘసంస్కరణను తగ్గించలేదు గాని ఉన్నవ కొంతవరకూ పాశ్చాత్య ప్రభావ ఫలితమైన సంఘ సంస్కరణ మన్నిక గురించి త్వరలో సందేహం ప్రకటించసాగాడు. సంస్కరణ సత్ఫలితాలు నాలుక్కాలాలు సాగాలంటే అది దేశీయుల నుంచే పుట్టుకు రావాలి. గుంటూరు మండల సంస్కరణ సభ (రేపల్లె 1917) అధ్యక్షోపన్యాసంలో ఉన్నవ ఈ భావాలను వెలిబుచ్చారు. వివిధ సంస్కరణలు జాతీయాదర్శాలకు వ్యతిరేకం కాకున్నా సంస్కర్తలలో అధిక సంఖ్యాకులు బ్రహ్మమతాలవంబులై హిందూమతం కంటే క్రైస్తవాన్ని, బైబిలునీ ఇతర మతాలను అధికంగా అభిమానించినందు చేత ఈ బ్రహ్మలు ఎక్కువగా మిషనరీ సంస్థల నుంచి వచ్చిన వారై వుండటం చేత, సంస్కరణోద్యమాలకు మిషనరీలేవీ, ఆ సంస్థలేమీ మద్దతునిచ్చినందుచేత ఇవి ప్రజలో వేళ్లు తన్నుకోలేకపాయాయని ఆయన భావించారు. వీరేశలింగం ఇతర సంస్కర్తలు క్రైస్తవ మతాభిమానులైనా కాకున్నా సంస్కర్తల పాశ్చాత్య భావ ప్రేరణనూ, మిషనరీ సంస్థల మద్దతునూ పేర్కొనడంలో ఆయన విశిష్టత వెల్లడవుతుంది. 1901లోనే దివ్యజ్ఞాన సమాజం (థియోసిఫికల్ సొసైటీ) ప్రేరణతో మద్రాసు హిందూ అసోసియేషన్ తలెత్తి హైందవ సంస్కృతి మూలధర్మానికి అనువుగా జాతీయ పద్ధతులతో హైందవ సామాజిక మత అభ్యుదయం కోసం కృషి



చేయబూనింది. తాను ఈ సమాజంలో చేరిందీ లేనిదీ తెలియదు గాని ఉన్నవ కొంతకాలం గుంటూరు ప్రార్థనా సమాజంలో మాత్రం ఉండినట్టు తెలుస్తుంది. అది బ్రహ్మ సమాజానికి మహారాష్ట్రలో లాగా ఆంధ్రదేశంలో మారు పేరే. అయితే టీచర్ల ట్రయినింగు కోసం రాజమండ్రి వెళ్లివుండినప్పుడు (1907) వీరేశలింగం గారి వితంతు శరణాలయ కార్యనిర్వహణ భారం వహించిన ఉన్నవ దంపతులు త్వరలోనే వెళ్లిపోయారు. ఆ విషయంలో వారి పద్ధతులకు, తన పద్ధతులకు అభిప్రాయములలో ఏకీభావము కలుగనందును వెళ్లినట్టు వీరేశలింగం రాసుకున్నారు. ఉన్నవది హైందవ పునరుద్ధరణ దృక్పథం కాకపోవచ్చు గానీ మత సంప్రదాయకత ఆయన భావంలో పనిలో నిలిచే వుండిపోయింది. శారదా నికేతనం (1922 స్థాపన) అచ్చం సరస్వతీ దేవాలయమే! ఆయనకు దేశభక్తి, దైవభక్తి ఒక్కటే. పల్లెటూరి మనస్తత్వం తనలో జీతించిందన్నా తప్పులేదు. భూస్వామిక వ్యవస్థ భావాల పట్టు నుంచి తాను పూర్తిగా బయటపడలేదు.

వందేమాతరం ఉద్యమం ఉన్నవను సంఘ సంస్కరణ ఉద్యమంలోంచి స్వరాజ్యోద్యమంలోకి తెచ్చింది. బిపిన్ చంద్రపాల్ ఉపన్యాసాలను తెలుగు చేశాడు కూడా (1907). ఉన్నవ వ్యక్తిత్వంలో రాజకీయం ప్రధానాంశమా కాదా అన్నది కూడా వివాదానికి తావిచ్చే అంశమే. ఆనాటి ఆంధ్ర పత్రిక సంపాదకీయంలోనే ఈ సందేహం వెలిబుచ్చింది. ఉన్నవ మతాభిప్రాయాలు స్థిరత్వం పొంది కరుడు గట్టిపోక సాధన రూపంలో మార్పు చెందుతూ వచ్చాయని అనుకోవాలి. అయితే ఆయన అభిశుద్ధి నిరోధకుడు కాదు. హైందవ మతంతో సంబంధం లేదని కొందరు చెబుతున్న కులవ్యవస్థ సమాజానికి మాత్రం గుదిబండగా మారిందని గ్రహించాడు. ఆదికాలమున లేనేలేని భేదాలు కలియుగమున పెచ్చురిల్లిపోయాయని తక్కెళ్ల జగ్గని ధర్మబోధలులో చెప్పించాడు. కులాలు నశించాలంటే సహపంక్తి భోజనాలు ప్రజాదరణ పొందాలని గదర్ వీరుడు దరిశి చెంచయ్యతో తానే చెప్పారు. హిందువులకు సెక్స్ విషయంలో కంటే భోజనం విషయంలోనే కులాల పట్టింపు ఎక్కువని అన్నారు. వర్ణాంతరంగా కలసి బిడ్డలను కనేవారు



**ఉన్నవ సంఘ సంస్కరణలో కందుకూరి వీరేశలింగం నాయకత్వాన్ని గుర్తించి అనుసరించినట్టు 1902 నాటికే దాఖలాలు కనిపిస్తున్నాయి. రాజమండ్రిలో లాగే గుంటూరులో విడోస్ హోం స్థాపించడంతో మొదలైంది ఉన్నవ సంఘసంస్కరణ కృషి. 1902 అక్టోబరు 11న గుంటూరులో వితంతు పునర్వివాహం చేసినట్టు, ఉన్నవ ఈ పెళ్లిలో భోజనానికి వచ్చి యీ పక్షంతో చేరినట్టు వీరేశలింగం తన స్వీయ చరిత్రములో రాశారు.**

కూడా భోజనాల విషయంలో కలిసేవారు కాదన్నాడు. బ్రాహ్మణాధిక్యత అహంకారాలను ఖండించాడు. శారదా నికేతన్‌లో చేర్చుకున్న దళిత బాలికతో సహా విద్యార్థినులు కలసి భోజనం చేయకపోతే తనవద్ద కూర్చోబెట్టుకుని తినడం ఉన్నవ ఆచరణకు విశిష్టత కలిగించే అంశం. తనకు తానుగా ఒక ప్రేమమతం స్థాపించుకున్నట్టు ఒక రచనను బట్టి తెలుసుకోవచ్చు. మతవిషయాలలో అక్బరును తెగమెచ్చుకున్నారు... కానీ 1922లో జరిగిన ముల్తాన్ గొడవల పర్యవసానంగా .. ఇటు ఉన్నవ, అటు త్రిపురనేని తాత్కాలికంగానైనా హిందూ మహాసభ వైపు మొగ్గారు. క్రైస్తవ మతాంతీకరణలు కూడా ఉన్నవకు బాధ కలిగించాయి. బందరు గుంటూరులలో వీటి ఉధృతి బాగానే ఉండేది. *బుడబుక్కల జోస్యము* అనే గేయకథలో ఉన్నవ ఈ విషయాలు (హిందూ – ముస్లిం కలహాలు, క్రైస్తవ మతాంతీకరణ) గురించి వ్యాఖ్యానించారు.

ఆదిమాంధ్రులైన వారికందరికీ విడుదలలో విడుదల. పల్నాడంతా హరిజనులందరికీ పది లక్షల చెక్కలు వేసి పంచిపెట్టి ఏ బాధలు లేకుండా జీవించమని చెప్పడమే నా కిష్టం అన్నాడు ఉన్నవ. తానెంత అహింసావాది అయినా ... అహింస విషయంలో పూర్తి గాంధేయుడు కాలేదంటే తిలక్ ప్రభావం మిగిలివుండడమే కారణం కావచ్చు. పూనాలో ప్లేగు సందర్భంగా రాండ్ అయర్స్టలను చాపేకర్ సోదరులు హత్య చేసినప్పుడు వందేమాతరం ఉద్యమ కాలంలో గాని టెర్రరిస్టులను తిలక్ కంటగించుకోలేదు. కాకుంటే అత్యధిక హింసాబలం గల శత్రువును హింసామార్గంలో ఓడించడం అసంభవమని మాత్రమే అన్నారు. హిందూమతంలో హిందూ తత్వశాస్త్రంలో హింస, అహింస సిద్ధాంతాలు రెండింటికీ స్థానమున్నదనీ, రాముడు కృష్ణుడు సమయ సందర్భాలను అనుసరించి రెంటినీ అనుసరించారని ఉన్నవ (తనతో) అన్నట్టు దరిశి చెంచయ్య రాశారు. అంత గొప్పవేత్త రామదాసుకు కూడా గజదొంగ జగ్గడిలా గాక ధర్మదేవత అనిపించాడు. వేంకటదాసు జీవితం విచ్చిత నాటకం అనిపించింది. "నా ధర్మం జనులవంబిస్తే ప్రతివాళ్లూ యథాశక్తి పాటుపడి అవసరమైనంత తిని గుండె నిమ్మళంగా రేపటి గురించి చింత లేకుండా విద్యాబుద్ధులభ్యసిస్తూ పస్తులు లేని, భోగాలు లేని, రోగాలు లేని, నేరాలు లేని వాజ్యాలు లేని, ద్వేషాలు లేని స్వచ్ఛంద జీవితాలు అనుభవించడానికి అవకాశముంటుంది. ఇదే ప్రేమ రాజ్యం. వెంకటదాసుకు దేవుడితో పని వుంది. అయితే ఈ దేవుడు బీదవాళ్ల దేవుడు. ప్రజల పాలిట తండ్రి. అయితే ఇది ధర్మపన్నాల ద్వారా వచ్చేదా? పనిపాటుల జనమంతా ఒక్కటై కూలికి విలువ కలదని తెలుసుకుని కూలికి తగిన విలువ పుచ్చుకుని అవసరమైతే శ్రేణులు సమ్మె కట్టితే అసహాయయోగం అవలంబిస్తే ప్రపంచంలో సమతాధర్మం, కృతయుగ ధర్మం స్థాపించవచ్చు. ఈ రాజ్యం రాజ్యమే కాదు. బలప్రయోగం వుండదు గనక ఇది శుద్ధ అరాచకం. అందమైన యుటోపియా. గాంధీ కోరిందీ ఇదే. ఉన్నవదీ, గాంధీదీ గ్రామీణ మనస్తత్వం. అందుకుని వాళ్ల ఆదర్శ రాజ్యాలకు ఆదిమతే లక్షణం. అయితే వ్యక్తుల ఇష్టాయిష్టాలను బట్టి చరిత్ర నడవదు. దాని ధర్మాలు దానివి. దాన్ని బొల్షివిజం అనుకోబనిలేదు. అయితే నవలలో ఈ ఇజం ప్రస్తావనలెన్నో వస్తాయి. దాని ఛాయలు వున్నాయి. బంగొరె రాసినట్టు కమ్యూనిస్టు పార్టీ అనేది తెలుగునాట అవతరించకముందే మార్క్సిస్టు భావ ప్రేరణకు నాంది పలికిన తొలి సృజనాత్మక రచనగా మాలపల్లిని పేర్కొనవలసి వుంది. నిజమే కాని 1920 నాటికే దక్షిణ భారతదేశంలోనూ, ఆంధ్రలోనూ బొల్షివిక్ భావాలు జొరబడినట్టు ముఖబిర్ ఇ దక్కన్ (21-2.1920), జరీదా ఇ రోజ్‌గార్ (12-2-1920), దేశ్‌భక్తున్ (21-2-1920), కృష్ణా పత్రిక (6-3-1920) లను బట్టి గ్రహించవచ్చు. 1918 ప్రాంతాల్లో మద్రాసు కార్మికుల్లో లేచిన తీవ్ర ఆందోళన వల్ల మద్రాసు లేబర్ యూనియన్ ఏర్పాటయింది (27-4-1920). ఇదంతా బోల్షివిక్ విప్లవం పరోక్ష ప్రభావమే! ఆర్థిక దురవస్థలు ఇంకా దగ్గరి కారణం. అయినా అప్పటికింకా శాస్త్రీయ అవగాహన కూడా వుండే అవకాశం కొద్ది. అయితే తెలుగుదేశం కమ్యూనిస్టులకు తొలి ప్రచార సాధనం కావడం వాస్తవం. ఉన్నవ ఐర్లాండులో వుండిన మూడేళ్ల కాలంలో సోషలిస్టు గ్రంధాలను చదివే వీలుండేది. 1916లో ఐర్లాండులో ఈస్టర్ తిరుగుబాటు జరిగింది. దాని ముఖ్య నాయకుల్లో ఒకరు జేమ్సు కోనల్లీ గొప్ప మార్క్సిస్టు. అతన్ని ఉరి తీశారు (12 మే 1916). ఇతనితో గాక అమనీ డవేలరాతో ఉన్నవకు పరిచయం వుండేదంటారు. దీనికి దాఖలాలు లేవు.

**(ఉన్నవ వెలుగునీడలు వ్యాసంలో కొన్ని భాగాలు)** ■



# ఉన్నవ గురించి సివి ఏమన్నారు?

"ఇరవయ్యో శతాబ్దం ప్రారంభంలో, ఇండియాలో ప్రత్యేకంగా ఆంధ్రలో ఉనికిలో వున్న మత రాజకీయ సాంఘికార్థిక ఉద్యమాలన్నీ ఉన్నవ లక్ష్మీనారాయణ రాసిన మాలపల్లి నవలలో మనకు దర్శనమిస్తాయి. తరతరాలుగా సంఘంలోని అగ్రవర్ణాలవారి దుర్మార్గానికి, దౌర్జన్యానికి, అవమాన పరంపరలకీ బలియైన హరిజనుల భయంకర జీవిత చిత్రణయే, మన కళ్లముందు నిల్చి, మానవత్వమున్న ప్రతి వ్యక్తి గుండెల్లో ఈ నవల ఆరని మంటల్ని రేపుతుంది. హేతువాద, నాస్తికోద్యమాన్ని ప్రేమించే వారందరూ ఈ నవలను తప్పకుండా చదివి తీరాలి."

ఐర్లాండ్‌లో బారెస్టర్ డిగ్రీ తీసుకొని, ఉన్నవ లక్ష్మీనారాయణ 1916 మార్చి నెలలో స్వదేశానికి తిరిగి వొచ్చాడు. నాటి జాతీయ ఉద్యమంలో పాల్గంటూనే, సంఘ సంస్కరణ ఉద్యమాల్లో గూడా చురుకుగా పనిజేశాడు. రేపల్లెలో జరిగిన గుంటూరు జిల్లా సంఘ సంస్కరణ సభకు అధ్యక్షుడుగానూ, (1916) కొవ్వూరులో జరిగిన కృష్ణా మండలం సంఘ సంస్కరణ సభకు అధ్యక్షుడుగానూ వుండి, ఉద్యమ శీలిగా, ప్రత్యక్ష కార్యకర్తగా వుంటూ తన ఉపన్యాసాల్తో యువకుల్లో నూతన ఉద్బోధ కల్గించాడు.

కులం గబ్బుతో నిండిన హిందూ సమాజం లాంటి పరమ దుర్మార్గమైన వ్యవస్థ, ఈ భూ మండలంలో మరెక్కడా కన్పించదు. అగ్రవర్ణాల వారి అహంకారానికి తరతరాలుగా గురిచేయబడిన హరిజనులు... కాయకష్టమే ఏకైక ఆస్తిగా మిగిలి, దిక్కూమొక్కూలేని బానిసలుగా తయారయ్యారు. మానవ సహజమైన మర్యాదకు సైతం వీరు నోచుకోలేదు. దాసులైన శూద్రులకు సైతం దాసులై, దాసానుదాసులై ఈ దస్యుల సంతానం, మధ్య యుగాల్లో రాజుల రారాజుల యుద్ధాల్లో సైనికులుగా, సిరిజనుల భూముల్ని సాగుజేసే పాలేర్లుగా వ్యవసాయ కూలీలుగా మాత్రమే పనికివచ్చారు.

1920 ప్రాంతంలో ఆంధ్రదేశానికి చుక్కానిలా దోవచూపి, సాంఘిక రాజకీయ, సాహితీ సాంస్కృతిక రంగాల్లో ఆంధ్ర ప్రజలకి నాయకత్వం వహించినవి, గుంటూరు, కృష్ణా జిల్లాలే. అందునా గుంటూరు జిల్లాయే ఆనాడు అగ్రస్థానంలో వుండేది. తెనాలి తాలూకా పెదపాలెంలోని శ్రీకృష్ణాశ్రమం అనే పేరుతో హరిజన యిత్యాది అట్టడుగు ప్రజలు అభ్యుదయం కోసం వొక సాంఘిక సంస్థ పనిజేస్తుండేది. దీనికి ఉన్నవ అధ్యక్షుడుగా వుండేవాడు. 1916లో నల్లపాటి హనుమంతరావు, పుతుంబాక సీతారామయ్య ఈ ఆశ్రమాన్ని స్థాపించారు. 1918లో పంచములకు పాఠశాల పెట్టి, భోజన వసతి ఏర్పాటు జేసి, చేతిపనులు నేర్పడం ప్రారంభించారు. ఆంధ్రలో నాన్ కోపరేషన్

మూమెంట్ మొదలైన తర్వాత ఈ ఆశ్రమం చిన్న యాత్రాస్థలంలా మారింది.

ఇరవయ్యో శతాబ్దం ప్రారంభంలో, ఇండియాలో ప్రత్యేకంగా ఆంధ్రలో ఉనికిలో వున్న మత రాజకీయ సాంఘికార్థిక ఉద్యమాలన్నీ ఉన్నవ లక్ష్మీనారాయణ రాసిన మాలపల్లి నవలలో మనకు దర్శనమిస్తాయి. తరతరాలుగా సంఘంలోని అగ్రవర్ణాలవారి దుర్మార్గానికి, ప్రత్యేకంగా కమ్మ, రెడ్డి, యిత్యాది కులాల వారి దౌర్జన్యానికి, అవమాన పరంపరలకీ, బలియైన హరిజనుల భయంకర జీవిత చిత్రణయే, మన కళ్లముందు నిల్చి, మానవత్వమున్న ప్రతి వ్యక్తి గుండెల్లో ఈ నవల ఆరని మంటల్ని రేపుతుంది. హేతువాద, నాస్తికోద్యమాన్ని ప్రేమించే వారందరూ ఈ నవలను తప్పకుండా చదివి తీరాలి.

మట్టి నుంచి మణిమాణిక్యాల్ని సృష్టించే కష్టజీవులూ, ప్రత్యేకంగా సాంఘికంగా అధములుగా, అంటరానివారుగా, చూడరానివారుగా, మాటాడరానివారుగా పరిగణింపబడిన కోట్లాది హరిజనులు, స్వాతంత్ర్యోద్యమంలో పాల్గనవలసిన అవసరాన్ని సైతం ఉన్నవ ఆనాడే గుర్తించాడు. అంతే గాదు; సమసమాజ నిర్మాణం కోసం సాగే ఉద్యమంలో సైతం వీరి పాత్ర అత్యంత ఆవశ్యకమని గూడా ఆయన ఈ నవలలోనే పరోక్షంగా సూచించాడు.

## ఉన్నవతో కలిసి అన్నం తిన నిరాకరించారు

ఆనాటి సంఘ సంస్కర్తలలో నిష్కళంకమైన దేశభక్తులూ వున్నారు. నేతి బీరకాయలూ వున్నారు. ఆనాటి స్వాతంత్ర్య యోధుల్లో ఉన్నవ లక్ష్మీనారాయణ ప్రముఖుడు. గుంటూరులో ఉన్నవచే స్థాపించబడిన శారదా నికేతనంలో, ఆ రోజుల్లోనే అన్ని కులాలవారూ కలిసి, సహపంక్తి భోజనాలు చేసేవారు. అయితే నేతి బీరకాయల్లాంటి కొందరు సంఘసంస్కర్తలు, సహపంక్తి భోజనాల్నిగానీ, వర్ణాంతర వివాహాల్ని గానీ ప్రోత్సహించేవారు కాదు. కాని ఉన్నవ మాత్రం దళితులతోపాటు అన్ని కులాలవారితోనూ కలిసి భోంచేసేవాడు. అంచేత, నాటి ఆంధ్రలోని ఏ హోటలు వారూ ఆయనకి భోజనం పెట్టేవారు కాదు. (ఆరోజుల్లో బ్రాహ్మణేతరులు నిర్వహించే 'బ్రాహ్మణ భోజన హోటళ్ళు' ఇంకా ఉనికిలోకి రాలేదు.) తనను భోజనానికి ఆహ్వానించిన చోట కూడా దళితులతో సహపంక్తి భోజనం చేసిన లక్ష్మీనారాయణ పక్కన కూర్చొని భోంచేయడానికి తమకు తీవ్రమైన అభ్యంతరముందనీ అతిథులుఖండితంగా చెప్పారట.

దళితుల ఆకలిమంటల్నీ, పరమ కిరాతకమైన సాంఘిక పరాభవాలకి వారు లోను గావడాన్నీ లోతుగా అర్థం చేసుకున్న ఉన్నవ లక్ష్మీనారాయణ, వారి సమస్యల పరిష్కారానికి తనకి చేతనైనంత మేరకు చిత్తశుద్ధితో కృషి చేశాడు. సమస్త రంగాల్లో దిక్కూ మొక్కూ లేని ఈ పీడిత ప్రజల ఉద్ధరణ కోసం, పోసుకోలు గ్యాసు కబుర్లు చెప్పే ధోరణిలో గాక, వారికోసం క్రియాపరంగా పనిచేశాడు. శ్రామిక జనోద్ధరణ పట్ల అంతటి మహత్తరమైన నిబద్ధతను ఆయన ప్రదర్శించాడు గాబట్టే, వారి జీవిత సమస్యల్తో ఆయన పూర్తిగా మమేకం చెందాడుగాబట్టే, 'మాలపల్లి' లాంటి మహోజ్వలమైన నవలా సృష్టి ఉన్నవకి సాధ్యమైంది.

దేశంలో సోషలిజం వొచ్చేంతవరకూ, హరిజనుల ఆర్థిక - సాంఘిక సమస్యలు అలాగే వుంటాయని, ఉన్నవ లాంటివారు ఆనాడు నిమ్మకి నీరెత్తినట్లు గమ్మున ఊరుకోలేదు. తరతరాలుగా శ్లేష్మంలోపడ్డ పురుగుల్లా బతుకు లీడుస్తోన్న హరిజనుల్ని ప్రేమతో ఆదరించి, నిప్పులాంటి నిజాయితీతో వారిని దగ్గరకు తీసి, చదువుచెప్పి, చేతిపనులు నేర్పి, భోజన వసతి కల్పించి, వారిని కనీస మానవులుగా తీర్చిదిద్దేందుకు 'సంఘ సంస్కర్తల'నే పేరుతో నేడు పిలవబడుతోన్న ఉన్నవ లక్ష్మీనారాయణ - నల్లపాటి హనుమంతరావు, పుతుంబాక సీతారామయ్య లాంటి నాటి సాంఘిక తిరుగుబాటుదార్లు, తమ శక్తికొద్దీ కృషి చేశారు.

('ఆంధ్రాలో సాంఘిక తిరుగుబాటు ఉద్యమాలు' నుంచి)

**C. RAMALINGA REDDY,**
**M.A.(CANTAB.), M.L.C.**

Chittoor (N.A.)
10—11 1924

**Dear Ramaswami Iyer,**

**I wish to make an earnest appeal to Government to lift the ban they have imposed on Unnava Lakshmi Narayana's Telugu Novel, *The Pariahs or Nature's victory* ([illegible]). My reasons are briefly as follows:**

**(1) It is one of the very few works of undoubted genius in Telugu. You know how rare such works are in our languages. You yourselves analysed the South Indian Mind in your convocation address and have shown how it runs too much into subtle, sterile criticism. Here is an exception to that sorry rule - a genuine work of creative art & imagination.**

**(2) It is written in the colloquial or Gramya style. I myself belong to the classical variety, but two works have shown how all the effects of literature, line, colour and expression could be produced by the colloquial brush provided, of course, it is handled by a master viz.: Kanyasulkam of Appa Rao and this**

(Contd.)

**Novel of Low & Humble life, farther removed from secular glory than perhaps from the foot stool of God, by Mr. Unnava Lakshmi Narayana.**

**(3) Mr. Lakshmi Narayana belongs to the spiritual school of N. C. O. But let not his political sin be visited on his literary child. You may take it from me that this book is not likely to be a political bomb shell. Few revolutions have been produced by books & Indian Revolution has even less chance of originating from that source.**

**I read first two parts of the Novel a good while ago - say 18 months or more: and when the author asked me for my opinion, I told him that his was one of the very few books that I had made up my mind to write a lengthy review upon & that would have to wait till it was completed. I may add that the very length of this book - a defect which it, curiously enough shares with the other work mentioned above, is against its becoming very popular or widely read.**

**I earnestly appeal to you as a promoter of art & literature to get the prohibition withdrawn. Telugu Literature will thereby be put under a special obligation to Government.**

**Yours,**
**C. R. REDDY**

మాలపల్లి నవలపై నిషేధం తగదంటూ 1924లో
కట్టమంచి రామలింగారెడ్డి ప్రభుత్వానికి రాసిన లేఖ



□ నగ్నముని

# నా నాటకీకరణా .. కొన్ని జ్ఞాపకాలూ ...

**1974** మే 25 సాయంకాలం 7 గంటలకి హైదరాబాదులోని చిక్కడపల్లి ఆంధ్ర విద్యాలయం ప్రాంగణంలోని ఆరుబయలు ప్రదేశంలో ఆ విద్యాలయ భవనాన్ని ఒక రంగస్థలంగా మొత్తం 12 రంగస్థలాల్లో 'మాలపల్లి' జీవ నాటకం ప్రథమ ప్రదర్శన ప్రారంభమైంది. తరువాత కొన్ని రోజులపాటు అక్కడే ప్రతిరోజూ వరుసగా అదే సమయాన ప్రదర్శనలు కొనసాగాయి.

అంతవరకూ అక్షర రూపంలో పెను నవలగా ఉన్న 'మాలపల్లి' మొదటిసారి రంగస్థలం మీదకి నాటకమై నడిచొచ్చింది. అంతవరకూ పాఠకులుగా ఉన్నవారిని ప్రేక్షకుల్ని చేసి సంభ్రమాశ్చర్యాలలో ముంచివేసింది. ఒక రంగస్థలోత్సవం వలె కొనసాగింది. నాటి నుంచి హైదరాబాదులోనే కాకుండా రాష్ట్రంలోని అనేక కేంద్రాల్లో, చివరికి రాష్ట్రాన్ని దాటి చెన్నైలో కూడా ఇచ్చిన రెండు ప్రదర్శనలు కలుపుకుని వందకు పైగా ప్రదర్శనలు ఇవ్వడం జరిగింది.

అప్పటికే దశాబ్దాలుగా 'మాలపల్లి' మొదటి ఆధునిక, వ్యావహారిక నవలగా, ఇంకా మరెన్నో విధాలుగా చరిత్ర సృష్టించి ఉంది. ఆయా కాలాల్లో, సందర్భాల్లో చర్చోపచర్చలకు కేంద్రంగా నిలచివుంది. బహుశా అదే స్థాయిలో కాకపోయినా 'మాలపల్లి' నాటకం, బహిరంగ జీవ నాటకంగా, నవలా నాటకంగా, మెగా నాటకంగా రంగస్థల చరిత్రలోనే కొత్త చరిత్రను సృష్టించింది. ఇది నాటకంగా, ఒక అద్భుత 'ప్రదర్శనగా మాత్రమేగాక దీనిలోని ప్రయోజనకర ప్రయోగాలు, ముఖ్యంగా సాధించింది ఏమిటంటే – ఈ నవలలోని పాత్రలు, అనుసరించిన పంథాలు, సంఘటనలు, జరిగిన దుర్మార్గాలు, దౌష్ట్యాలు, వ్యూహాలు నాటకీకరించడమేగాక, తద్వారా.. శతాబ్దాలుగా అణిచివేయబడుతున్న అంటరానివాళ్ళు, యాంత్రికంగా కొనసాగుతూ వస్తున్న వారిపై జరుగుతున్న దౌర్జన్యాలు, క్రమంగా వారి నుంచి వస్తున్న ప్రతిస్పందనలు. ఈ మొత్తం సామాజిక సంఘర్షణల మూలాలపై, అసమానతలపై, భౌతిక, అభౌతిక కారణాలపై ఆలోచనాపరులు దృష్టి సారించడానికి దోహదం చేసింది. మరొక్కసారైనా మాలపల్లి నవలను చదవడానికి, విశ్వవిద్యాలయాల్లో పరిశోధనలు జరపడానికి దారి తీసింది.

'మాలపల్లి'పై నాకు అపారమైన గౌరవం ఉంది గాని, నాటకీకరించాలనే ఆలోచన ఏనాడూ చెయ్యలేదు. అది నా దృష్టిలో లేదు. ఎ.ఆర్.కృష్ణ ఓ రోజున నా వద్దకు వచ్చి – 'మాలపల్లి'ని

> "'మాలపల్లి' నాటకం, బహిరంగ జీవ నాటకంగా, నవలా నాటకంగా, మెగా నాటకంగా రంగస్థల చరిత్రలోనే కొత్త చరిత్రను సృష్టించింది. సామాజిక సంఘర్షణల మూలాలపై, అసమానతలపై, భౌతిక, అభౌతిక కారణాలపై ఆలోచనాపరులు దృష్టి సారించడానికి దోహదం చేసింది. మరొక్కసారైనా మాలపల్లి నవలను చదవడానికి, విశ్వవిద్యాలయాల్లో పరిశోధనలు జరపడానికి దారి తీసింది."

సాహిత్య అకాడెమీ ప్రచురణ
'ఉన్నవ లక్ష్మీనారాయణ గారి మాలపల్లి' పుస్తకం నుంచి ...



వెంకటదాసు పాత్రలో సినీ నటుడు నూతన ప్రసాద్
(అప్పటికి వరప్రసాద్‌గానే పరిచితం)

**గ్రామీణ జీవనమే శ్వాసగా వ్యవహార భాషలో వెలువడిన తొలి నవల. అంటరాని వారిని అట్టడుక్కి ప్రతిక్షణం తొక్కివేయబడే వారి సామాజిక, ఆర్థిక, రాజకీయ అగచాట్లను తనకు తెలిసిన పార్శ్వం నుంచి చిత్రించిన ధైర్యశాలి. ఏ బ్రాహ్మణుడూ తన తొలి నవలకు ఇటువంటి వస్తువును తీసుకోడు.**

నాటకంగా వెయ్యాలని ఉంది. మీరు నాటకంగా రాస్తే బావుంటుంది' అన్నారు. ఆ అనడంలో 'మీరు రాయాలి, మీరే తప్పక రాయాలి' అన్న ధ్వని, ఒత్తిడి ఆయన గొంతులో ఉన్నాయి. దానికి నేను వెంటనే స్పందించలేదు. ఆనందించలేదు. ఆలోచనలో పడ్డాను. చాలా పెద్ద నవల. పెద్దాయన రాసిన నవల. పలు విధాల చరిత్రాత్మకమైన నవల. అడుగుతున్నదీ ఎవరో కాదు, సామాన్యుడు కాదు, ప్రముఖ రంగస్థల ప్రయోక్త, దర్శకుడు, పద్మభూషణుడు (ఇంకా అప్పటికి ఇవ్వలేదు). మనసా వాచా కర్మణా రంగస్థలానికే అంకితమైనవారు, మృచ్ఛకటికం, కన్యాశుల్కం, ప్రతాపరుద్రీయం, కీలుబమ్మలు, వీలునామా, ఆదర్శమూర్తి, పెద్ద మనుషులు, సంరక్షకుడు, తుగ్లక్ మొదలైన నాటకాలకు ప్రాణం పోసినవారు. నూతన రీతులలో ప్రదర్శనలు ఇస్తూ, అనేకమంది నటీనటులను తయారు చేస్తూ, నాటక వ్యాప్తికి కంకణం కట్టుకున్నవారు. అటువంటివారు నన్ను ఎంచుకోవడం, రాయమని ప్రత్యేకంగా అడగడం అసాధారణమే! అయినా, వెంటనే నేను 'రాస్తాను' అనలేదు. పైగా ఏవిధంగానూ స్పందించలేదు. దానికో కారణం ఉంది. ఆ కారణమే నన్ను కాసేపు వెంటాడింది. ఎటూ చెప్పలేని పరిస్థితిలో పడేసింది. చివరికి – 'కృష్ణ గారూ, నాకో రోజు సమయం ఇవ్వండి. ఆలోచించి, రాసేదీ, లేనిదీ రేపు చెబుతాను' అన్నాను. తాను అడిగిన వెంటనే 'తప్పకుండా రాస్తాను' అని నేను అంటానని ఆయన అనుకొని ఉండవచ్చు. కొంత ఆశ్చర్యమూ, కలిసిన నిరుత్సాహంతో – 'సరే, రేపు చెప్పండి' అని వెళ్లిపోయారు. నాలోని ఆ సందేహం లేక కారణం ఆ రోజంతా వెంటాడుతూనే ఉంది. మరోసారి 'మాలపల్లి' తెరిచాను.

¤ ¤ ¤

ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు గారు న్యాయవాది (బార్ ఎట్ లా). సంస్కరణోద్యమ సాహసి. సృజనాత్మక రాజకీయ నాయకత్వం మేధావి. స్వరాజ్య సమరంలో అరెస్టులు, చెరసాలలు, శిక్షలు చిరునవ్వుతో ఎదుర్కొన్న ధీరుడు.

ఇతిహాసం నుంచి జానపదం వరకు సాహిత్యాన్ని అలవోకగా కైవసం చేసుకుని, తన పాండిత్య నేపథ్యాన్ని వ్యవహార భాషా మహోన్నతి కోసం అంకితం చేసిన నిజమైన జన సాహితీవేత్త. మాలపల్లి ఆయన కలం నుంచి జాలువారిన ఆధునిక ఇతిహాసం. గ్రామీణ జీవనమే శ్వాసగా వ్యవహార భాషలో వెలువడిన తొలి నవల. తీసుకున్న విషయం సంపన్న వర్గాల, అగ్రవర్ణాల మెప్పుకోసం కాకుండా, స్వర్ణ కుండలాల కోసం కాకుండా, పైగా తీవ్రంగా కోపం తెప్పించే అంటరాని వారిని అట్టడుక్కి ప్రతిక్షణం తొక్కివేయబడే వారి సామాజిక, ఆర్థిక, రాజకీయ అగచాట్లను తనకు తెలిసిన పార్శ్వం నుంచి చిత్రించిన ధైర్యశాలి. ఏ బ్రాహ్మణుడూ తన తొలి నవలకు ఇటువంటి వస్తువును తీసుకోడు.

'మాలపల్లి'లో ఆయన జైల్లో ఉండగా రాసిన నవల. ఆ విధంగా అది జైలు నవల. 1922లో అచ్చయింది. అంతే, 1923లో ఒకసారి, 1936లో మరోసారి రెండు సార్లు బ్రిటీష్ వారిచే నిషేధింపబడింది. నివాసం ఊరి వెలుపలకు నెట్టివేయబడి, నిమ్నజాతిగా ముద్ర వేయబడి, భూస్వాముల దురంతాలకు, తీవ్ర కష్టనష్టాలకు, ఘోరాలకు బలియైన ఒక కుటుంబాన్ని ఉదాహరణగా తీసుకుని రాసిన నవల. ముఖ్యమైన మూడు పాత్రలు : తండ్రి రామదాసు, కొడుకులు వెంకటదాసు, సంగదాసు. వారితో అనేక సంఘటనలతో నవలా కథనం కొనసాగుతుంది. ఈ మూడు పాత్రలూ మూడు పంథాలకు ప్రతీకలు.

తండ్రి రామదాసు ధర్మనిష్ఠాపరుడు. భూస్వాముల దౌర్జన్యానికి, వారి కుట్రలకు, దౌష్ట్యాలకు బలి అవుతున్న అతనూ, అతని కుటుంబ సభ్యులు. వీటన్నింటిని ధార్మిక దృష్టితో, దైవ సంకల్పంగా భావించేవాడు. నైతిక నిష్ఠను వదలనివాడు. అబద్ధాల్ని ఆశ్రయించని వాడు. చివరకు హత్యానేరం మోపబడి జైలుపాలు చేయబడతాడు. సంగదాసు ఒక భూస్వామి దగ్గర పనిచేస్తున్నా... రైతు కూలీల పక్షం వహించిన వాడు. భూస్వాములు ఇస్తున్న చాలీచాలని కూలీ గింజలతో బతకలేని పరిస్థితులను గమనిస్తున్నవాడు. కూలీలు ఒక సంఘంగా ఎక్కడికక్కడ ఏర్పడి పోరాటం చేస్తే పరిస్థితులు మెరుగు పడతాయని భావించేవాడు. భూస్వామి అతన్ని హత్య చేస్తాడు.

వెంకటదాసు ఈ దౌష్ట్యాలపై, దైవంపై, భూస్వాములపై, సమస్త దోపిడీదార్లపై యుద్ధం ప్రకటించి, అడవుల్లోకి వెళ్లి తక్కెళ్ల జగ్గడు పేరుతో ఉన్నవాళ్ల ఇళ్ళల్లో ధర్మ కన్నాలు చేస్తూ, దోచుకున్న ధనం పేదలకు పంచిపెడుతూ ఉంటాడు. చివరికి బ్రిటిష్ సైన్యానికి పట్టుబడతాడు. న్యాయాధిపతి ముందు తన లక్ష్యం వివరిస్తాడు. నవలలో, నాటకంలో ఇది చాలా ముఖ్యమైన ఘట్టం. న్యాయాధిపతి ముందు సంజాయిషీలో తక్కెళ్ల జగ్గడి భావ ప్రకటనలో ఒక హెచ్చరిక చేస్తాడు. అది ఈనాటికీ వర్తిస్తుందని చెప్పవచ్చు. 'భాగ్యవంతులు తమ వర్తనను మార్చుకోకపోతే, పేదలే చట్టాలు మార్చి ఈ లోకంలో భూతల స్వర్గం స్థాపిస్తారు' అన్నదే ఆ హెచ్చరిక.

¤ ¤ ¤

చెప్పినట్లుగానే, మర్నాడు ఎ.ఆర్.కృష్ణ గారిని కలిశాను. 'నేను తప్పకుండా రాస్తాను. అయితే, ఒక షరతు. దానికి మీరు ఒప్పుకుంటే



The 12 stage- layout of MALAPLLI (Jeeva Natakam)

మాలపల్లి నాటక ప్రదర్శన ఒక అద్భుత ప్రయోగం. 12 వేదికలపై సజీవ నాటకంగా ప్రదర్శితం అయింది. వేదికల కూర్పు పక్కన ఉన్న స్కెచ్‌లో చూడొచ్చు.

రాస్తా, లేకపోతే లేదు.' అన్నాను. దానికాయన నవ్వుతూ 'ఏమిటా షరతు, చెప్పండి' అన్నారు.

'మాలపల్లి' పెద్ద నవల. నాటకీకరణలో కూడా పెద్ద నాటకమే అవుతుంది. ఒకసారో, రెండుసార్లో ప్రదర్శనలు ఇచ్చి ఊరుకోవడం నాకిష్టం లేదు. ప్రతిరోజూ తప్పనిసరిగా ఒక ప్రదర్శన చొప్పున వంద ప్రదర్శనలు ఇస్తానంటే నేను రాస్తాను. లేకపోతే లేదు. నా దృష్టిలో ఇదో నాటకోద్యమం' అన్నాను.

దానికాయన చాలా సంతోషించారు. 'తప్పకుండా, అలాగే చేద్దాం' అన్నారు. మాలపల్లి నవల, వంద ప్రదర్శనలు, నాటకోద్యమం ఈ ఆలోచనే ఆయనలో ఉత్తేజం నింపింది. త్వరలోనే మొదలుపెట్టి, త్వరగానే రాసి ఇచ్చాను. ఆరు వందల పేజీలకు పైగానే ఉన్న నవలను మూడు గంటల నాటకంగా రాయడం, కుదించడం, సొంత పైత్యాన్ని చేర్చకుండా, మూలానికి న్యాయం చేస్తూ వెళ్లడం తాడు మీద నడకే అయింది. ఎప్పటికప్పుడు ప్రదర్శన గురించి వివరంగా సంప్రదించుకుంటూ ఉండేవాళ్లం. నా నాటకీకరణలో ఆయన ఏనాడూ జోక్యం చేసుకోకపోవడం, నేను చెప్పిన అంశాలను దృష్టిలోకి తీసుకుని దృశ్యరూపంలోకి తీసుకురావడం నాకెంతో సంతోషం కలిగించిన విషయాలు. పన్నెండు బహిరంగ రంగస్థలాలు, నలభై వరకు గంభీర కళాత్మక సన్నివేశాలు, యాభై మందికి పైగా నటీనటులు. కథనంలో తోడుగా ఒక బుర్రకథా బృందం. ఆనాడు పత్రికలు అన్న మాటలు : 'వినూత్న పోకడలతో అత్యాధునికం, – విప్లవాత్మకం, సంచలనాత్మకం, జీవనాటకం, నవరసానుభవం' వరుసగా ప్రదర్శనలు కొనసాగుతున్న రోజుల్లో, ఒకసారి గుర్తుకొచ్చి, ఎ.ఆర్. కృష్ణ నన్ను కుతూహలంగా అడిగారు : 'మొదట నేను రాయమని అడిగినప్పుడు, 'రాస్తానో, లేదో మర్నాడు చెబుతాను' అన్నారు. దానికి కారణం ఏమిటి?' అని. 'చెప్పడానికి అప్పుడు సరైన సమయం కాదు, ఇప్పుడు చెప్పొచ్చు, చెబుతాను' అంటూ మనసులోని మాట చెప్పాను.

'మాలపల్లి నవలాకర్త ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు గారు గాంధేయవాది. నేను గాంధేయవాదిని కాదు. నా నాటకీకరణ రచనలో గాంధేయవాదం విజృంభిస్తే నేను రాజీపడినవాడినవుతానేమో అనేది ఒక సందేహం. అలాగే, నాటక దర్శకుడుగా మీరు జయప్రకాష్ నారాయణ గారి సోషలిస్టు పంథాకి చెందినవారు. నేను ఆ పంథాకి చెందినవాడిని కాదు. మీకు నచ్చేట్టు రాసినా, అప్పుడు కూడా రాజీపడిన వాడినే అవుతాను, అనుకుని, కాస్త ఆలోచించుకోడానికి ఒక రోజు సమయం అడిగాను. ఆ వ్యవధిలో నవలను మరొకసారి పరిశీలించి, మాలపల్లిలోనే నాకు దగ్గరగా ఉన్న మరో మార్గాన్ని ఎంచుకున్నాను. అదే తక్కెళ్ల జగ్గడి మార్గం. అందుకే రాయడానికి ఒప్పుకున్నాను. వంద ప్రదర్శనలకు మీరు ఒప్పుకోవడం నాకు ఆనందం కలిగించిన విషయం' అన్నాను. ఆయన చాలా చాలా సంతోషించారు.

ఆ సందర్భంలోనే కొంతమంది విశ్లేషకులు – 'ఉన్నవ లక్ష్మీనారాయణ గారు రామదాసు పాత్రవైపు మొగ్గుతూ, ఆదర్శం – 'సంగ విజయం'గా భావించి నవలలోనే పేర్కొనడం జరిగింది. నాటకీకరణలో పరోక్షంగా తక్కెళ్ల జగ్గని విజయంగా, భవిష్యత్తులో అనుసరించవలసిన మార్గంగా సూచించినట్లయింది' అనడం జరిగింది. దీనితోబాటు వారు మరొక మాట కూడా అన్నారు : 'మాలపల్లి నవలా నాటకంతో తెలుగు ఆధునిక రంగస్థలం ఒక అడుగు ముందుకు వేసింది' అని.

ఆ వరవడిలోనే హైదరాబాదు ఆకాశవాణి కేంద్రం వారు నా చేత శ్రవ్య నాటకంగా రాయించడం, ప్రసారం చెయ్యడం జరిగింది. ఆ విధంగా 'మాలపల్లి' నవలను దృశ్య, శ్రవ్య నాటకాలుగా మలిచే అవకాశం నాకు కలిగింది. ఒక్కొక్క ప్రదర్శన సందర్భంగా మరిన్ని జ్ఞాపకాలున్నాయి. ఇప్పుడు చెప్పింది నాటకీకరణ గురించి, ప్రదర్శనల గురించి.



మాలపల్లి నాటకంలో ఒక సన్నివేశం



# మాలపల్లి ఒక పునరావలోకనం

ఆచార్య కె.ఆశాజ్యోతి



మాలపల్లి నవల ఎన్నో ప్రశ్నలను గుప్పించింది. అభ్యుదయ మార్గంలో సాగుతూ మరిన్ని అభ్యుదయాత్మక రచనలకు దారి చూపింది. తెలుగు నవలకు ప్రశ్నించడం నేర్పింది. 1922 కాలం నాటి సామాజిక, ఆర్థిక, రాజకీయ పరిణామాలను చిత్రించింది. ఈ నవల ద్వారా పాఠకుల మనో చైతన్యం వికసిస్తుంది. ఎన్ని తరాలు మారినా కులం విషయంలో మారని సమాజం పట్ల పాఠకులలో తెలివిడికి దారిని ఏర్పరుస్తుంది.



నేపథ్యం ...

ఏ సమాజమైనా పరిణామ క్రమంలో పరివర్తన దిశగా సాగే సందర్భంలో అంతర్యుద్ధాలను దాటుకుని, ఆధిపత్య – అణగారిన వర్గాల పోరాటాలను గమనిస్తూ, విభేదాలను రూపుమాపుకునే ప్రయత్నంలో, వైషమ్యాలను తొలగించుకుంటూ, ప్రజలను చైతన్య పరుస్తూ సాగుతుంది. ఆ క్రమ పరిణామాన్ని చరిత్ర నిక్షిప్త పరుస్తుంది. అది సాహిత్య రూపంలోనో, ఖైఫీయతులోనో, శాసనాల రూపంలోనో ప్రజా సమూహాలకు అందుతుంది. ఆ చరిత్రను గమనిస్తే అర్థమయ్యే విషయాలు అనేకం ఉంటాయి. తద్వారా ఒక గ్రహింపు వస్తుంది. ఆ గ్రహింపు వల్ల ఎన్నో విషయాలు అర్థమవుతాయి. ఏ సమాజంలో నైనా ఆధిపత్య శక్తులను ఎదుర్కొనే అంతర్గత శక్తులుంటాయి. ముఖ్యంగా భారతదేశం వంటి సమాజంలో కుల వివక్ష కుటిలమైన శక్తిగా దళితులపై దమన నీతిని, అణచివేతను సాగించే దశ ఇంకా సాగుతున్న క్రమంలో, వందేళ్ళ తరువాత కూడా మాలపల్లి ఆవశ్యకత, పునరావలోకనం చేసుకోవల్సిన స్థితిలో సమాజం ఉంది. *'ధనాకర్షణకు యెక్కువ వీలైన కృషి వాణిజ్యాదులు కొందరికిచ్చి కూలి పనులు తక్కిన వాండ్ల కియ్యడంలో యేమి న్యాయమున్నది?"* (మాలపల్లి, పుట : 167) అని ఉన్నవ ఒక పాత్రతో పలికిస్తాడు. వందేళ్ళ క్రితమున్న సమాజానికి, ఇప్పటి సమాజానికి దళితుల పట్ల ఇసుమంత మార్పు లేకపోగా, దౌర్జన్యాలూ, దాడులూ, దోపిడి కొత్త ముఖాలను సంతరించు కున్న సందర్భంలో మరొక్కసారి ఉన్నవను చదవడం, మాలపల్లిని మననం చేసుకోవడం తప్పనిసరి. ఉన్నవ సమాజాన్ని ప్రశ్నించాడు. తిరగబడమన్నాడు. సమాజ దుర్నీతిని కడిగెయ్య మన్నాడు. శ్రమకు విలువుందన్నాడు. ఆ విలువను శ్రామికులు వెల కట్టే హక్కు ఉందన్నాడు. అందుకోసం పోరాడి సాధించుకోవాలన్నాడు. సామాజిక చైతన్యంతో పాటు, ఆర్థిక చైతన్యం అవసరమని తెలిపాడు. శ్రమ ఒక వర్గానిది, సంపద మరొక వర్గానిది కావడం అన్యాయంగా భావించాడు. కేవలం వృత్తి విభజన మాత్రమే అసమానతలకు కారణం కాదనీ, వృత్తి బేధాల వల్ల కూడా అసమానతలు ఏర్పడుతున్నవని భావించాడు. *"జడమును శక్తి, శక్తిని చైతన్యమూ నడుపుతవి. ఇది ప్రపంచ ధర్మం"* (మాలపల్లి , పుట: 169) అని నమ్మినవాడు ఉన్నవ.

ఎందుకు మాలపల్లి పునరావలోకనం అని ఆలోచిస్తే – కాలం మారినా, ప్రపంచీకరణలోకి నేటి సమాజం అడుగు పెట్టినా, కుల



**ఉన్నవ తన నాటి సమాజంలో ఉన్న కుల వ్యవస్థ వికృత రూపాన్ని అక్షరీకరించాడు. అందులోని లోపాలను ఎత్తి చూపాడు. కుల వ్యవస్థ, శ్రమ దోపిడి, శ్రమ విభజన, వర్గాధిపత్యం, స్త్రీ – పురుష సంబంధాలు, అందులో ఉన్న అసంతృప్తులు, మార్క్సిస్టు భావాలు విడమరచి చూపాడు. బలమైన సంకల్పం, పటిష్టమైన రచనా శైలి, కథను సూటిగా నడిపే తీరు, ఆర్థిక వ్యవస్థ పట్ల అవగాహన, నిచ్చెన మెట్ల సమాజం తీరు తెన్నుల గ్రహింపు మాలపల్లిని వందేళ్ళ తరువాత కూడా మళ్ళీ చదవాలనిపిస్తున్నాయి.**

వ్యవస్థ క్రౌర్యం వేనవేల ముఖాలతో విశృంఖల రూపంలో పెచ్చుమీరడం గమనించవలసిన, గ్రహించవలసిన అవసరాన్ని తెలుపుతోంది. దళితులు ఇంకా పోరాటం చెయ్యవలసిన స్థితిలోనే ఉన్నారు. అమానుషమైన కుల వ్యవస్థకు పరాకాష్ఠగా అంటరానితనం నేటికీ జడలు విరబోసుకుని ఉండడం, ఆధునికత అంతటా వ్యాపించినా కులాన్ని తుద ముట్టించలేని స్థితిలో నేటికీ ఉండడం, ఒక చుండూరు, కారంచేడు, వేంపెంట, ఒక ఆలీసమ్మ ఘటన వంటివి దళితులపై సాగిన దమన నీతికి నిలువెత్తు సాక్ష్యాలు. ఉన్నవ తన నాటి సమాజంలో ఉన్న కుల వ్యవస్థ వికృత రూపాన్ని అక్షరీకరించాడు. అందులోని లోపాలను ఎత్తి చూపాడు. కుల వ్యవస్థ, శ్రమ దోపిడి, శ్రమ విభజన, వర్గాధిపత్యం, స్త్రీ – పురుష సంబంధాలు, అందులో ఉన్న అసంతృప్తులు, మార్క్సిస్టు భావాలు విడమరచి చూపాడు. బలమైన సంకల్పం, పటిష్టమైన రచనా శైలి, కథను సూటిగా నడిపే తీరు, ఆర్థిక వ్యవస్థ పట్ల అవగాహన, నిచ్చెన మెట్ల సమాజం తీరు తెన్నుల గ్రహింపు మాలపల్లిని వందేళ్ళ తరువాత కూడా మళ్ళీ చదవాలనిపిస్తున్నాయి. వందేళ్ళ క్రితం సమాజంలోని దళితుల స్థితికి, నేటి సమాజంలోని దళితుల స్థితికి తేడా లేకపోగా కులం మరింత క్రూరంగా విశ్వరూపాన్ని సంతరించుకుంది.

"కమ్యూనిస్ట్ పార్టీ అనేది తెలుగు నాట అవతరించకముందే మార్క్సిస్టు భావ ప్రేరణకు నాంది పలికిన తొలి సృజనాత్మక రచనగా మాలపల్లిని పేర్కొనవలసి వుంటుంది.... ఆనాటికి తెలుగులో యీ మాత్రపు కమ్యూనిస్టు భావాలను అంత వుద్విగ్నంగా వినిపించే వాక్యాలను ప్రభుత్వం బహుశా విని ఉండదు"

(మాలపల్లిపై నిషేధాలు, ముందుమాటలు, బంగోరె, పుట: xxviii)

"నాగరక ప్రపంచము గొడ్డు పోయినట్లుగ నిందు చిత్రింపబడినది జానపద జగత్తు. ధన విద్యా కుల సంపదలతో దులదూగువారెందరో యుండగా, నిందు వర్ణింపబడిన ప్రధాన పాత్రలు సంఘ అన్యజ వర్గమువి. పూర్వ సంప్రదాయ ధిక్కారమునకీ యుగ వాతావరణము నండజూచుకుని యింత తెగించిన నవలా ప్రథమ ప్రయత్నమిదియే"

(మాలపల్లిపై నిషేధాలు, ముందుమాటలు, బంగోరె, పుట : xiii)

రెండు తీవ్రమైన భావోద్వేగాలను సమాంతరంగా కలిగించిన నవల మాలపల్లి, రాజకీయ, సాహిత్య చైతన్యాన్ని కలిగించిన సాంఘిక నవల 'మాలపల్లి'. అప్పటి ఆంగ్లేయ ప్రభుత్వం నిషేధించిన నవల ఇది. నవలను అమోదించిన వారూ, తీవ్రంగా వ్యతిరేకించిన వారూ బలంగా ఉండడం, నవల నిషేధానికి గురి కావడానికి బిద్దపాటి వేంకట కుటుంబరావు 'ఆంధ్ర, నవలా పరిణామము' (1971)లో మాలపల్లిని పూర్వ సంప్రదాయంపై ధిక్కారంగా తెగించి రాయబడిన ప్రథమ ప్రయత్నమనే బలమైన భావజాలం అప్పటి సమాజంలో పని చేయడం వంటి అనేకానేక అంశాలు కలిసి రెండు భిన్నమైన ఉద్వేగాలను కలిగించిన నవలగా మాలపల్లిని చూడొచ్చు..

సామాజిక దురాచారంగా ప్రబలంగా ఉన్న అంటరానితనం ప్రధాన ఇతివృత్తంగా 'మాలపల్లి' నవలను 1922లో రాసిన ఉన్నవ లక్ష్మీనారాయణ సంఘసంస్కర్త, రచయిత, జాతీయోద్యమ కారుడు! వృత్తిపరంగా అడ్వొకేటు. కుల, వర్గ దృక్పథంతో మొదటి తెలుగు నవలను రాసిన అభ్యుదయవాది.

జాతీయోద్యమంలో భాగంగా పల్నాడులో అటవీ నిబంధనలకు వ్యతిరేకంగా సాగిన పుల్లరి సత్యాగ్రహంలో (1921) పాల్గొని జైలు జీవితం అనుభవించినవాడు. ఉప్పు సత్యాగ్రహం (1931), క్విట్ ఇండియా (1942) ఉద్యమాల్లో పాల్గొని జైలు జీవితం అనుభవించాడు. రష్యాలో 1917లో నడిచిన బోల్షివిక్ విప్లవం ద్వారా ప్రభావితమైన తెలుగు మేధావుల్లో ఉన్నవ ఒకడు. ప్రపంచ సాహిత్యం పట్ల అవగాహన, ప్రపంచ రాజకీయ, ఆర్థిక, సామాజిక పరిణామాల గ్రహింపు కలిగిన గాంధేయవాది. ఐరిష్ హోమ్ రూల్ ఉద్యమం నడిపిన నాయకుడు 'డీవాలేరా'తో పరిచయం కలిగించిన చైతన్యంతో ఏర్పడ్డ సామాజిక అవగాహన వల్ల దేశ స్వాతంత్ర్యం చారిత్రక అవసరంగా భావించాడు. భారతదేశ సమాజానికి కులం అనివార్యమైన వెనకబాటుతనాన్ని కలిగించిందని, అప్పటికి హరిజనులుగా పిలవబడుతున్న దళితులు స్వాతంత్ర్యోద్యమంలో భాగం వహించవల్సిన అవసరం గుర్తించి, దళితులు సమాజంలో ఇతర వర్ణాలతోనూ, వర్గాలతోనూ సమానంగా బతకవల్సిన అవసరం గ్రహించి మాలపల్లి నవలకు పురుడు పోశాడు ఉన్నవ. దేశ పరిస్థితులు, ఐరిష్ ఉద్యమం, బోల్షివిక్ ఉద్యమం, ప్రపంచ సాహిత్యం వంటి విషయాలు కలిగించిన బలమైన ఆలోచనలు వెరసి మాలపల్లి నవలగా రూపుదిద్దుకున్నాయి.

ఉన్నవ ప్లీడరు వృత్తిని మానేయలనుకున్నప్పుడు, ఆ విషయమై ప్రస్తావించగా *'నిజమే నేను ధనవంతుడిని కాదు. నాకు ఆర్థికలోపమున్నది. కాని ఏ వ్యక్తియైనను స్వలాభమును చూచుకొనుట ధర్మము కాదు. నేను ద్రవ్యము సంపాదించి నా యక్కరలు తీరునంతవరకు యీ నాన్ కో ఆపరేషన్ మూవ్‌మెంటు ఉండునా? ఈ సమయములో ఉద్యమమునకు తగిన సహాయము చేయకపోయినచో ముందు దేశమునకు అనర్థకము రాగలదు. గాన వెంటనే నా వృత్తిని నేను వదిలి ఉద్యమ ప్రచారము చేయుటకు*

నిశ్చయించుకొంటిననని" (మాలపల్లి పై నిషేధాలు, బంగోరె, పుట : 5) ఉన్నవ అన్నప్పుడు స్థిరంగా, దేశం కోసం ధర్మంగా తన బాధ్యతను నిర్వర్తించాలనుకున్నాడు.

ఉన్నవకు సమాజంలో ఉన్న కుల వ్యవస్థ పట్ల తీవ్ర వ్యతిరేకత ఉన్నది. ఒక సందర్భంలో "మాల వాండు ఇండియాలో నున్నంత వరకు పవిత్రమైన బ్రాహ్మణ వేషధారుల దగ్గరకును వారి యగ్రహార ముల లోనికిని రాగూడదని నిర్బంధించునట్టి బ్రాహ్మణోత్తములు ఆఫ్రికాలోనికి వలస బోయిన మాలమాదిగలపై ప్రేమ యుటిపడి నట్లు కపటా దరమును జూపుట యెంతయు హాస్యాస్పదముగా నుండును" **(మాలపల్లిపై నిషేధాలు, బంగోరె, పుట : 83)** సమాజంలో అసమానతలపై స్పష్టమైన ఆలోచనలు ఉన్నవలో ఉన్నాయి. అసమ వ్యవస్థలో అభివృద్ధి అసాధ్యం కనుక దళితుల అభివృద్ధి సమాజ అభివృద్ధిగా భావించాడు.

### మాలపల్లి నవల : సమకాలీన సమాజం

పుల్లరి సత్యాగ్రహంలో భాగంగా రాయవెల్లూరులో జైలు జీవితం అనుభవించిన కాలంలో 1921లో చిత్తు ప్రతిగా రాసిన నవల 'మాలపల్లి'. మొత్తం 609 పుటల చిత్తు ప్రతి. 1922లో అచ్చయింది. జాతీయోద్యమం, సహాయ నిరాకరణోద్యమం, ఆంగ్లేయ పాలన పట్ల విముఖత వంటి విషయాలతో పాటు తీవ్రమైన దేశభక్తి, నాటి సామాజిక పరిస్థితులు, ఉత్తుంగ తరంగంలా ఎగసి పడుతున్న జాతీయోద్యమ స్ఫూర్తి, ఆధునికత – సాంప్రదాయికతల మధ్య ఊగిసలాట, ఆంధ్ర దేశంలో బలంగా వీస్తున్న బెంగాలీ సాహిత్య చైతన్యపు గాలులు ఒక పక్క బలమైన జాతీయతా భావనను స్ఫూర్తి వంతం చేస్తుంటే, డబ్లిన్ విశ్వవిద్యాలయంలో బారిస్టర్ చదువుతూ, ఐరిష్ హోమ్‌రూల్ ఉద్యమం చూసిన వ్యక్తిగా, న్యాయవాద వృత్తి వదిలి అతివాదిగా కనబడినా, గాంధేయవాదిగా మారినా, మత ప్రాతిపదికపై సాగుతున్న ఖిలాఫత్ ఉద్యమాన్ని నిర్ద్వంద్వంగా విమర్శిం చిన మానవతావాది ఉన్నవ.

ఉన్నవ తన చుట్టూ ఉన్న సమాజాన్ని లోతుగా దర్శించాడు. సమాజంలో హరిజనులుగా ఉన్న మాలమాదిగలు వివక్షకు గురవుతుండడం, వారు లేకుండా సమాజంలో చాలా పనులు సాగకపోవడం, ఐనప్పటికీ వారికి గుర్తింపు, గౌరవం లేకపోగా హీనులుగా అవమానాలు ఎదురుకోవడం సమాజ గతికి పెను పెట్టుగా ఉన్నవ భావించాడు. దాని ఫలితమే మాలపల్లి. కులవ్యవస్థ వల్ల సమాజంలో ఏర్పడిన సామాజిక, ఆర్థిక అసమానతలను మాలపల్లిలో అక్షరీకరించాడు ఉన్నవ.

### మాలపల్లి నవల : ఇతివృత్తం

మాల కులానికి చెందిన రామదాసు కుటుంబం చుట్టూ ఈ కథ సాగుతుంది. రామదాసు భార్య మహాలక్ష్మి. కొడుకులు వెంకటదాసు, సంగదాసు. కూతురు జ్యోతి. చౌదరయ్యనే మోతుబరి వద్ద సంగదాసు పాలేరుగా చేస్తుంటాడు. చౌదరయ్య 800 ఎకరాల ఆసామి. అతడి కొడుకులు రామానాయుడు, వెంకటనాయుడు. సంగదాసు, రామానాయుడు అభ్యుదయ భావాలు కల స్నేహితులు. రామదాసు కొడుకులిద్దరూ సంస్కరణ భావాలున్న వారే. దళితుల్లో చైతన్యం కోసం బడులు తెరవడం, దళితులను సంఘటితపరచడం వంటి కార్యక్రమాలు చేస్తుంటారు.

సంగదాసుకు ఈ విషయంలో రామానాయుడు ఆర్థిక సహాయం

**1922 నాటికి ఉన్నవ ఒక సాహసమే చేశాడు. ప్రవాహానికి ఎదురీదాడు. మాలపల్లిలో వాడుక భాషతో కథను రమణీయంగా నడిపాడు. నవలలోని ప్రబోధాత్మక గేయాలు చైతన్య స్ఫోరకాలు. శ్రామిక సమస్యలను లోతుగా చర్చించాయి.**

చేస్తుంటాడు. ఇది చౌదరయ్యలో అసహనానికి దారి తీస్తుంది. ఒక సందర్భంలో చౌదరయ్య కొట్టడంతో సంగదాసు మరణిస్తాడు. చౌదరయ్య పోలీసులకు లంచమిచ్చి విచారణ నుండి తప్పించు కుంటాడు. రామదాసు దంపతులు నష్టపరిహారాన్ని వ్యతిరేకిస్తారు. విషాదాన్ని దిగమింగుకుంటారు. స్నేహితుడి మరణంతో రామా నాయుడు దళితులకు మరింత దగ్గరై, వారి అభివృద్ధికి మరింత కృషి చేస్తాడు. సంగదాసు గుర్తుగా 'సంగపీఠం' నెలకొల్పబడుతుంది.

సంగడి మరణానికి కృద్ధుడైన అన్న వెంకటదాసు 'తక్కెళ్ళ జగ్గడి'గా మారి అడవుల్లో చేరి 'ధర్మ కన్నాలు' వేస్తూ ధనవంతులను కొల్లగొట్టి పేదలకు పంచుతాడు. 'సంతానుల'బడే రహస్య దళాన్ని ఏర్పాటు చేస్తాడు. పోలీసులతో జరిగిన ఘర్షణలో జైలు పాలవుతాడు. ఒక వ్యాజ్యంలో ఓడిన రామదాసు తన ఆస్తిని చౌదరయ్యకు ఇచ్చి ఒక ధనవంతుడి ఇంటిలో పనికి కుదురుతాడు. తక్కెళ్ళ జగ్గడి అనుచరులు ఆ ధనవంతుడి ఇంటిని కొల్లగొట్టటంతో అందులో రామదాసు పాత్ర ఉందని నమ్మిన పోలీసులు రామదాసును, అతడి భార్యను నిర్బంధ కూలీలుగా చేస్తారు. సెంట్రల్ జైల్లో ఉన్న పెద్ద కొడుకు వెంకటదాసు అనారోగ్యం పాలవ్వడంతో తల్లీ తండ్రి పరిచర్యల నిమిత్తం ఏర్పాటు చేయబడతారు. వెంకటదాసు మరణిస్తాడు. వీరి కుతురూ మరణిస్తుంది.

పిల్లల మరణంతో భార్య మహాలక్ష్మి వేదనతో మరణిస్తుంది. అన్నిటినీ రామదాసు మౌనంగా భరిస్తాడు. సంగపీఠం క్రమేణా అభివృద్ధి చెందుతుంది. సహాయ నిరాకరణోద్యమం, సంఘ సంస్కరణోద్యమం, జాతీయోద్యమం, ధర్మ కన్నాల వంటి చర్యల ఫలితంగా దేశానికి స్వాతంత్ర్యం లభిస్తుంది. రామదాసు జైలు నుండి విడుదల కావడం, రామానాయుడు తన ఆస్తిని దళితులకు పంచడం, రామదాసు అన్నీ వదిలి అడవికి వెళ్ళిపోవడం వంటి సన్నివేశాలతో, సంఘటనలతో నవల సాగుతుంది. భూస్వాముల ఆధిపత్యం తొలగడం, తమ సర్వస్వాన్ని దళితులకు సమర్పించి, గ్రామాభ్యుదయానికై కృషి చేసేందుకు భూస్వాములు సిద్ధపడడంతో నవల ముగుస్తుంది.

నవలలో సమకాలీన సమాజంలో ఉన్న పరిస్థితులు, ఆలోచనా ధోరణులు, అభ్యుదయ భావజాలం, మార్క్సిస్టు భావాలు, స్వాతంత్ర్యాభిలాష, అన్నిటికీ మించి అట్టడుగు వర్గమైన దళితుల పట్ల వివక్ష వెరసి మాలపల్లిగా రూపుదిద్దుకుంది. వర్గాధిపత్య అహంకారాలను ప్రశ్నించింది. 1922 నాటికి ఉన్నవ ఒక సాహసమే చేశాడు. ప్రవాహానికి ఎదురీదాడు. మాలపల్లిలో వాడుక భాషతో కథను రమణీయంగా నడిపాడు. నవలలోని ప్రబోధాత్మక గేయాలు చైతన్య స్ఫోరకాలు. శ్రామిక సమస్యలను లోతుగా చర్చించాయి.

**బృహత్తర సంకల్పం కలిగిన మాలపల్లి నవలలోని సమకాలీనత, వందేళ్ళకు కూడా నిలబడడం ఉదాత్తంగా మలచిన ఉన్నవ అక్షర శక్తికున్న దృఢత్వమే తప్ప మరొకటి కాదు. ఎన్ని పుర్ముద్రణలతోనైనా కాలాలకతీతంగా నిలబడే నవల 'మాలపల్లి'.**

"కూలికి విలువగలదని మీరు గుట్టు తెలుసుకోండి
కూలికి విలువ పుచ్చుకునే కూలికి మరి పొండి" అంటూ శ్రమ విలువను ప్రస్తావించిన నవల మాలపల్లి, కూలికి విలువ కట్టడం శ్రామికుల హక్కని తెలిపాడు. మాలపల్లిలో ఒక సందర్భంలో "తక్కిన వృత్తుల్లో నేత ముఖ్యమైనది. దీనిలో ధనాకర్షణ ఉన్నది. వ్యవసాయంతో పాటు నిరంతరం జరగవలసినదీనీ. యిది మాలలకూ, నాలుగవ జాతిలో మిగత తరగతులకూ యేర్పాటు చేశారు. చర్మకార వృత్తి మాదిగలకియ్యబడ్డది. వొకటవ తరగతి వారికి ధనాకర్షణకై వృత్తి యేర్పాటు చేయలేదు. సంఘమే వీరిని పోషించవలసిందన్నారు" (మాలపల్లి పుట: 166) అని సంగదాసుతో పలికిస్తాడు ఉన్నవ. వర్ణ వ్యవస్థ పట్ల లోతైన అవగాహన ఉన్నవాడు ఉన్నవ. శ్రమ ఒకడిదైతే, సంపద ఒకడిది కావడాన్ని వ్యతిరేకించాడు.

## ముగింపు

సంఘ సంస్కరణవాదిగా, మానవతావాదిగా ఉన్నవ లక్ష్మీనారాయణ గాంధీ రాజకీయ రంగ ప్రవేశం నాటి సామాజిక స్థితిగతుల పరిశీలనలో భాగంగా సమాజంలో హరిజనుల (దళితుల) హీన స్థితిగతులను చూసి లోతైన ఆలోచనాత్మక విశ్లేషణలో భాగంగానే మాలపల్లి రూపు దిద్దుకుంది. సమ సమాజానికి ఆర్థిక సమానత్వం తప్పనిసరిగా ఉండాలనుకున్నాడు. ఒక దళిత కుటుంబాన్ని కథకు మూలంగా స్వీకరించి, మాల కులస్థుణ్ణి ప్రధాన పాత్రగా చేసి 1922 నాటికి స్ఫూర్తివంతంగా రాయబడ్డ తొలి నవల 'మాలపల్లి'. ఈ నవలా రచన తెలుగు సాహిత్యాన్ని కొత్త పుంతలను తొక్కించింది. మాలపల్లి నవల ఎన్నో ప్రశ్నలను గుప్పించింది. అభ్యుదయ మార్గంలో సాగుతూ మాలపల్లి భవిష్యత్తులో మరిన్ని అభ్యుదయాత్మక రచనలకు దారి చూపింది. తెలుగు నవలకు ప్రశ్నించడం నేర్పింది. 1922 కాలం నాటి సామాజిక, ఆర్థిక, రాజకీయ పరిణామాలను చిత్రించింది. ఈ నవల ద్వారా పాఠకుల మనో చైతన్యం వికసిస్తుంది. ఎన్ని తరాలు మారినా కులం విషయంలో మారని సమాజం పట్ల పాఠకులలో తెలివిడికి దారిని ఏర్పరుస్తుంది. మాలపల్లి నవల పునర్ముద్రితమవుతూ ఉండడానికి అందులో రచయిత చూపించిన మానవీయ విలువలు, ఉదాత్త భావాలు, రచయితకున్న కళాత్మక దృష్టి, సులభంగా గ్రాహ్యమయ్యే కథనశైలి, బృహత్తరమైన నవల ఐనప్పటికీ పాఠకులను కట్టిపడేసే సారవంతమైన రచనా శైలి, పటిష్టంగా సాగిన పాత్ర చిత్రణ, ప్రతి పాత్రకూ ఉన్న విలువ వంటి ఎన్నో అంశాలు 'మాలపల్లి'ని వందేళ్ళకు కూడా సజీవంగా నిలిపాయి. తెలుగు సాహిత్యం మాలపల్లికి ముందు, మాలపల్లి తరువాత అన్న విచక్షణను కలిగించిన నవల. బృహత్తర సంకల్పం కలిగిన మాలపల్లి నవలలోని సమకాలీనత, వందేళ్ళకు కూడా నిలబడడం ఉదాత్తంగా మలచిన ఉన్నవ అక్షర శక్తికున్న దృఢత్వమే తప్ప మరొకటి కాదు. ఎన్ని పుర్ముద్రణలతోనైనా కాలాలకతీతంగా నిలబడే నవల 'మాలపల్లి'.

# గోలీల మర్రి

ప్రకృతిచ్చిన చలువ పందిరి
మా వేసవి కాశ్మీరం
నీటి పక్షులు నీటితావు జేరినట్టు
వాడ వాడ పిల్లలంత దాని కిందికే!
పైన పక్షుల కిసర బీసర
కింద మా అల్లరల్లరి
కయ్యం బెట్టుకున్నా
కలుసుకున్న దాని కిందనే!

బడెగ్గొట్టి
ఊడల్ని ఊయ్యాల జేసి ఊగుతుంటే
అవ్వ ఒడిని తలపించేది
గుంపులు గుంపులుగా...
గుంపు గుంపుకో ఆట
గోలీల లక్కు... పైసల లక్కు
పిల్లి గీతలు... కట్టిసురుడు
ఎక్కుడు కిరీలు... ఉప్పు దెచ్చుడు
ముక్కు గిల్లుడు... రొట్టెపెంక
కండ్లకు గంతలు... గద్దచ్చె కోడి పిల్ల
అన్ని ఆటల కన్న...
గోలీలాటదే పెద్ద భాగం!

పిల్లలందరికీ తల్లి చెట్టు
పేరును సార్థకం చేసుకున్న వటవృక్షం

జేబు నిండా గోలీలు గల్లర గల్లర అంటుంటే
గెలుపు గర్వపు ఆనందం అలవి గానిది
పోగొట్టుకున్నప్పుడు
రేపు మనదనే ధైర్యంతో శాంతపడడం

రకరకాల పక్షులకు ఆవాసం
ఊర పశురాలకు కొట్టం
అదొక జీవవైవిధ్య జాతీయ పార్కు

తిరుపతి గుళ్ళో ...
మేలుకొలుపు పవళింపు పాటలెక్క
ఆ పక్షి సంరక్షణ కేంద్రం
ఉదయ సంధ్యా రాగాలు వినిపించేది!
రాలినాకు గాలికెగిరినట్టు
రాజకీయ పెనుగాలికి
ఇప్పుడదొక... స్మృతి చిహ్నం!

– దామరకుంట శంకరయ్య
94408 76788



# న్యాయమే ఆయుధమైన చరిత్ర

కొప్పర్తి వెంకట రమణమూర్తి



స్వాతంత్ర్యోద్యమ కాలం నేపథ్యంగా వచ్చిన ఈ నవల ప్రధానంగా సామాజిక సంస్కరణను గాంధేయ దృక్పథంతో, శ్రామిక చైతన్యాన్ని ప్రగతిశీల దృక్పథంతో చర్చించింది. మాలపల్లిలో గాంధీ భావనలను గుర్తించడం కొత్త కాకపోవచ్చు, కానీ మనం సాధించుకోలేకపోయిన కులరహిత సమాజ ఆదర్శాన్ని అందులో దర్శించవచ్చు. మాలపల్లి అధ్యయనం అంటే చేజార్చుకున్న లక్ష్యాలను తడుముకోవడం, పొదువుకోవడం.



మాలపల్లి నవలకు ఇప్పుడు వందేళ్లు. ఆదర్శవంతమైన తన కాలపు నడుస్తున్న చరిత్రను అంతే ఆదర్శప్రాయంగా నవలలో చిత్రించాడు రచయిత ఉన్నవ లక్ష్మీనారాయణ. పల్నాడు పుల్లరి సత్యాగ్రహంలో పాల్గొని నిర్బంధానికి గురైన రచయిత రాయవెల్లూరు జైల్లో చేసిన రచన ఇది. 1921 – 22 మధ్య రాయబడిన ఈ నవలలోని ఇతివృత్త కాలం కూడా దాదాపు అదే. స్వాతంత్ర్యోద్యమ కాలం నేపథ్యంగా వచ్చిన ఈ నవల ప్రధానంగా సామాజిక సంస్కరణను గాంధేయ దృక్పథంతో, శ్రామిక చైతన్యాన్ని ప్రగతిశీల దృక్పథంతో చర్చించింది. మాలపల్లిలో గాంధీ భావనలను గుర్తించడం కొత్త కాకపోవచ్చు, కానీ మనం సాధించుకోలేకపోయిన కులరహిత సమాజ ఆదర్శాన్ని అందులో దర్శించవచ్చు. మాలపల్లి అధ్యయనం అంటే చేజార్చుకున్న లక్ష్యాలను తడుముకోవడం, పొదుముకోవడం.

మంగళాపురం గ్రామంలో రామదాసు అనే మాలదాసరి కుటుంబం అక్కడి భూస్వామి చౌదరయ్య చూపిన కుల వివక్షకూ, చేసిన ఆర్థిక దోపిడికి గురై ఎదుర్కొన్న ఆటుపోట్లు నవల ప్రధాన ఇతివృత్తం. సజ్జనుడు, విష్ణు భక్తుడైన రామదాసుకు కొంత పాడి పంట ఉంది. భార్య మాలక్ష్మి. వెంకటదాసు, సంగదాసు, రంగ దాసు కొడుకులు. జ్యోతి కూతురు. అప్పాదాసు మేనల్లుడు. భూస్వామి చౌదరయ్య ఇద్దరు కొడుకుల్లో అన్న కొడుకు వెంకటయ్య కాగా, సొంత కొడుకు రామానాయుడు.

రామదాసు రెండవ కొడుకు సంగదాసు కథానాయకుడు. వాడలో పాఠశాల ఏర్పరిచి, దుర్వ్యసనాలను మానిపించడం ప్రారంభించాడు. పంచమోద్యమం పట్ల సంస్కరణ దృక్పథం ఉన్నవాడు. కూలీల శ్రమకు న్యాయబద్ధమైన ప్రతిఫలం లభించాలనే ప్రగతిశీలి. చౌదరయ్య పాలేరుగా అతని కొట్టంలోనే నివాసం ఉండే రంగదాసు చౌదరయ్య వ్యవసాయానికి ఏరువాక. సమవయస్కుడైన చౌదరయ్య కొడుకు రామానాయుడుకు సంగదు ప్రాణ స్నేహితుడూ, మార్గదర్శి. కూలి రేటు పెంచడం కోసం కూలీలకు మద్దతు ప్రకటించినందుకూ, తన కొడుకు రామానాయుడుతో కలసి భోజనం చేసి అతన్ని ఆదిమాంధ్ర సభకు తీసుకెళ్లినందుకూ ఆగ్రహించిన చౌదరయ్య సంగదాసు నెత్తి మీద రాగోలతో మోదితే అతను ఆఖరున మనం గెలుస్తాం అంటూ సహచరుల మధ్య తల్లిదండ్రుల చేతుల్లో ప్రాణాలు విడిచాడు.

ప్రతీకారం కోరని రామదాసు శరీరం నేలబడ్డచోటనే సమాధి కడితే చాలునన్నాడు. అదే జరిగింది. ఈ హత్య కేసు నుంచి తప్పించుకోవడానికి డబ్బులు ఖర్చుపెట్టిన చౌదరయ్య వాటిని రాబట్టుకునే పంతంతో రామదాసు పొలాన్ని మోసం చేసి కాజేశాడు. ఈ దుర్మార్గానికి చలించిన రామదాసు పెద్ద కొడుకు వెంకటదాసు తండ్రితో సైద్ధాంతికంగా విభేదించి ఇల్లు విడిచాడు. తక్కెళ్ల జగ్గడనే బంది పోటు ముఠాలు ధర్మకన్నాల పేరిట ధనవంతుల ఇళ్లకు కన్నాలు వేసి, దోచి పేదసాదలకు పంచి పెడతారు. తక్కెళ్ల జగ్గడి చర్యల మీద ప్రజల్లో సానుకూలత పెరిగింది. చౌదరయ్య మరణంతో బంధనాలు తెంచుకున్న కొడుకులు వెంకటయ్య పంచమోద్యమానికీ, రామానాయుడు కార్మికోద్యమానికీ మద్దతు ప్రకటించారు.

జీవనాధారం కోల్పోయిన రామదాసు కుటుంబం చోరీలకు సహకరిస్తున్నదనే నెపం పెట్టి బ్రిటీష్ ప్రభుత్వం నేరస్థ కులాలను నిర్బంధించి ఉంచే సెటిల్ మెంట్‌కు తరలించింది. సెటిల్‌మెంట్‌లో ఉన్నవారిని క్రైస్తవ ప్రార్థనలకు వెళ్లనివ్వకుండా చెయ్యడమే కాక తను, తన కుటుంబమూ క్రైస్తవం స్వీకరించడానికి అంగీకరించక పోవడంతో సెటిల్‌మెంట్ నుంచి తప్పించుకునే ప్రయత్నం చేశారనే దొంగ కేసు పెట్టి రామదాసుతోబాటు, మాలక్ష్మినీ జైలుకు తరలించారు. జైలులో అనుభవాలు రామదాసును స్థితప్రజ్ఞుణ్ణి చేశాయి. సెటిల్‌మెంట్‌లో రామదాసు కూతురు జ్యోతి తనను బలాత్కరించబోయిన పౌలు అనే భారతీయ అధికారి నుంచి తప్పించుకునే క్రమంలో జల ప్రవేశం చేస్తే, ఆమెను శృంగారాతీతంగా ప్రేమించిన బావ అప్పాదాసు ఆమెతో సహగమనం చేశాడు.

కాలూ చెయ్యీ కోల్పోయిన మొండి దేహంతో జగ్గడిని న్యాయ మూర్తి ముందుకు తెచ్చినపుడు వెంకటదాసే జగ్గడని తెలిసింది. అదే జైలుకు తరలించబడిన వెంకటదాసును చూచి దు:ఖంతో మాలక్ష్మి మరణించింది. వెంకటదాసు కూడా మృత్యువునే అనుసరించాడు. ఒంటరిగా మిగిలిన రామదాసు స్వరాజ్యం సిద్ధించటంతో విడుదల అయ్యాడు. మంగళాపురంలో దిగువ జాతులకోసం విజయ కళాశాల స్థాపితం అయింది. స్వరాజ్య సాధనతో అణగారిన జాతుల ఉద్ధరణ ప్రారంభమైంది.

వెంకటయ్య, రామానాయుడు తమ ఆస్తులను ఉద్యమాలకు ధార పోశారు. రామదాసు కళాశాలలో రాట్నం వడికి ఉదరపోషణ చేసుకుంటూ క్రమంగా సమీప కొండపైకి చేరి ధ్యానమగ్నుడై కొన్నాళ్లకు కనబడకుండా పోయాడు. సిద్ధుడై పరబ్రహ్మంలో ఐక్యమయ్యాడని జనం చెప్పుకున్నారు. జాతి ఆధిక్యతాహంకారం వల్ల సవర్ణులు భగవంతుడికి దూరమౌతున్నారనీ, అది లేని కడజాతివారు ముక్తికి సమీపంలో ఉంటారనీ, అనహంకారులైనందు వల్ల వారు నిత్యులని పిలువబడతారని వారితో సఖ్యత ఉభయులకూ లాభదాయకమేననే రచయిత పలుకులతో నవల ముగిసింది.

స్వాతంత్ర్యోద్యమంలో గాంధీ యుగంగా పరిగణించే 1920-47 మధ్యకాలపు ప్రారంభదశలో జరిగిన ఈ కథాంశాన్ని తనకున్న స్పష్టమైన గాంధేయ అవగాహనతో ప్రతిభావంతంగా చిత్రించాడు రచయిత. సమకాలీన పరిస్థితుల పట్ల రచయిత తెలివిడి మనల్ని

**మాలల్లో బ్రాహ్మలుగా పరిగణించబడిన దాసరి కుటుంబాన్ని కేంద్రబిందువుగా ఎంచుకోవడంలోనే రచయిత తీవ్ర వివక్ష జోలికి వెళ్లడం లేదని అర్థమౌతుంది. రామదాసు కుటుంబానికి భాగవతాది గ్రంథాలను చదివి అర్థం చేసుకోగల సంస్కృత పరిజ్ఞానం ఉంది. వాళ్లది శాకాహార కుటుంబం. ఇటువంటి కుటుంబాన్ని తీసుకోవడంతో పాటు కుల వివక్షను బలంగా చిత్రించకపోవడంతో రచయిత సమస్య తీవ్రతను తగ్గించాడా అనిపిస్తుంది.**

ఆశ్చర్యపరుస్తుంది. నవలకు పెట్టిన పేరు మాలపల్లి కానీ మాలపల్లీయుల పట్ల అగ్రకుల వివక్షనూ అహంకారాన్నీ వారి వెనుకబాటు తనాన్నీ సాత్వికంగా చిత్రిస్తుందీ నవల. మాలల్లో బ్రాహ్మలుగా పరిగణించబడిన దాసరి కుటుంబాన్ని కేంద్రబిందువుగా ఎంచుకోవడంలోనే రచయిత తీవ్ర వివక్ష జోలికి వెళ్లడం లేదని అర్థమౌతుంది. రామదాసు కుటుంబానికి భాగవతాది గ్రంథాలను చదివి అర్థం చేసుకోగల సంస్కృత పరిజ్ఞానం ఉంది. తాత్విక చింతన ఉంది. శౌచ్యం ఉంది. వాళ్లది శాకాహార కుటుంబం. ఇటువంటి పరిణతి చెందిన కుటుంబాన్ని తీసుకోవడంతో పాటు కుల వివక్షను బలంగా చిత్రించకపోవడంతో రచయిత సమస్య తీవ్రతను తగ్గించాడా అనిపిస్తుంది. కానీ కుల అంతరాలను, ఆర్థిక దోపిడిని, ప్రభుత్వ అణచివేతను ఎదుర్కోవడానికి కావలసిన సాత్విక ప్రతిఘటనకు రామదాసు వంటి భాగవతోత్తముడి అవసరం ఉందని రచయిత భావించినట్టు గుర్తించాలి.

ఆముక్తమాల్యదలోని మాల దాసరే నాలుగు వందల ఏళ్ల తర్వాత రామదాసుగా పరిణామం చెందినట్టు భావించడంలో ఆశ్చర్యం లేదు. అక్కడ విష్ణుభక్తుడైన మాలదాసరి, దుష్కర్మల వల్ల బ్రహ్మ రాక్షసుడి రూపమెత్తిన సోమశర్మను తరింపజేసినట్టు ఇక్కడ రామదాసు ఆత్మఔన్నత్యంతో అగ్ర వర్ణాలను ప్రతిఘటించడం చూడవచ్చు. సంగడి ప్రాణానికి ప్రతిగా చౌదరయ్య ప్రాణాన్ని బలి కోరకుండా శరీరం నేలబడ్డచోటే సమాధి కట్టించడంలో చౌదరయ్య చర్యను ఒక శాశ్వత జ్ఞాపకంగా మలచడం ఉంది. అక్కడ ఇంత దీపారాధన చేసుకుంటానన్న రామదాసు మాటల్లో దాన్నొక నిరంతర జ్వలనంగా మార్చడం ఉంది. నిజానికి సంగడు మరణించి చౌదరయ్య జీవించినట్టు కనిపిస్తుంది. కానీ రామదాసు చర్యతో సంగడు పునరుత్థానం చెంది చౌదరయ్య ఆత్మిక మరణం పొందు తాడు. గాంధీ సాత్విక ప్రతిఘటన సారం ఇదే. అరవై ఏళ్ల తర్వాత ఆ గుంటూరు జిల్లాలోనే చుండూరులో అదే దృశ్యం భౌతికంగా ఆవిష్కృతం కావడం రచయిత దార్శనికతకు ఒక రుజువు.

రామదాసు జరుగుతున్న పరిణామాలను విధాయకంగా స్వీకరిస్తాడే తప్ప ఆధిపత్యానికి లొంగి పోడు. ధర్మంతో పెనవేసుకున్న విశ్వాసం నుంచి విడిపోడు. మతం మార్చుకోడు. తన మీద నేరం మోపబడినపుడు జామీను కోరకపోవడంలో, జైలు జీవితాన్ని ఆత్మోపలబ్ధికి ఉపయోగించుకోవడంలో గాంధీ మార్గమే కనపడుతుంది. అక్కడ రామదాసు పీతితట్టల నెత్తడం దక్షిణాఫ్రికాలో

**అన్యాయం వైపు నిలబడి ఉన్నవాళ్లకు ఆత్మశక్తి లోపించి ఉంటుంది కాబట్టి ఆయుధమో, ఆగ్రహమో అవసరమౌతుంది. కానీ న్యాయం వైపు నిలబడి ఉన్న వాళ్లకు న్యాయమే ఆయుధమై వేరే ఆయుధం అవసరం ఉండదు. న్యాయం వైపున ఉన్నవాళ్లు కూడా ఆయుధమే చేపడితే యుద్ధం నిరంతరం సాగుతుంది. మాలపల్లి చిత్రించింది న్యాయమే ఆయుధమైన చరిత్ర.**



గాంధీ పాయిఖానాలు శుభ్రపరచడాన్ని గుర్తుకుతెస్తుంది. ఈ అనుభవం రామదాసులో అసహ్యం అనే భావననే తొలగించి అంతా రామమయం చేస్తుంది. రామదాసులో వ్యక్తిగత వికాసం కొనసాగి జైలు జీవితాన్ని వానప్రస్థంగా భావించడం, తనకు మాలల్లో లభించిన ఉన్నత శ్రేణిని చూచి తన వారే తనను దూరం చేస్తున్నారని గుర్తించి తనను తాను declassify చేసుకోవడం వంటివి రచయిత ఉన్నవలో మూర్తీభవించిన గాంధేయ భావజాల ప్రతిఫలనాలే.

మాలపల్లి నవల మరోపేరు సంగవిజయం. దేశానికి 1922లోనే స్వరాజ్యం సిద్ధించినట్లు రచయిత ఊహించడంతో సంగడు కోరిన సామాజిక సంస్కరణలకూ ఆర్థిక ప్రగతికి అంకురార్పణ జరిగి పంచమ, కార్మికోద్యమాలు గెలుపుబాట పట్టినట్లు రచన జరిగింది. కడజాతి అజ్ఞానాన్ని పోగొట్టడానికి; అవిద్య, దరిద్రాన్ని పోగొట్టడానికి వృత్తులు కావాలని అభిలషించిన సంగడు తన వారిలో వ్యసనాలను వదలి వేయగలిగే వ్యక్తి వికాసాన్ని కూడా కోరు కున్నాడు. రామానాయుడ్ని పంచముల సభకు తీసుకు వెళ్లడంలో, కూలి రేట్లు పెంపు కోసం కూలీలను సంఘటితం చెయ్యడంలో సంగడిలో గాంధీ, మార్క్సుల సమ్మేళనం కనిపిస్తుంది. ఈ రెండు పరిణామాల్లో సంగడి హత్యను ఏది ఎక్కువ ప్రేరేపించిందో చెప్పడానికి వీలులేనట్లుగా రాయడంలో సంగడిలో కుల, ఆర్థిక సమస్యలు రెండింటికీ సమానమైన చోటు నిచ్చినట్లయ్యింది. నవల చివర చౌదరయ్య కొడుకులిద్దరూ ఈ సమస్యల నిర్మూలన కార్యక్రమంలో చెరోవైపు భాగస్వాములు కావడంతో సంగడిలో ప్రతిఫలించిన రచయిత ఆదర్శం నెరవేరుతుంది.

ఆదిమాంధ్రుల సభకు హాజరైనవారిలో సంగదాసులో గాంధీతత్వం ప్రతిఫలిస్తే– సభకు అధ్యక్షత వహించిన వెంకటరెడ్డిలో అంబేద్కర్ ఆలోచనలను కనుగొనవచ్చు. అక్కడ రామానాయుడు తమ కులాలు దిగువ కులాలకు చేసిన అపకారానికి తామిప్పుడు పాప పరిహారానికి ప్రయత్నపడుతున్నట్టు చెప్పిన సందర్భంలో చిన్న చర్చ జరుగుతుంది. సంగదాసు పైకులాలు బుద్ధిపూర్వకంగా అపకారం చెయ్య లేదుగానీ ఉపేక్ష మాత్రం జరిగిందని, దాని ఫలం అన్ని జాతులమూ అనుభవిస్తున్నామనీ అని అంటే వెంకటరెడ్డి పైకులాలు అపకారాన్ని బుద్ధిపూర్వకం గానే చేశారనీ, చేస్తున్నారనీ అభిప్రాయ పడతాడు. నష్టం అన్ని జాతులూ అనుభవిస్తున్నాయనే సంగదాసు ఆలోచన కడ జాతులను దూరం పెట్టిన అగ్రకులాలు కడజాతుల నుంచి అంతే దూరమై నష్టపోయాయన్న ఉత్కృష్టతను సంతరించుకుంది. అపకారం బుద్ధిపూర్వకంగా జరిగిందనే భావన **vindictiveness**కు దారితీస్తుందని సంగదాసు గుర్తించినట్టు అర్థమౌతుంది. ఈ మొత్తం ఆలోచనతో పాటు సభకు రామచంద్ర చౌదరి, సోమయాజులు వంటి అగ్రవర్ణస్థులు హాజరు కావడం కులరహిత సమాజం కోసం జరిగే మార్పు మూలం నుంచి జరగాలనే గాంధియన్ ఆలోచనలను ప్రతిబింబిస్తుంది.

కులవ్యవస్థకు వ్యతిరేకంగా జరుగుతున్న ఉద్యమమంతా అగ్రవర్ణాల నాయకత్వంలోనే సాగుతున్న సంస్కరణల యుగంలో రచయిత మాలకులం నుంచే వచ్చిన సంగదాసులో సంస్కరణాభిలాషిని, క్రాంతదర్శిని, సంయమన శీలిని సృష్టించడం ఒక చారిత్రక అవసరానికి సాహిత్య రూపమిచ్చినట్టయ్యింది. సంగడు సవర్గ మేధావి. వర్ణ వర్గ చైతన్యం కలసిన సిసలైన సబాల్టర్న్! సామాజిక పునర్నిర్మాణంలో సవర్గ మేధావుల పాత్రను నిర్దేశించిన మేధావులు సంప్రదాయ మేధావులను కూడా కలుపుకోవాల్సిన అవసరాన్ని గుర్తించినట్టు రచయిత సంస్కరణలో అగ్రవర్ణాల పాత్రనూ గుర్తించాడు.

ఆవేశకావేశాల మధ్య, హింస ప్రతి హింసల మధ్య సాగుతున్న వర్తమాన కుల పోరాటాలకు భిన్నంగా మాలపల్లి నవల ఒక శాంతియుత పరివర్తనను చిత్రించింది. దీన్ని అగ్ర, నిమ్నకులాలు ఒకేసారి చెరొక దిశ నుంచి ప్రారంభమై సరిగ్గా మధ్యభాగంలో ఏకమై పూర్ణం కావలసిన మార్పుగా గుర్తించింది. అన్యాయం వైపు నిలబడి ఉన్నవాళ్లకు ఆత్మశక్తి లోపించి ఉంటుంది కాబట్టి ఆయుధమో, ఆగ్రహమో అవసరమౌతుంది. కానీ న్యాయం వైపు నిలబడి ఉన్న వాళ్లకు న్యాయమే ఆయుధమై వేరే ఆయుధం అవసరం ఉండదు. న్యాయం వైపున ఉన్నవాళ్లు కూడా ఆయుధమే చేపడితే యుద్ధం నిరంతరం సాగుతుంది. మాలపల్లి చిత్రించింది న్యాయమే ఆయుధమైన చరిత్ర. నడుస్తున్నది న్యాయం కూడా ఆగ్రహాన్నీ, ఆయుధాన్నీ ధరించిన చరిత్ర.

**(కేంద్ర సాహిత్య అకాడమీ, అమరావతి సామాజిక అధ్యయన సంస్థ సంయుక్తంగా నిర్వహించిన మాలపల్లి శతజయంతి సభలో ప్రసంగ పాఠం)**



# మాలపల్లి
# నవీన మానవ ఇతిహాసం


□ డాక్టర్ పి.సంజీవమ్మ


"పాశ్చాత్య సాహిత్యం అధ్యయనం చేసినవాడు గనక నవల గురించి ఒక సమగ్రమైన అవగాహన వున్నది ఉన్నవకు. ఈ నవలకు పరిచయం రాస్తూ అందులో కథావస్తువు గురించి ఒక్కమాట కూడా చెప్పలేదు. రచయితగా ఉన్నవ విశిష్టత ఇది. నవలను ఒక సీరియస్ సాహిత్యరూపంగా ఆనాటికే భావించినాడు, అందువల్ల కావచ్చు, సమాజాన్ని గురించిన తన అభిప్రాయాలు ఆలోచనలు ఏవి కూడా పరిచయంలో చెప్పలేదు. ఈ వస్త్వాశ్రయతను నవల సొంతం రక్తి కట్టించాడు. కేవలం తన అభిప్రాయాలు వ్యక్తం చేసే మాధ్యమాలుగా పాత్రలను వినియోగించుకోలేదు. అందువల్ల జగ్గని వంటి పాత్రలను సృష్టించగలిగాడు. ఇది ఉత్తమ సాహిత్య లక్షణం."

**1920-21** నాటి రాజకీయ సామాజిక చైతన్యానికి ఉన్నవ శిల్పిత ప్రతిమ మాలపల్లి. విస్తృతమైన కాన్వాస్‌పై గీచిన ఉదాత్త చిత్రం. వస్తువులోనూ, శిల్పంలోనూ ఒక కొత్త పోకడ అవలంబించాడు ఉన్నవ. ఆనాటికి సమకాలీన సామాజిక చరిత్రకు సాహితీరూపం ఇవ్వడానికి పూనుకోవడం ఆనాటి పరిస్థితుల్లో ఒక సాహసం. అందులోనూ జాతీయోద్యమ చరిత్ర అది. వ్యావహారిక భాషలో మొదటి నవల మాలపల్లి. దాని తర్వాత వచ్చిన చాలా నవలలు గ్రాంధికంలో వున్నాయి. వ్యావహారికాన్ని చేపట్టడంలో కూడా ఉన్నవ వారిది సాహసమే ఆనాటికి. ఇతివృత్తానికి కేంద్రంగా ఒక హరిజన కుటుంబాన్ని ఎన్నుకోవడం ఆనాటి సాహిత్యంలో విశిష్టత. అందువల్ల ప్రధాన పాత్రలు హరిజన పాత్రలే అయ్యాయి. పాశ్చాత్య సాహిత్యం అధ్యయనం చేసినవాడు గనక నవలను గురించి ఒక సమగ్రమైన అవగాహన వున్నది ఉన్నవకు. తన నవలకు పరిచయం రాస్తూ అందులో కథావస్తువు గురించి ఒక్కమాట కూడా చెప్పలేదు. రచయితగా ఉన్నవ విశిష్టత ఇది. నవలను ఒక సీరియస్ సాహిత్యరూపంగా ఆనాటికే భావించినాడు, అందువల్ల కావచ్చు, సమాజాన్ని గురించిన తన అభిప్రాయాలు ఆలోచనలు ఏవి కూడా పరిచయంలో చెప్పకుండా వదలివేశాడు. ఈ వస్త్వాశ్రయతను నవల సొంతం రక్తి కట్టించాడు ఉన్నవ. కేవలం తన అభిప్రాయాలు వ్యక్తం చేసే మాధ్యమాలుగా పాత్రలను వినియోగించుకోలేదు. అందువల్ల జగ్గని వంటి పాత్రలను సృష్టించగలిగాడు. ఇది ఉత్తమ సాహిత్య లక్షణం. జార్జి లూకాచ్ అన్నట్టు ... గొప్ప రచనకు గీటురాయి రచయిత దృక్పథం కాదు. ఆ దృక్పథం పట్ల నిర్మముడై రచయిత ఎంతవరకూ దాన్ని అధిగమించాడనేది గీటురాయి. ఆనాటి వివిధ ఆలోచనా ధోరణుల్ని విభిన్న పాత్రల ద్వారా వ్యక్తం చేశాడు ఉన్నవ. వాస్తవికతా వాదంలోని విశిష్టత ఇది.

విమర్శకు గీటురాయి రచయిత స్వయంగా ఏమి చెప్పాడనేది కాని, పాత్రల ద్వారా అంటే సంభాషణల ద్వారా ఏ భావాలు

**యుగయుగాల దోపిడీకి ఉరితాడు వేయాలని ప్రయత్నించిన పాత్రలను సృజించిన మొదటి తెలుగు నవల మాలపల్లి. కథాసంవిధానంలో భాగంగానే అక్టోబరు విప్లవాన్ని ప్రత్యక్షంగా ప్రస్తావించిన మొదటి నవల కూడా మాలపల్లి. పాత్రల ద్వారా మన స్వాతంత్ర్యయుగ సంఘర్షణ, ఆ చైతన్యం పూర్తిగా చిత్రితమయింది.**



వెల్లడి చేశాడనేది కాని కాదు. రచయిత ఎంచుకున్న ఇతివృత్తం, పాత్రలు వాతావరణం ఒక్క మాటలో చెప్పాలంటే కాన్వాస్ అనేది ఆ రచనా కాలం నాటి పరిస్థితుల్లో ప్రగతిశీలమా కాదా అన్నది రచయిత ఎలాటి జీవన సరళిని ప్రతిబింబించకోరుతున్నాడే దాన్ని బట్టి రూపొందుతుంది. ఈ దృష్టిలో చూసినా మాలపల్లి ఉత్తవ రచన. ఈ నవలలోని ఇతివృత్తం ఎన్నుకునేందుకు కారణం ఉన్నవ వలసవాద వ్యతిరేక, సామంతవాద వ్యతిరేక ప్రజాస్వామిక మేధావి కావడం. స్వాతంత్ర భావాలకు ప్రసిద్ధమైన ఐర్లాండులో అధ్యయనం చేశాడు గనక ఐరిష్‌జాతి ఆలోచనల ప్రభావం కూడా వుండి వుండాలి.

సమకాలీన సామాజిక ఆర్థిక రాజకీయ రంగాలు మాలపల్లి ఇతివృత్తానికి మూలకందాలు. అట్టడుగు ప్రజల సమస్యలు, దోపిడీ పీడన, ఆర్థిక దోపిడీ చిత్రితమయ్యాయి యిందులో. వీటికి పరిష్కారంగా స్వాతంత్రోద్యమాన్ని చూపింది ఈ నవల. సామాజిక ఆర్థిక పోరాటాలు రాజకీయమైన స్వాతంత్రోద్యమంతో కలసి సాగడం చక్కగా రూపించాడు ఉన్నవ. సంస్కరణోద్యమంలో ఆనాడుప్రాధాన్యం వహించిన పంచమోద్యమ ప్రభావం మాలపల్లి ఇతివృత్తం ఎంచుకోవడంలో స్పష్టంగా వుంది. ఈ పంచమోద్యమానికి సమానంగా ప్రాధాన్యం ఇచ్చి పాటకోద్యమాన్ని చిత్రించడం ఈ నవలలోని విశిష్టత. ఈ రెండు ఉద్యమాలూ జాతీయోద్యమంలో సంలీనం అయి నడిచిన తీరును చిత్రించడంలో ఉన్నవ శిల్ప నైపుణ్యం స్పష్టం. వర్గ చైతన్యం, రైతు కూలీ పోరాటం, భూస్వాముల మనస్తత్వం వంటివాటి చిత్రణ మాలపల్లిలో వలె అంత స్పష్టంగా మరో రచనలో చూడలేము. అట్టడుగున పడినలిగే అలగా జనుల ఆవేదన, ఆక్రందన, తిరుగుబాటు వేదాంతం వీటితో ఈ నవలలోని ఇతివృత్తం పెనవేసుకుంది. చరిత్రకెక్కిన బ్రిటిష్ వ్యతిరేక గిరిజన పోరాటాలు స్వాతంత్రోద్యమంలో ఒక భాగంగా జగ్గని నాయకత్వంలో సమతావాద సమాజం (ఎగిలిటేరియన్) స్థాపన కోసం సాగిన సంతాలుల పోరాటంగా చక్కగా చిత్రితమైనాయి. ఆనాటి సెటిల్మెంట్లు, జైళ్లు అక్కడి నికృష్ట పరిస్థితులు ఆ అధికారుల అవినీతి లంచగొండితనం మొదలైనవన్నీ కళ్లకు కట్టినట్టు చిత్రించబడ్డాయి. వర్ణవ్యవస్థ, వృత్తి విభజన, కులం మతం మొదలైన వాటిని గురించిన చారిత్రిక దృక్పథం, నూతన వ్యాఖ్యానాలు చోటు చేసుకున్నాయి, సందర్భానుసారంగా ఈ నవలలో. కాశీనాథుని నాగేశ్వరరావు గారు మాలపల్లికి తొలి పలుకు రాస్తూ ... ఇది మహాభారతం అని సరిగ్గా అన్నారు. ఇది ఆధునిక మహేతిహాసమనవచ్చు. ఆనాటి కొందరు విమర్శకులు ఉన్నవ వారిని ఆంధ్ర గోర్కి అన్నారు.

యుగయుగాల దోపిడీకి ఉరితాడు వేయాలని ప్రయత్నించిన పాత్రలను సృజించిన మొదటి తెలుగు నవల మాలపల్లి. కథాసంవిధానంలో భాగంగానే అక్టోబరు విప్లవాన్ని ప్రత్యక్షంగా ప్రస్తావించిన మొదటి నవల కూడా మాలపల్లి. పాత్రల ద్వారా మన స్వాతంత్ర్యయుగ సంఘర్షణ, ఆ చైతన్యం పూర్తిగా చిత్రితమయింది.

..ఫ్యూడల్ సంస్కృతిలోని కొన్ని అంశాలకు ప్రాతినిధ్యం వహించినా తమ వర్గ అస్తిత్వపు వాస్తవికతే సామాజిక ఆర్థిక పోరాటాలకు దారితీసిందనే వాస్తవాన్ని గుర్తించి ఆ పోరాటాలను ప్రోత్సహించి అహింసాయుతంగా ఆదర్శంగా నిర్వహించి ప్రాణాలర్పించిన సంగదాసు వంటి కార్మిక నాయకుల కన్నీటి గాథలు.. ఫ్యూడల్ సంస్కృతిని సమూలంగా పెకిలించి వేయాలనీ, ఆస్తిని సమానంగా పంచి అందరూ సమానంగా బతకాలనే ఒక సమతావాద దృక్పథంతో (ఇది మార్క్సిస్టు దృక్పథం కాదు) విప్లవ స్థాయిలో వీరోచిత పోరాటాలు సాగించి బ్రిటిష్ సామ్రాజ్య కిరాతకాన్ని కలియుగ రాక్షసులనబడ్డ దేశవాళీ ధనస్వాముల క్రూరత్వాన్ని కూటయుద్ధంతో ఎదుర్కొని సమాంతర ప్రభుత్వాన్నే స్థాపించే ప్రయత్నంలో ఆహుతి అయిన జగ్గడి లాటి వ్యక్తిత్వం కల్గిన సామాజిక ప్రతినిధి పాత్ర (సోషల్ నమూనా) సాహస గాథలూ మాలపల్లి ఇతివృత్తంలో నిర్ణాయక రేఖలు. స్వాతంత్ర పోరాటమూ, వర్గపోరాటమూ.. వీటిమధ్య అవినాభావ సంబంధం చిత్రించడం మాలపల్లి విశిష్టత. ఇది చాలా సహజంగా జరిగింది.

. స్వరాజ్యం వస్తుందని ఆనాటికి గట్టిగా నమ్మిన వారు చాలా తక్కువ మందే. ఆ పరిస్థితుల్లో 'భారతీయులు దౌర్జన్యరహితమైన సత్యమార్గమున స్వరాజ్యమును సంపాదించి లోకానికి మార్గదర్శకులయినారు' అని వూహించి ప్రజాప్రభుత్వం జనసంక్షేమం కోసం తలపెట్టిన కార్యక్రమాల గూర్చి నవలాంతంలో పేర్కొనడం ఉన్నవకు గాంధీ సత్యాగ్రహ మార్గం మీద వున్న అచంచల విశ్వాసాన్ని తెల్పుతుంది. సీతారామరాజు పోరాట రంగంలో అడుగుపెట్టేనాటికి మాలపల్లి రచన అప్పుడప్పుడే ముగిసింది (1922 ఆగస్టులో మాలపల్లి ప్రచురణ. అదే ఆగస్టులో



**చాలా విషయాల్లో జగ్గడు, అతని అనుచరులు సీతారామరాజును, అతని అనుచరులను, వారి కూటయుద్ధాన్ని జ్ఞప్తికి తెస్తారు. ఆనాటి పలువురు విప్లవకారుల విప్లవ కృత్యాల వరవడి యొక్క ప్రతిబింబం ఈ నవలలో కనిపిస్తుంది. అయితే అది కేవలం ప్రతి కృతి కాదు. జాతీయోద్యమంలో విప్లవాత్మక చర్యలకు పాల్పడిన వారు ముఖ్యంగా మధ్య తరగతి మేధావులు, చదువుకున్న యువకులు. మాలపల్లిలోని జగ్గడి పాత్ర వూహాజనిత (ఉటోపియా) రాజ్యం నిర్మించడానికి ప్రయత్నించిన పాత్ర.**

చింతపల్లి పోలీసు స్టేషన్‌పై సీతారామరాజు అనుచరుల దాడి)

చాలా విషయాల్లో జగ్గడు అతని అనుచరులు సీతారామరాజును, అతని అనుచరులను వారి కూటయుద్ధాన్ని జ్ఞప్తికి తెస్తారు. ఆనాటి పలువురు విప్లవకారుల విప్లవ కృత్యాల వరవడి యొక్క ప్రతిబింబం ఈ నవలలో కనిపిస్తుంది. అయితే అది కేవలం ప్రతి కృతి కాదు. జాతీయోద్యమంలో విప్లవాత్మక చర్యలకు పాల్పడిన వారు ముఖ్యంగా మధ్య తరగతి మేధావులు చదువుకున్న యువకులు. మాలపల్లిలోని జగ్గడి పాత్ర వూహాజనిత (ఉటోపియా) రాజ్యం నిర్మించడానికి ప్రయత్నించిన పాత్ర.

రాజకీయంగా మాలపల్లి సామంతవాదాన్ని వ్యతిరేకిస్తుందన్నాము. పెట్టుబడిదారీ వ్యవస్థ అప్పుడప్పుడే బలపడే ఆనాడు దేవుడు వర్ణవ్యవస్థ లాటి సామంత వాద చిహ్నాలపై చర్చలు జరగడం సహజం. అందుకే మాలపల్లిలో దేవుడు, వర్ణ వ్యవస్థ, కులం మతం మొదలైన వాటి మీద చాలాసార్లు పాత్రలు తమ అభిప్రాయాలు వ్యక్తం చేస్తుంటాయి. ఈ అభిప్రాయాలు కాల్పనికమూ కాదు, కన్సర్వేటివ్ (మితవాదం) కూడా కాదు. చాలా వాస్తవం అనిపించేవి... సంగదాసును హత్య చేసిన రాక్షసులకూ దేవుడు రాజూ మతం మొదలైనవి ఎలా అండగా వున్నాయో గమనించిన వెంకటదాసు ఇలా అన్నాడు : 'ఈ రాక్షసులకూ దేవుడు రాజూ కూడా విచ్చలవిడిగా విహరించడానికి పట్టాలిచ్చారు. మీ ధర్మశాస్త్రాలన్నీ భాగ్యవంతులు పేనించిన వురులు. బీదల కంఠానికి వురులు... కేవలం దేవుడి మీద యుద్ధం ప్రకటించినా ప్రయోజనం లేదు. ధనస్వామ్యం మీద ప్రకటించాల్సి వుందన్న విషయం జగ్గనికి స్పష్టంగా అవగతమైవున్నప్పటికీ దేవుణ్ని ఇంతగా విమర్శించవలసి రావడానికి కారణం సమాజం ప్రతిదానికి ఆ దేవుడినే బాధ్యుడని చేసి వేదాంతం ఉపన్యసించడం... వెంకటదాసు జీవిత నాటకాన్ని ఎలా ఆడానని మరణిస్తూ తండ్రిని అడిగాడు. వెంకటదాసు జీవిత నాటకం కొత్తదనీ నియమబద్ధమైనదనీ, ఆ ఉత్కృష్ట నియమాల్ని అమలులో పెట్టడం కష్టమేమోనని చాలామందికి అనుమానమన్నాడు ఆ తండ్రి. 'ధర్మాచరణం ఎప్పుడూ కష్టమే. అలవాటు పడితే సులభమే అవుతుంది. ఈ పద్ధతిలో వుండే అసాధ్యమేమీ లేదు. ఆచరణలో పెట్టడానికి ధనికవర్గమూ, దానిచేత రక్షింపబడే నిరంకుశ ప్రభుత్వమూ తప్ప వేరే ఆటంకాలు లేవు.' అని అతనన్నాడు. నవల ప్రారంభంలోనే 'అందరూ బాగుంటేనే బాగు' అంటూ ప్రగతిశీల దృక్పథాన్ని రామదాసు నోటంట, అతని పంథాలోనే పలికించాడు ఉన్నవ.

నవలలో బెజవాడ కార్మిక మహాసభ జరిగిన సందర్భం చిత్రించబడింది. సభాపతి వెంకటరెడ్డి ఉపన్యసిస్తూ ప్రపంచ రాజకీయాన్ని గురించి ప్రస్తావించాడు. అమెరికా ఫ్రాన్స్ వంటి దేశాల్లో అసమానతలు జాతుల అణచివేతలు, వాటిపై పోరాటాలు వివరించాడు. 'రూష్యా దేశంలో పంచాయతీ (సోవియట్) ప్రభుత్వం స్థాపించబడింది.' అంటూ ఆ దేశంలో వచ్చిన మార్పుల్ని చెప్పాడు. న్యాయం కోసమే కాదు. ఉత్కృష్టమైన సామాజిక విలువలకు కూడా జగ్గడు, అతని అనుచరులు ఎంత ప్రాధాన్యం ఇచ్చారో వాళ్ల స్త్రీల మానసంరక్షణార్థం చేసిన వీరోచిత పోరాటం తెలియజేస్తోంది. ఆధునిక కాలంలోని ఆత్మాహుతి దళాల లాగ స్త్రీల మాన సంరక్షణార్థం పూర్తిగా ఆత్మాహుతి అయ్యారు. ఆఖరుకు మిగిలింది ఇద్దరే. జగ్గడు, ఒక సంతాలుడు. 1921 నాటి సత్యాగ్రహ పోరాటం వేళ్లూనక పూర్వం ఇటువంటి సాహస కృత్యాలెన్నో జరిగాయి. జగ్గని ఈ సాహస పోరాటం అంతా ఒక ఎత్తు. కోర్టులో అతను చేసిన సామాజిక విశ్లేషణ మరొక ఎత్తు. కమ్యూనిస్టు ప్రణాళికలో వుండే చాలా భావాలు ఈ విశ్లేషణలో వుండటం గమనించవచ్చు. ఈ అభిప్రాయాలతో రచయిత ఏకీభవించకపోయినప్పటికీ ఆ భావాలు పాత్ర మనస్తత్వానికి, ఆలోచనలకూ జీవించిన జీవితానికి పూర్తి సముచితంగా వున్నాయి. ఆదిమ కమ్యూనిస్టు దశనుంచి పెట్టుబడిదారీ సమాజం వరకూ గల దశలను భావావేశంతో విశ్లేషించాడు జగ్గడు. ఆ పాత్ర చిత్రణలో ఆ పాత్ర భావాలు వెలువరించడంలో ఉన్నవ చూపిన తన్మయత్వం, ఔదార్యం నైపుణ్యం ఆయనను గొప్ప కళాకారుని చేశాయి. మాలపల్లిని ఒక ఎపిక్ నవలగా చేశాయి. మానవతా విలువలకు జ్యోతి అప్పాదాసుల దు:ఖాంత ప్రణయగాథ కూడా ప్రాతినిధ్యం వహిస్తుంది మాలపల్లిలో. రాజశేఖర చరిత్రలో చిత్రితమయినట్టిది పూర్తిగా నైతిక చైతన్యం. మాలపల్లి దాంతోపాటు సమాజంలోని రాజకీయార్థిక పోరాటాల చైతన్యం కూడా స్పష్టంగా ప్రతిబింబించింది. ఇది సామాజిక చైతన్యంలో వచ్చిన గొప్ప పరిణామం.

(తెలుగు నవలలో సామాజిక చైతన్యం సిద్ధాంత గ్రంథం మొదటి భాగం నుంచి- కొన్ని భాగాలు)



# ఉన్న మాట .. ఉన్నవ అన్న మాట !

మాలపల్లి నవలలో సమాజ అభ్యుదయాన్ని కాంక్షించే ఎన్నో మాటలు, సంభాషణలు ఉన్నాయి. చాలా అభిప్రాయాలు, అవగాహనలు ఇప్పటికీ గొప్ప ప్రగతిశీలంగా, ఆలోచనాసీయాలుగా ఉంటాయి. అలాంటి మాటల్లో కొన్ని .. :

"పూటకూటికి లేని ఈ కూలీలు యేమి ప్రతీకారము చేయగలరు?"

" వీండ్ల కాధారమెవరు? " రామానాయుడు ప్రశ్న

" దేవుడే ఆధారం. "

" ఆయన కూడ న్యాయం విడిచి భాగ్యవంతుల పక్షమైతేనో? "

" మనిమిద్దరం ఆయనను కూడా ఎదిరింతాం" ( పేజీ : 78)

" పస్తులుంటే దేవుడు మీకు పుణ్యమిస్తాడంట! ఆ దేవుడు దినపస్తులుండే మా కెందుకియ్యడో " (పేజీ : 82)

" ఈ హిందూ భూమ్యాకాశాలు యెవరి వారసత్వమో హిందూ విజ్ఞానం సహితం వారందరికీ దాయార్హమే. ఆద్యులయిన ఆదిరుషులు ఆచండాలంతమూ అందరికీ పూర్వీకులు ." (పేజీ : 149)

" ఘనమైన కులమేదీ, కానీ కులమేది? కులమెంచగా నేల గుణమే కారణమూ " ( పేజీ : 198)

" ఈ కథ చాలా భాగం కల్పితం. ఈ సృష్టిలో పశుబలమనీ, ఆత్మబలమనీ రెండు శక్తులు లేవు. వున్నది ఒకటే శక్తి. ధనికులు బీదలను మోసగించడానికి పండితులకు దబ్బిచ్చి ఆత్మశక్తిని సృష్టించినారు." (పేజీ : 94)

" నష్టమూ అది ఆత్మవంచన అవుతుంది. చేయి విరిగింది. కాలు తెగింది. మిగిలిన మొండాన్ని వేయిగా విభజించినా యెప్పుడూ నా శిరస్సు వంచను. చీలికలే లు కూడా వంగవు. : వెంకటదాసు (పేజీ : 597)

" మా సొమ్ముయితే మాకుండేదే. విచారించి యేమి ప్రయోజనం?
ఈ వేదాంతాలు బీడవాండ్లను మోసం చేయడానికి పుట్టినవి." (పేజీ : 299)

" లోకాన్ని పీల్చిపిప్పిచేస్తున్న ధన పిశాచాలను సంహరించవలనంటే ధర్మ శాస్త్రాలు తిరగరాయవలసి వస్తవి. ఈ ధర్మ శాస్త్రాల ఫలితమే ఈ ధన పిశాచాలు."

" వీడు జనాన్ని అంధకారంలో వుంచవలెనని చూస్తున్నాడు. కాని తెల్లవారింది. జనులు ప్రబోధితులవుతున్నారు. ఇక ఈ నిరంకుశుని బాటు సాగదు. మీ దేవుడు యీ పిశాచాలు దేవాలయాలు కట్టిస్తున్నవనీ ఉత్సవాలు చేయిస్తున్నవనీ వాటి అధికారం చెల్లవలెనని కోరతాడేమో? మీ దేవుడు లంచగొండి. సహేంద్ర తక్షకాయ స్వాహా అని ఈ సర్పాలతో పాటు ఈ దేవుడు కూడా ఆహుతి కావలసి వున్నాడేమో తెలియదు."

" మీ దేవుడు ధనపిశాచాలా చేతుల్లో నుంచి బయిటపడాల. దౌర్భాగ్యులైన ఈ పేదలందరికీ ఉపకారం చేయమనండి " (పేజీ : 302 - 305)

" ఈ రాక్షసులకు దేవుడూ రాజు కూడా విచ్చలవిడిగా విహరించడానికి పట్టాలు ఇచ్చారు. మీ ధర్మశాస్త్రాలన్నీ భాగ్యవంతులు పేనించిన పురులు. పేదలపాలిట వురులు." (పేజీ : 310, 11)

## ఉన్నవ దస్తూరి : లా డిపార్టుమెంటుకు రాసిన లేఖ

Sir,

I read in News papers that there was an interpellation No. 678 on 30-3-27 in the Madras Legislative Council about the removal of proscription of my book called Malapalli or Sangavijayamu. It was suggested by Mr. Kaleswararao that the desirability of omitting some passages might be discussed by the author with the advocate general and the Law member appears to agree to that course. I intend discussing the passages referred to with the advocate general & shall be obliged if the Government will issue necessary instructions to discuss the matter with me.

I shall also be glad if a list of the six or seven passages referred to by the Law member be sent to me for my information.

I have the honour to be
Sir
Yours faithfully
V. Lakshminarayana

Guntur
18-4-27

'లా' డిపార్ట్‌మెంట్ సెక్రటరీకి వున్నవ వ్రాసిన జాబు.
పైన వున్న సంబోధన భాగం యీ చిత్రంలో తీసివేయబడింది.



# 'మాలపల్లి', 'రంగభూమి' నవలల తులనాత్మక పరిశీలన

❑ పేరిసెట్టి శ్రీనివాసరావు

రంగ్‌భూమి, మాలపల్లి నవలలు సామాజిక చైతన్యానికి ప్రతీకలు. ఈ ఇద్దరు మహానుభావులూ తమ రచనా కౌశల్యంతో భారత గ్రామీణ జీవితాన్ని కళ్లకు కట్టినట్లుగా చిత్రీకరించారు. తెలుగు, బెంగాలీ సాహితీ ప్రియుల మధ్య ఒక చర్చ జరుగుతుండేది. అదేమిటంటే 'మాలపల్లి', 'రంగ్‌భూమి' గాంధేయవాదంతో ప్రభావితమైనవా లేక మార్క్సు వాదంతోనా? అని. దీనిపై భిన్న భిన్న అభిప్రాయాలు వెలువడ్డాయి. కానీ ఒక విషయంలో ఈ రెండు నవలల్లో ఏకత్వాన్ని దర్శించవచ్చు, అది సామాజిక చైతన్యం శ్రేయస్సుని కాంక్షించే నవలా రచన.

* ఈ వ్యాసం సాహిత్య అకాడెమీ ప్రచురించిన ఉన్నవ లక్ష్మీనారాయణ మాలపల్లి వ్యాస సంపుటిలోది.

'దేశభక్త' ఉన్నవ లక్ష్మీనారాయణ సమయం ఆశ్చర్యకరంగా హిందీ నవలా సామ్రాట్ 'ప్రేమచంద్' యొక్క సమయంతో సరితూగుతున్నది. ప్రేమ్‌చంద్, ఉన్నవ లక్ష్మీనారాయణలు ఇరువురూ తమ నవలా సాహిత్యం ద్వారా భారతీయ నవ జాగరణ ఉద్యమం, సంఘ సంస్కరణలను సామాన్య ప్రజానీకం వరకూ చేరవేసే పనిని చేబట్టారు. ప్రస్తుత హిందీ సాహితీ విమర్శకులలో అగ్రగణ్యులైన డా. నామ వర్సింగ్ ఇలా అన్నారు : "భారతీయ నవలపై పాశ్చాత్య దేశాల నవలా ప్రభావం ఉన్నది. అది పాశ్చాత్య నవలను అనుకరిస్తుందనే సిద్ధాంతం మౌలికంగా తప్పు, ఎందుకంటే 'భారతీయ నవల పాశ్చాత్య దేశాల నవలలాగ మధ్య తరగతి పాఠకుల 'మహాకావ్యం'గా ఉద్భవించలేదు. అది నవజాగరణ ఉద్యమ గర్భం నుండి ఆవిర్భవించింది". దీనికి ముఖ్య కారణం మన మొట్టమొదటి నవలా రచయితలు తమ కథా వస్తువుగా గ్రామాలను ఎంచుకోవడం, సామాజిక మార్పు ద్వారా రాజకీయ మార్పు, చైతన్యాలను తీసుకు వచ్చే ప్రయత్నం చేయడం. హిందీలో ప్రేమ్‌చంద్ కాని, తెలుగులో ఉన్నవ లక్ష్మీనారాయణ కాని – ఇరువురి దృష్టి గ్రామ కేంద్రితమై ఉన్నది. పేద ప్రజల సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక బానిసత్వమే కేంద్రీకృతమై ఉన్నది. నిరక్షరాస్యత, వెనుకబడినతనం, మూఢ నమ్మకాలు మొదలైన వాటి నుంచి గ్రామీణ ప్రజలు స్వతంత్రులు కాగలిగితే రాజకీయ స్వాతంత్ర్యం దానంతట అదే వస్తుందని ఈ ఇరువురి నమ్మకం. అందుకే ఉన్నవ లక్ష్మీనారాయణ గారు తన నవల 'మాలపల్లి'లో రామదాసు, సంగదాసులను సామాజిక మార్పునకు ప్రతీకలుగా తీర్చిదిద్దారు. ప్రేమ్‌చంద్ తన 'రంగభూమి'లో సమాజంలోని రకరకాల అన్యాయాలను ఆత్మబలంతో ఎదుర్కొనే ఒక ధైర్యవంతుడైన, ధీరుడైన నాయకుడిగా 'సూరదాస్ పాత్రను సృష్టించాడు. హిందీ సాహిత్యంలో గ్రామీణ వాతావరణంతో కూడిన అనేక నవలలు (ప్రేమ్‌చంద్‌వి కాకుండా) వచ్చాయి. ముఖ్యంగా 'శివపూజన్ సహాయ యొక్క 'దేహతీ దునియా'తో ఈ పరంపర ప్రారంభమవుతుంది.

'బలచనమా' (నాగార్జున్), 'మైలాంచల్', 'షరతీ పరికథా' (ఫణీశ్వర్‌నాథ్ రేణు), 'అలగ్ అలాగ్ వైతరణీ' (శివప్రసాద్ సింగ్), 'ఆధాగాంచ్' (రాహీ మసూమ్ రజా), పానీ కే ప్రాచీర్', 'జల్ టూట్‌తా హువా' (రాందరశ మిశ్రా), 'రాగ్ దర్బారీ' (శ్రీలాల్

శుక్ల) నవలలు పైన పేర్కొన్న పరంపరను పరిపుష్టం చేశాయని చెప్పొచ్చు. ఈ నవలా రచయితలు అందరూ ప్రేమ్‌చంద్, ఉన్నవలకు రుణపడినవారే! ఎందుకంటే ఈ ఇద్దరూ హిందీ, తెలుగు నవలను 'మధ్య తరగతి మహాకావ్యం'గా తీర్చిదిద్దారు.





మహాత్మాగాంధీ సిద్ధాంతాలను తమ కావ్యాల్లో ప్రతిఫలింపచేశారు.

వీరి తర్వాత వచ్చిన నవలా రచయితలు 'సమకాలీనత' ఎడల ప్రదర్శించిన ప్రతిస్పందన నిరాశకి గురిచేస్తుంది. ఒక రకమైన నైరాశ్య ప్రభావాన్ని చూపుతుంది. "గ్రామాల స్థితిగతులు ఎన్నటికీ మారవు. ఇంకా ఇంకా నాశనమైపోతాయి. వీటిని 'వైద్యం లేనటువంటి రోగులుగా భావించి నగరం వైపు పారిపో! అక్కడే నీకు మంచి జరుగుతుంది". అన్నట్టు అవి ప్రబోధం చేశాయి. అందువల్లే 'రాగ్ దర్బారీ' నవలలో 'రంగనాథ్' గ్రామం నుంచి నగరానికి తిరిగి వెళ్లిపోతాడు. నిజానికి ఎవరో 'పట్నం' నుంచి వచ్చి 'పల్లె'ను మార్చలేరు. ఎవరైతే గ్రామాల్లో పుడతారో, ఎవరికైతే ఆ మట్టిపై మమకారం ఉంటుందో, ఎవరైతే గ్రామ ప్రజలను ప్రేమిస్తారో, ఎవరికైతే గ్రామ పద్ధతులపై ధ్యాస ఉంటుందో, ఎవరైతే జీవితపు విలువలకు మూలాధారం గ్రామీణ జీవనమని నమ్ముతారో వారు మాత్రమే మార్చగలరు.

ప్రేమ్‌చంద్ 'రంగభూమి' నాయకుడి పాత్ర సూరదాస్ అటువంటి శుద్ధమైన అచ్చమైన గ్రామీణ పంట. అంతే స్వచ్ఛమైన పాత్రలు 'ఉన్నవ' వారి 'మాలపల్లి'లోని రామదాసు, సంగదాసు. ఈ పాత్రల ద్వారా ప్రేమ్‌చంద్, ఉన్నవ గాంధేయవాదాన్ని, ఆలోచనా తత్వాన్ని తమ నవలలో ప్రవేశపెట్టారని చెప్పవచ్చు. వీరికి గాంధీ స్వరాజ్ నుంచి లభించిందని చెప్పవచ్చు.

'రంగభూమి'లో సూరదాస్ తన గ్రామంలో పొగాకు ఫ్యాక్టరీ నిర్మాణాన్ని నిరోధించటం; 'మాలపల్లి'లో రామదాసు తన గ్రామంలోని వెనుకబడిన లేదా తన సామాజిక వర్గ ప్రజల దశను ఉద్ధరించడానికి ప్రయత్నించటం దీనికి నిదర్శనంగా చూపవచ్చు. ఈ ఇద్దరి కార్య కలాపాలు హింద్ స్వరాజ్ సంకల్పానికి ప్రతీకలుగా భావించవచ్చు. ప్రేమ్‌చంద్, ఉన్నవ తమ నవలల ద్వారా సమాజంలోని దుర్గుణాలను సమీక్షించి నూతన విలువల సహాయంతో మార్పునకు శ్రీకారం చుట్టారు.

**ఉన్నవ 'మాలపల్లి'**

'మాలపల్లి'లో రైతులకు, జమీందారులకు (చౌదరయ్య, ఇతరులు) మధ్య ఘర్షణ జరుగుతుంది. 'మాలపల్లి'కి నాయకుడు రామదాసు. విద్యా వంతుడు, స్థితప్రజ్ఞుడు. తన కష్టంతో నాలుగైదు ఎకరాల భూమి సాగు చేసుకుంటున్నాడు. పెద్ద కుటుంబం. చౌదరయ్య క్రూరుడు, లోభి. భార్య లక్ష్మమ్మ సౌశీల్యవతి. రామదాసు తన తోటి నిమ్న కులస్థులైన వారి ఉద్ధరణకై నిరంతరం ప్రయత్నిస్తుంటాడు. ఆయన ఉద్దేశ్యంలో గ్రామీణ ప్రజల దురవస్థకు ముఖ్యంగా రెండు ప్రధాన కారణాలు – అజ్ఞానం, దారిద్ర్యం. రామదాసు రెండో కుమారుడు సంగదాసు తన తండ్రి అభిప్రాయాలను సఫలం చేయడంలో కృతకృత్యుడై ఉంటాడు. హరిజనోద్ధరణలో భాగంగా చౌదరయ్య కొడుకు రామా నాయుడుతో కలిసి ఊరూరా తిరుగుతూ ప్రసంగాలు ఇస్తుంటాడు. ఈ నేపథ్యంలో చౌదరయ్య తన కొడుకుని పాడు చేస్తున్నాడనే నెపంతో సంగదాసుని చంపించడం, రామదాసు ఓడిపోవడం జరుగుతుంది. రామదాసు కృంగిపోకుండా సంఘ సంస్కరణలో భాగంగా విద్యాలయం స్థాపించడం, ఇతర సంఘ సంస్కరణ కార్యక్రమాలు చేపట్టడం చౌదరయ్యకు కంటగింపవుతుంది. పాత దస్తావేజులు బయటకు తీసి రామదాసు పొలాన్ని అన్యాయంగా చేజిక్కించుకుంటాడు. ఈ అన్యాయాలను సహించలేని రామదాసు పెద్ద కొడుకు వెంకటదాసు ఇల్లు విడిచి వెళ్లిపోతాడు. 'తక్కెళ్ల జగ్గడు' అనే పేరుతో ఉన్నవాళ్లను కొట్టి పేదవారికి సహాయం చేస్తుంటాడు. సమాజం దృష్టిలో దొంగగా చిత్రీకరించబడతాడు. ప్రభుత్వంతో జరిపిన పోరాటంలో ఓడిపోయి, జైలు పాలవుతాడు. ఎక్కడైతే తన తల్లిదండ్రులిద్దరూ ఉన్నారో అక్కడికే చేరతాడు. జైలు జీవితం అనుభవించలేక; కుమార్తె జ్యోతి, మేనల్లుడు అప్పాదాసుల మరణ వార్త విని తట్టుకోలేక రామదాసు భార్య మరణిస్తుంది. వెంకటదాసు కూడా జైలులోనే మరణిస్తాడు. ఇంత జరిగినా ముందే చెప్పినట్లుగా రామదాసు స్థితప్రజ్ఞుడు, కర్మ సిద్ధాంతాన్ని నమ్మినవాడు, కాబట్టి కోర్టులకు వెళ్లడు. జైలు నుంచి విడుదల అయిన తర్వాత సంఘ సంస్కరణల కోసం పాటుబడతాడు.

**ప్రేమ్‌చంద్ 'రంగ్‌భూమి'**

ప్రేమచంద్ నవలను 1924లో ప్రచురించారు. ఉర్దూ భాషలో 'చౌగానే హస్తీ'గా రాయబడినప్పటికినీ 'హిందీ'లోనే ప్రచురించడమైనది. 'ప్రేమచంద్' నవలలు భూమి, కర్మభూమి, ప్రధానంగా గోదాన్ .. ఇవన్నీ కూడా భారత గ్రామీణ స్థితిగతులను చిత్రీకరించే గద్యకావ్యాలు. ప్రేమచంద్ గొప్ప జాతీయవాది, దేశభక్తుడు. కానీ, ఆయన నవలలలో 'జాతీయతాభావం' ఆ మేరకు ప్రతిఫలించలేదని కొందరి సమీక్షకుల అభిప్రాయం.

'రంగ్‌భూమి' సంఘటనల ప్రధానమైన నవల. సూరదాసు కథానాయకుడు. అతనిలో సేవాభావం, మనుషుల పట్ల సానుభూతి, ఆత్మవిశ్వాసం పుష్కలంగా ఉంటాయి. అతడు కొన్ని సిద్ధాంతాలు

> **రామదాసు మాలపల్లికి హృదయమైతే సూరదాసు రంగ్‌భూమికి ఆత్మగా పేర్కొనవచ్చు. రామదాసు సుఖదు:ఖాలను రెండింటిని సమానంగా ఒక కర్మయోగిలాగ స్వీకరిస్తాడు. సూరదాసు కూడా అలాంటి స్వభావే! ప్రేమచంద్ మాటల్లోనే చెప్పాలంటే – 'సూరదాసు తన నిష్కళంకమైన సాధనతో నవలలోని మొత్తం పాత్రల యొక్క మలినాన్ని కడిగిన ముత్యం'.**

> **మాలపల్లి, రంగ్‌భూమి రెండింటిలోనూ సామాజిక విషయాలు, మహిళా సమస్యలు ప్రస్తావించబడ్డాయి. రంగ్‌భూమిలో అంతర్జాతీయ వివాహాలు, స్త్రీ స్వాతంత్ర్యం, మతపరమైన అంశాలు ఉంటే, మాలపల్లిలో అంటరానితనంపై పోరాటం, జమీందారీ వ్యవస్థ, జాతీయ ఉద్యమంలాంటి అంశాలు ఉన్నాయి. ఈ సమస్యలన్నింటికి నవలలోనే అంతర్గతంగా పరిష్కారాలు ఉన్నాయి.**

కలిగినవాడు. ఎన్ని కష్టాలు ఎదురైనా విశ్వాసం మెండైనవాడు, కాబట్టి సిద్ధాంతాలకు తిలోదకాలివ్వడు. కొందరు అతనిపై అసత్య ఆరోపణలు చేసినా, హేళన చేసినా, ఈర్ష్యపడినా, ఏం చేసినా దేనికీ భయపడడు సరికదా తన సిద్ధాంతాలపై అచంచలమైన విశ్వాసంతో నిలబడతాడు. ప్రేమ్‌చంద్ ఈ సూరదాస్ పాత్ర ద్వారా గాంధేయవాదాన్ని ప్రతిష్ఠించాడు. సూరదాస్ స్వార్థం, అసత్యం, కుసంస్కారాలను త్యజించిన యోగిలాంటివాడు. అతనికి ప్రపంచం ఒక 'రంగ్‌భూమి' (నాటకశాల) లాంటిది. ఈ నవలకి వేదిక బనారస్‌కి సమీపాన ఉన్న 'పాండేపూర్' అనే గ్రామం. ప్రధాన కథ 'సూరదాస్'ది అయినప్పటికీ– వినయ్, సోఫియాల కథ కూడా ముఖ్యమైనదే. ఈ నవలలో పాండేపూర్ గ్రామ ప్రజల స్థితిగతులను ప్రేమ్‌చంద్ వివరించారు. తాహిర్ ఆలీ కుటుంబ కథ, జాన్ సేవక్, మహేంద్రకుమార్, కున్వర్ భరత్ సింగ్ లాంటి పాత్రలను కూడా ప్రేమ్‌చంద్ సృష్టించారు.

సూరదాస్ గొప్ప మానవతావాది. ఒక్కొక్క పైసా కూడబెట్టి గ్రామంలో బావులు తవ్వించడం, మందిరాలను నిర్మించడం వంటివి చేస్తాడు. ఆధునిక ఆర్థిక వ్యవస్థ పెట్టుబడిదారీ వ్యవస్థకు జన్మనిచ్చిన తల్లి, ఆర్థికంగా చూస్తే ఈ వర్గం చాలా బలీయమైనది. 'రంగ్‌భూమి' జాన్ సేవక్ పెట్టుబడిదారీ వర్గానికి ప్రతినిధి. సూర్‌దాస్‌ని శ్రామిక వర్గానికి ప్రతినిధిగా పేర్కొనవచ్చు. వీరిరువురి మధ్య సంఘర్షణ, చివరికి పెట్టుబడిదారీ వ్యవస్థ విజయం, గాంధేయవాదం ఓటమి ఈ నవలలోని ముఖ్యాంశం. అయితే ఇక్కడ గాంధేయవాదం ఓడిపోలేదు. నైతికంగా గెలిచింది. తమ రచనల ద్వారా ప్రేమచంద్, ఉన్నవ సమాజానికి ఇచ్చిన సందేశమేమిటంటే – 'సామాజిక చైతన్యానికి లేదా మార్పునకు ప్రతిఘటిస్తే ఫలితమొస్తుంది. కానీ. దానికి అనంతమైన సహనం కావాలి'.

ఇదేగాక, మాలపల్లి, రంగ్‌భూమి రెండింటిలోనూ వితంతు వివాహాలు, వేశ్యా సమస్య, స్త్రీ విద్య మొదలైన ఎన్నో విషయాలు ప్రస్తావించబడ్డాయి. రంగ్‌భూమిలో అంతర్జాతీయ వివాహాలు, స్త్రీ స్వాతంత్ర్యం, మతపరమైన అంశాలు ఉంటే, మాలపల్లిలో అంటరానితనంపై పోరాటం, జమీందారీ వ్యవస్థ, జాతీయ ఉద్యమంలాంటి అంశాలు ఉన్నాయి. ఈ సమస్యలన్నింటికి నవలలోనే అంతర్గతంగా పరిష్కారాలు ఉన్నాయి.

ప్రేమ, వివాహాల గురించి రంగ్‌భూమిలో వినయ్, సోఫియాల ప్రణయమే ఒక ఉదాహరణ. వినయ్ క్షత్రియుడు, సోఫియా స్వతంత్ర భావాలు గల నాయిక. మాలపల్లిలో అప్పాదాసు, జ్యోతిలది అమలినమైన బాంధవ్యం.

రామదాసు మాలపల్లికి హృదయమైతే సూరదాసు రంగ్‌భూమికి ఆత్మగా పేర్కొనవచ్చు. రామదాసు సుఖదు:ఖాలను రెండింటిని సమానంగా ఒక కర్మయోగిలాగ స్వీకరిస్తాడు. సూరదాసు కూడా అలాంటి స్వభావే! ప్రేమచంద్ మాటల్లోనే చెప్పాలంటే – 'సూరదాసు తన నిష్కళంకమైన సాధనతో నవలలోని మొత్తం పాత్రల యొక్క మలినాన్ని కడిగిన ముత్యం'. రంగ్‌భూమి, మాలపల్లి నవలలు రెండూ యథార్థమైన జీవితానికి సంబంధించిన సమస్యలను ఉదహరిస్తూ వాటికి సమాధానం వెతుక్కుంటూ సామాజి మార్పునకు ప్రయత్నం చేసేవాటిగా పేర్కొనవచ్చు.

రంగ్‌భూమిలో సామంతవాదం, జనవాదం పేరు మీద మహేంద్రకుమార్, రాజాకున్వర్ భరత్‌సింగ్, సూరదాసు పాత్రల సంఘర్షణగా రంగ్‌భూమి నవలలో ప్రేమ్‌చంద్ దళిత పీడిత, దగా పడిన సమూహం తరపున సంఘమనే కోర్టులో దావా వేసినప్పుడు ఓడిపోతాడని తెలిసీ, సవివరంగా చర్చించటమే ప్రేమచంద్ విజయంగా పేర్కొనాలి. అలాగే మాలపల్లిలో వర్ణించబడిన సంఘ సంస్కరణ కేంద్రాలు, జైలు, కోర్టు, పాఠశాల, ఖాదీ, సహాయ నిరాకరణ, స్వరాజ్య సంగ్రామం, అహింస మొదలైన విషయాల చర్చ వల్లన సమకాలీన పరిస్థితులు అవగాహనకొస్తాయి. ఆంధ్రదేశపు గ్రామీణ జీవనానికి ప్రతీకగా ఈ నవలను పేర్కొనవచ్చు.

నిర్వివాదంగా రంగ్‌భూమి, మాలపల్లి నవలలు నవ జాగరణ సామాజిక చైతన్యానికి ప్రతీకలు. ఈ ఇద్దరు మహానుభావులూ తమ రచనా కౌశల్యంతో భారత గ్రామీణ జీవితాన్ని కళ్లకు కట్టినట్లుగా చిత్రీకరించారనటంలో అతిశయోక్తి లేదు. ఇరుభాషల మేధావులు, సాహితీప్రియుల మధ్య ఒక చర్చ జరుగుతుండేది. అదేమిటంటే 'మాలపల్లి', 'రంగ్‌భూమి' గాంధేయవాదంతో ప్రభావితమైనవా లేక మార్క్సు వాదంతోనా? భిన్న భిన్న అభిప్రాయాలు వెలువడ్డాయి. కానీ ఒక విషయంలో ఈ రెండు నవలల్లో ఏకత్వాన్ని దర్శించవచ్చు. అది సామాజిక చైతన్యం శ్రేయస్సుని కాంక్షించే నవలా రచన జరిగింది. కనుకనే నేటి ప్రపంచీకరణ నేపథ్యంలో ప్రపంచమే పల్లెగా మారిపోతున్న వేళ స్థానికత అనే సంస్కార భావం వల్లనే 'రంగ్‌భూమి', 'మాలపల్లి' నవలలు చర్చలో ఉన్నాయి. ఉన్నవ, ప్రేమ్‌చంద్ ఇద్దరూ కూడా ప్రాత:స్మరణీయులే!

■



# మాలపల్లి పూర్వరంగం
# ఉన్నవ వ్యక్తిత్వ వికాసం

❑ డా. సముద్రాల కృష్ణమాచార్య

"ఉన్నవకు నాడు తెలుగునాడులో సాగిన వివిధోద్యమాలలో క్రియాశీలకమైన భాగస్వామ్యం భూమికగా నిలిచింది. క్రియాశీలకమైన పాత్ర ప్రధానంగా 'మాలపల్లి' రచనకు దారితీసింది. ఈ నవలా నిర్మాణానికి ఉన్నవ జీవితంలో పొందిన వివిధ అనుభవాలే పూర్వరంగంగా పనిచేశాయి. ఉన్నవ సమిష్టి లాభానికి, సంఘ శ్రేయస్సుకు కృషి చేసిన వ్యక్తి. జనాభ్యుదయాన్నీ, హరిజనాభ్యుదయాన్నీ ఆకాంక్షించి కృషి సల్పినవాడు. స్వాతంత్ర్య పోరాటంలో ప్రత్యక్షంగా పాల్గొన్నవాడు. వీటి కొరకు ఆయన తన జీవితంలో పొందిన అనుభవాలు, ఎదురైన పరిస్థితులు, కల్గించిన ప్రేరణ ... ఇన్నింటికి అక్షరరూపం కల్పించగా ఏర్పడిన నవల 'మాలపల్లి'."

మాలపల్లి : విమర్శనాత్మక పరిశీలన గ్రంథం నుంచి.

ఉన్నవ లక్ష్మీనారాయణ సాహిత్యోపాసకుడు, నవలాకర్త, సంఘ సంస్కరణాభిలాష కలవాడు. చేపట్టిన కార్యమును సాధించువరకు వదిలిపెట్టువాడు కాదు. కాశీనాధుని నాగేశ్వరరావు గారు ఉన్నవను గురించి 'సుప్రసిద్ధాంధ్ర నాయకులు, సంస్కర్తలు, సాహిత్య విశారదులు, కార్యశూరులు. శారదా నికేతనము, మాలపల్లి నవల లక్ష్మీనారాయణ గారి మానవ ధర్మ పరాయణత్వమునకు నిదర్శనములు' అని పేర్కొన్నారు.

ఉన్నవకు నాడు తెలుగునాడులో సాగిన వివిధోద్యమాలలో క్రియాశీలకమైన భాగస్వామ్యం భూమికగా నిలిచింది. క్రియాశీలకమైన పాత్ర ప్రధానంగా 'మాలపల్లి' రచనకు దారితీసింది. ఈ నవలా నిర్మాణానికి ఉన్నవ జీవితంలో పొందిన వివిధ అనుభవాలే పూర్వరంగంగా పనిచేశాయి. ఉన్నవ సమిష్టి లాభానికి, సంఘ శ్రేయస్సుకు కృషి చేసిన వ్యక్తి. జనాభ్యుదయాన్నీ, హరిజనాభ్యుదయాన్నీ ఆకాంక్షించి కృషి సల్పినవాడు. స్వాతంత్ర్య పోరాటంలో ప్రత్యక్షంగా పాల్గొన్నవాడు. వీటి కొరకు ఆయన తన జీవితంలో పొందిన అనుభవాలు, ఎదురైన పరిస్థితులు, కల్గించిన ప్రేరణ ... ఇన్నింటికి అక్షరరూపం కల్పించగా ఏర్పడిన నవల 'మాలపల్లి'.

విద్యాభ్యాస కాలంలో ఉన్నవపై ప్రభావం చూపినవి : 1. అచలం 2. ఏసు క్రీస్తు జీవితం 3. సంస్కర్తల ప్రభావం 4. రాజకీయ నాయకుల ప్రభావం.

**అచలం :** అచలంలో కుల నిరసన భావం ప్రధానమైంది. ఈ అచల ఉపదేశాన్ని ఉన్నవ బాల్యంలోనే తండ్రి ద్వారా పొందాడు. తండ్రిలోని కుల నిరసన భావం ఉన్నవను ఉత్తమ సంస్కర్తగా తీర్చిదిద్దింది. సంఘ సంస్కరణంలోనూ పంచముల సమస్య ఉన్నవను ఆకర్షించింది. పంచముల దుస్థితి ఆయన మనస్సును కలచివేసింది. ఈ కలతతో కూడిన హృదయం 'మాలపల్లి' నవల అంతటా కనిపిస్తుంది. ఈ పంచముల సమస్యే 'మాలపల్లి' రచనకు ప్రోద్భలకము, ప్రధాన వస్తువు.

**ఏసుక్రీస్తు జీవితం :** క్రీస్తు జీవితంలో కనిపించేవి జీవ కారుణ్యం, విశ్వవేదన, ఆత్మబలిదానం. ఉన్నవ చదువుకొన్న పాఠశాలలో చాలామంది అధ్యాపకులు క్రైస్తవులు. వీరి వల్ల ఆయన క్రైస్తవ మతాన్ని గురించి తెలుసుకోగలిగినాడు. 'క్రీస్తు గుండెలో విశ్వ



మెట్రిక్యులేషన్ చదువుతున్న కాలంలోనే ఉన్నవ బాల గంగాధర తిలక్ రాజకీయాల పట్ల ఆసక్తి పెంపొందించుకొన్నారు. 'రాజకీయముగా దేశములో మార్పు రావలెనా, ముందుగా సంఘములో మార్పు రావలెనా అనే జిజ్ఞాస' ఉన్నవలో కలిగింది. దీనికి సమాధానం 'మాలపల్లి'లో కనిపిస్తుంది.

వేదనతో శ్రుతి కలుపుకొన్న దుర్భర వేదన ఎలా కొట్టుకొనేదో గ్రహించాడు. ఇక్కడ ఏసుక్రీస్తు పొందింది విశ్వవేదన. 'మాలపల్లి'లో రామదాసు సంగదాసు, రామానాయుడులలో ఈ వేదన కనిపిస్తుంది. రామదాసు నవలారంభంలోనే పండిన పంటను చూసుకొని 'అందరూ బాగుంటేనే బాగు' అని అనుకొంటాడు. సంగదాసు.. 'మహా సంఘాభివృద్ధి ప్రధానంగా యెంచుతుండే విశాల హృదయులు'....; రామానాయుడు.. 'దిగువ జాతుల' హైన్యపు జీవితాలకు వ్యధ చెందుతూ, అవిశ్రాంతంగా పంచమ, కార్మికోద్యమ అభివృద్ధికై కృషి చేస్తుంటాడు. ఈ విధంగా ఉన్నవ విద్యార్థి దశలో తెలుసుకొన్న వేదన 'మాలపల్లిలో పలు పాత్రలద్వారా వ్యక్తం చేశారు. ఒక గొప్ప కార్యం సాధింపబడాలంటే నిస్వార్థ త్యాగంతోపాటు, 'ఆత్మ బలిదానం' అవసరం. ఈ విషయం క్రీస్తు ఆత్మబలి దానం' వల్ల తెలుస్తున్నది. ఈ భావాన్ని ఉన్నవ 'మాలపల్లి'లో పలుచోట్ల వ్యక్తీకరించాడు.

**సంస్కర్తల ప్రభావం:** సామాజిక పునరుజ్జీవనానికి పాటుపడుతున్న రాజా రామ్మోహనరాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్ వంటి మహానుభావుల గురించి విద్యాభ్యాస కాలంలో తెలుసుకున్న ఉన్నవపై వీరేశలింగం గారి ప్రభావం ఎక్కువగా కనిపిస్తుంది. వీరందరి ప్రభావం ఆయనలో సంఘ సంస్కారణాభిలాష పెంపొందదానికి కారణమైంది. 'మాలపల్లి వంటి గొప్ప నవల ఆవిర్భవించడానికి ప్రధాన కారణమైంది.

**రాజకీయ నాయకుల ప్రభావం :** మెట్రిక్యులేషన్ చదువుతున్న కాలంలోనే ఉన్నవ బాల గంగాధర తిలక్ రాజకీయాల పట్ల ఆసక్తి పెంపొందించుకొన్నారు. 'రాజకీయముగా దేశములో మార్పు రావలెనా, ముందుగా సంఘములో మార్పు రావలెనా అనే జిజ్ఞాస' ఉన్నవలో కలిగింది. దీనికి సమాధానం 'మాలపల్లి'లో కనిపిస్తుంది. రాజకీయ స్వాతంత్ర్యం వస్తేనే దేశంలోని పంచమ, కార్మికోద్యమాలు సత్ఫలితాలనివ్వగలవని ఉన్నవ ఈ నవల ద్వారా తన నమ్మికను వ్యక్తం చేశాడు.

**సంఘ సంస్కరణ దృష్టి :** సంఘ సంస్కరణలో స్త్రీ జనోద్ధరణ, కుల వ్యవస్థ నిర్మూలన ప్రధాన మైనవి. దేశంలో ప్రప్రథమంగా సాంఘిక, మత, సంస్కరణోద్యమాలను ప్రారంభించినవారు రాజా రామ్మోహనరాయ్. ఈ సంస్కరణల ప్రభావం ఆంధ్రదేశంలోనూ వ్యాపించింది.

ఆంధ్రదేశంలోని స్త్రీల పరిస్థితి కూడా వంగదేశంలో వలె బాధావహంగా ఉంది. ఒకవైపు అతి బాల్య వివాహాల వల్లా, మరొకవైపు వీరికి విద్యార్జనాది అవకాశాలు లేకపోవడం వల్లా, దీనికితోడు బాల్యంలోనే వైధవ్యం ప్రాప్తించడం వల్లా ... స్త్రీలు వ్యధాభరిత జీవితాన్ని గడుపుతున్నారు. ఇలాంటి పరిస్థితుల్లో కందుకూరి వీరేశలింగం సంఘ సంస్కరణోద్యమాన్ని చేపట్టి స్త్రీ జనోద్ధరణకై పాటుపడుతున్నాడు. ఇతనితోపాటు రఘుపతి వెంకటరత్నం నాయుడు, చిలకమర్తి లక్ష్మీనరసింహం మొదలైనవారు కృషి చేస్తున్నారు. సంఘ సంస్కరణ ఎడల ఆతురత ఉన్న ఉన్నవను అనాటి పరిస్థితులు కలవరపరిచాయి. వీరేశలింగం సంస్కరణోద్యమం అమితంగా ఆకర్షించింది. ఉన్నవ సంఘ సంస్కరణ కృషి నాలుగు విధాలుగా కనిపిస్తుంది.

**సంస్కరణ పెళ్ళిళ్ళు :** ఉపాధ్యాయుడుగా పనిచేస్తున్న కాలంలో, 1902లో మొట్టమొదటిసారిగా ఉన్నవ గుంటూర్లో వీరేశలింగం అధ్యక్షతన వితంతు వివాహాన్ని జరిపించాడు. ఈ కారణంగా ఇతన్ని బంధువులు, మిత్రులు బహిష్కరించారు. అయినా, ఉన్నవ అధైర్యపడక, వెలిని కూడా లెక్కచేయక, ఎదురొడ్డి నిలిచాడు. పరంపరగా సంస్కరణ వివాహాలు జరిపిస్తూ వచ్చాడు. దీనివల్ల ఉన్నవ 'గుంటూరు వీరేశలింగం'గా పేరు పొందాడు. తనను విమర్శించి, బహిష్కరించినవారికి ఉన్నవ ఇలా సమాధానం చెప్పాడు : 'ధర్మం ధర్మం అంటారు. ధర్మస్వభావం తెలిసినవారు తక్కువ. 'ఒక కాలంలో ధర్మమైన కార్యం మరో కాలంలో ధర్మ కార్యంగా పరిగణింపబడకపోవచ్చు. ధర్మం అనుష్ఠేయం అనే జ్ఞానం మాత్రం మనుషులకుంటే చాలదు. ధర్మం యొక్క స్వరూపం తెలుసుకొని దాన్ని వ్యాపింపచేయాలి. దురాచారాల నణగదొక్కి సదాచారాలనూ, సంఘ సంస్కరణలనూ వర్ధిల్లచేయడమే నాగరక సంఘ కర్తవ్యం. ఉత్తమ ధర్మాలని బోధించడం, ఆచరించడం నా ఉద్దేశం.'

**ఉన్నవ ఐర్లాండు వెళ్ళడానికి పూర్వం అక్కడి ప్రజలు స్వరాజ్యం కోసం 'హోమ్ రూలు' పోరాటం సాగిస్తున్నారు. ఉన్నవ అక్కడికి వెళ్ళేటప్పటికి అది 'షిన్ ఫాన్' ఉద్యమంగా రూపుదాల్చింది. సహజంగా రాజకీయాల పట్ల అభిరుచి ఉన్న ఉన్నవ దాని చేత ప్రగాఢంగా ఆకర్షింపబడ్డాడు. అక్కడ ఉన్నంతకాలం ప్రతి రాజకీయ సభకూ వెళ్తుండేవాడు.**



ఉన్నవ బంధువుల చేత విమర్శింపబడిన విధానం 'మాలపల్లి'లో రామానాయుడు ఎదుర్కొంటాడు. రామానాయుడు పంచమ, కార్మికుల అభివృద్ధికై ప్రయత్నిస్తూ, సహాయ సహకారాలు అందిస్తుంటే సహించలేని తండ్రి చౌదరయ్య అతడిని విమర్శిస్తుంటాడు.

**శారదా నికేతనం :** ఉన్నవ 1912లో వెంకటప్పయ్య గారితో పూనా పట్టణానికి వెళ్ళి, అక్కడ కార్వే పండితుడు నడుపుతున్న విద్యాలయ పనితీరును పరిశీలించి వచ్చాడు. దీని ఫలితమే శారదా నికేతన ఆవిర్భావం. శారదా నికేతనం ఏర్పాటు చేయడానికి ముందే ఉన్నవ స్త్రీలకు విద్యార్జనావకాశాలు లేకపోవడం మూలంగా, వీరి జీవితాలు అనేక అనర్థాలకు దారి తీసినవని తలంచాడు. అందువల్ల స్త్రీ విద్యార్జనావశ్యకతకు 'మాలపల్లి'లో తగు ప్రాధాన్యత కల్పించాడు.

'మాలపల్లి'లో సంగదాసు తన చెల్లెలు జ్యోతికి చదువుమీద ఆసక్తిని కల్గిస్తాడు. అప్పాదాసు ఈమెను విద్యావంతురాలిని చేస్తాడు. విద్యార్జన మూలంగానే జ్యోతి ఆత్మస్థయిర్యంతో, వివేకంతో సరైన నిర్ణయాల్ని ధైర్యంగా వెల్లడించగలుగుతుంది. 'మాలపల్లి' నవలాంతాన స్త్రీ విద్యకు తగు ప్రాధాన్యమిస్తూ, ప్రథమ తీర్మానం చేయబడుతుంది.

**పంచమోద్ధరణ:** ఉన్నవకు మొదటినుంచీ పంచముల అభివృద్ధిపై శ్రద్ధ ఉంది. 'గాంధీ మహాత్ముని సహాయ నిరాకరణ ఉద్యమానికి పూర్వమే 1918లో నల్లపాటి హనుమంతరావు గారు, పుతుంబాక లక్ష్మీనర్సయ్య, వాసిరెడ్డి సీతారామయ్య గార్ల సహాయంతో పెదపాలెంలో కృష్ణాశ్రమం స్థాపించారు.

ఉన్నవ అమ్మమ్మ గారి ఊరు గుంటూరు జిల్లా బాపట్ల తాలూకా పొన్నూరు ఫర్కాలో ఉన్న ఆరెమండ గ్రామం. దీనికి పక్కనే తాళ్లపాలెమనే చిన్న పల్లె ఉంది. ఇది హరిజనుల వాడ. ఇక్కడి వారందరూ పండితులు. వైద్యం తెలిసినవారు. శాస్త్ర పురాణాలు అధ్యయనం చేసినవారు. వీరు దాసులు. ఈ హరిజనవాడ పవిత్ర వాతావరణంతో ప్రశాంతంగా ఉండేది. ఇక్కడి స్త్రీ పురుషులు శ్రీ వైష్ణవుల వలె పరిశుభ్రంగా ఉండేవారు. ఈ గ్రామమే 'మాలపల్లి' నవలా రచనకు ప్రోద్బలకంగా పని చేసింది. ఈ వాతావరణం 'మాలపల్లి నవలారంభంలో రామదాసు కుటుంబంలో ఉన్నట్లు, నవలాంతాన మంగళాపురం అంతటా వ్యాపించినట్లు వివరించారు.

'శ్రీ కృష్ణాశ్రమం' స్థాపించడానికి పూర్వమే ఉన్నవ.. రేపల్లెలో జరిగిన గుంటూరు జిల్లా సంఘ సంస్కరణ సభకు అగ్రసనాధిపతిగానూ, కొవ్వూర్లో జరిగిన కృష్ణా మండల సంఘ సంస్కరణ సభకు అధ్యక్షుడుగానూ వుండి తన ఉపన్యాసాలతో, చర్చలతో నూతన ఉద్బోధలు కలిగించాడు.

**మద్య నిషేధం:** మద్య నిషేధ విషయంలో ఉన్నవపై గాఢ ప్రభావం వేసింది తిలక్ నడిపిన మద్యపాన నిషేధ ఉద్యమం. నాటి కాలంలో పంచములను, కూలీలను పట్టి పీడిస్తున్న సమస్య మద్యపాన వ్యసనం. దీన్ని రూపుమాపేందుకు నాయకులు తీవ్ర ప్రచారం సాగించారు. ఉన్నవ అభిమాన నాయకుడూ, రాజకీయాల్లో అతి వాదిగా పేరొందిన బాలగంగాధర తిలక్ ఈ మద్యపాన నిషేధాన్ని ఒక ఉద్యమంగా కొనసాగించాడు.

'మాలపల్లి'లో కూడా నారాయణరావు పంతులు మద్యనిషేధానికై తీవ్రంగా ప్రచారం చేస్తుంటే ప్రభుత్వం అరెస్టు చేసి, శిక్ష విధిస్తుంది. నారాయణరావు పంతులుతోపాటు పలువురిని మద్యపాన నిషేధాన్ని ప్రచారం చేస్తున్నందుకు గాను ప్రభుత్వం వారిపై తప్పుడు కేసులు పెట్టి నిర్బంధాల పాలు చేస్తుంటుంది.

**రాజకీయాభినివేశం:** విద్యాభ్యాసం తర్వాత ఉపాధ్యాయ వృత్తిలోకి ప్రవేశించిన ఉన్నవ రాజ కీయాలతో జోక్యం పెట్టుకోగూడదనే నిబంధన కారణంగా ఉపాధ్యాయ వృత్తిని వదిలి పెట్టాడు. తర్వాత 'ర్యాలీ బ్రదర్స్'లో పనిచేస్తున్న కాలంలోనూ ఇలాంటి నిబంధనల వల్లనే ఉద్యోగాన్ని వదులుకొంటాడు. వ్యక్తి స్వాతంత్ర్యానికి భంగం కలిగేచోట్లలో ఉన్నవ ఉండేవాడు కాదు. రాజకీయంగా దేశంలో మార్పు రావాలనుకొనే స్వభావం ఉన్నవది. ఈ భావాలు 'మాలపల్లి'లో పలుచోట్ల వ్యక్తం అవుతాయి.

ఉన్నవ తన జీవితంలో జరిగిన రాజకీయ సంబంధమైన కొన్ని సంఘటనలు మాలపల్లిలో వ్యక్తం చేశాడు. అవి : 1. ఐర్లాండ్లో ఉన్నత విద్య 2. నిర్మాణ కార్యక్రమాల ప్రచారం 3. సహాయ నిరాకరణం 4. బోల్షివిజం 5. స్వరాజ్య భావన.

**ఐర్లండ్ ఉన్నత విద్య :** అప్పటివరకూ చేసిన ఉద్యోగాల్ని వదలిన ఉన్నవ ప్లీడరీ పూర్తి చేసి స్వతంత్ర జీవనం గడుపుతుంటాడు. ఇది కూడా రుచించక బారిష్టర్ చదువుకై ఐర్లాండు వెళ్లాడు. ఆనాడు ఉన్నత విద్యకై చాలామంది ఇంగ్లండు వెళుతున్న తరుణంలో, రాజకీయంగా స్వాతంత్ర్యం కోసం పోరాడుతున్న ఐర్లాండును ఎన్నుకోవడంలో రాజకీయాల పట్ల ఉన్నవకు గల మక్కువ తెలుస్తుంది.



ఉన్నవ ఐర్లాండు వెళ్ళడానికి పూర్వం అక్కడి ప్రజలు స్వరాజ్యం కోసం 'హోమ్ రూలు' పోరాటం సాగిస్తున్నారు. ఉన్నవ అక్కడికి వెళ్ళేటప్పటికి అది 'షిన్ ఫాన్' ఉద్యమంగా రూపుదాల్చింది. సహజంగా రాజకీయాల పట్ల అభిరుచి ఉన్న ఉన్నవ దాని చేత ప్రగాఢంగా ఆకర్షింపబడ్డాడు. అక్కడ ఉన్నంతకాలం ప్రతి రాజకీయ సభకూ వెళ్తుండేవాడు. అక్కడి ఉద్యమ నాయకుడైన 'డీనెలరా'తో పరిచయం పెంచుకున్నాడు. సెలవుల్లో స్వదేశానికి వచ్చిన ఉన్నవ గుంటూర్లో జరిగిన ఒక సభకు అధ్యక్షత వహించి 'రాజకీయ స్వాతంత్ర్యం లేనిదే ఇతర సంస్కరణలేవీ అభివృద్ధి కావనీ, ఐరిష్ ప్రజల వలె భారతీయులు స్వరాజ్యాన్ని సాధించాలనీ' కర్తవ్యోపదేశం చేశాడు. ఐర్లాండు వెళ్ళిన ఉన్నవలోని భావాలు ఈ విధంగా తీవ్ర మార్పును పొందాయి. 'మాలపల్లి'లో ఇదే భావాన్ని వకీలు నారాయణరావు పంతులు చేత 'స్వరాజ్యం రానిదే ఉద్యమాలూ సాగవు' అనిపిస్తాడు. ఉన్నవలో గాఢంగా నెలకొని ఉన్న స్వాతంత్ర్య సంపాదనా భావమే 'మాలపల్లి' నవలలో రాజకీయ చిత్రణకు కారణం.

**నిర్మాణ కార్యక్రమ ప్రచారం:** ఐర్లాండు నుంచి తిరిగి వచ్చిన తర్వాత ఉన్నవ మద్రాసులో న్యాయవాద వృత్తి నవలంబించి, ధనార్జన ప్రధాన ధ్యేయంగా పెట్టుకొనక ఆనాటికి పేరు పొందిన నాయకులతో సంబంధం పెట్టుకొని, రాజకీయ, సాంఘికోద్యమాల్లో చురుకుగా పాల్గొన్నాడు. నిర్మాణ కార్యక్రమాలకు ప్రాధాన్యం ఇచ్చాడు.

ఉన్నవ వలెనే నవలలో రామానాయుడు అనేక గ్రామాల్ని సందర్శిస్తూ ఉపన్యాసాల ద్వారా, గ్రంథాలయ, పాఠశాలాది నిర్మాణ ప్రోత్సాహాల ద్వారా పల్లె జనులను జాగృతం చేస్తుంటాడు.

**సహాయ నిరాకరణ ఉద్యమం :** ఉన్నవ సంఘ సంస్కరణ, రాజకీయోద్యమాల్లో చురుకుగా పాల్గొంటున్న సమయంలోనే, గాంధీ మహాత్ముని సహాయ నిరాకరణ ఉద్యమం దేశంలో వ్యాపించింది. గాంధీ భావాల చేత ఆకర్షింపబడిన ఉన్నవ 'సహాయ నిరాకరణ' పిలుపునందుకొని తన బారిష్టర్ వృత్తిని వదులుకొంటాడు. ఈ ఆచరణ నవలలో – నారాయణరావు పంతులు పాత్రలో కనిపిస్తుంది. అతడు కార్మికులతో సంఘాలు ఏర్పరచి స్వాతంత్ర్య సంపాదనకై పోరాడమని ప్రబోధిస్తుంటాడు. వెంకటదాసు కేసు విచారిస్తున్న కలెక్టరు కూడా 'ఈ కేసులు పూర్తి కాంగనే వదిలి ఈ నవుకరీ వదిలి పెడతాను.' అనటంవల్ల సహాయ నిరాకరణోద్యమం మాలపల్లిలో ప్రత్యక్షంగా చోటు చేసుకున్న వైనం తెలుస్తుంది.

**గాంధీ అసహాయోద్యమాన్ని అవలంబించినట్లయితే ఒక్క ఏడాదిలోగా స్వరాజ్యం వచ్చి తీరుతుందని ఉన్నవ జైలుకు వెళుతున్నప్పుడు చెప్పాడు. నవలలో రామానాయుడు జైలుకు వెళుతున్నప్పుడు .. అతడి నోట ఈ మాటే అనిపిస్తాడు. జైల్లో ఉన్న ఉన్నవకు స్వరాజ్యం ఎలా ఉండాలి అన్న తపన మొదలవుతుంది. స్వరాజ్యం సమతా రాజ్యంగా ఉండాలని కలగంటాడు.**

**బోల్షివిజం :** 'రష్యాలో బోల్షివిక్కులు స్వాతంత్ర్యాన్ని సంపాదించుకొని, ప్రజాప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకొన్నారు. ఈ భావాలు ఉన్నవలో ఉన్నాయి. అందుకే బోల్షివిక్ పార్టీ ప్రస్తావన 'మాలపల్లి'లో ప్రధానంగా చేయబడింది. ఈ భావాలు వెంకటదాసు మాటల్లో వినిపిస్తాయి. పాత్ర చిత్రణా విధానాన్నిబట్టి ఉన్నవకు సమకాలీన ప్రపంచ రాజకీయ ఉద్యమాలపై గల అవగాహన ఎంత లోతైనదో తెలుస్తుంది.

**స్వరాజ్య భావన :** ఉన్నవ జైలుకు వెళుతున్నప్పుడు గాంధీ మహాత్ముడు అసహాయోద్యమాన్ని అవలంబించినట్లయితే ఒక్క ఏడాదిలోగా స్వరాజ్యం వచ్చి తీరుతుందని గట్టిగా చాటి చెప్పాడు. నవలలో రామానాయుడు జైలుకు వెళ్ళుతూ, వెంకటయ్యతో 'నే వచ్చే ఆరునెలల్లోగా స్వరాజ్యం వచ్చి తీరుతుందం'టాడు. జైల్లో ఉన్న ఉన్నవకు స్వరాజ్యం ఎలా ఉండాలి అన్న తపన మొదలవుతుంది. స్వరాజ్యం సమతా రాజ్యంగా ఉండాలని కలగంటాడు.

ఈ రీతిగ నవలలో రాజకీయాలకు ప్రవేశం కల్పించిన ఉన్నవ జాతీయోద్యమ స్ఫూర్తిని కలిగించే భావాలతో 'మాలపల్లి'ని తీర్చిదిద్దాడు. తన రాజకీయ జీవితాన్ని 'మాలపల్లి'లో అద్దం పట్టాడు. ఉన్నవ తరువాతి జీవితంలోనూ రాజకీయాలు అత్యంత ప్రాధాన్యత పోషించాయి.

**మతాభిమానం :** ఉన్నవ పరమత సహనం, స్వమతాభిమానం కలవాడు. ఆధ్యాత్మిక భావాలు కూడా ఉన్నవలో కనిపిస్తాయి. ఆయన ఆధ్యాత్మిక భావాలు, సహనం 'మాలపల్లి'లో రామదాసు పాత్ర ద్వారా వ్యక్తమవుతాయి. రామదాసు తన ఆస్తి మీద చౌదరయ్య దావా వేసినపుడు తాటస్థ్యం వహిస్తాడు. నిస్వార్థ దృష్టితో వ్యవహరిస్తుంటాడు. ప్రతి సమస్యతోనూ సన్నిహిత పరిచయాన్ని పెంపొందించుకొని మానవతా వాదిగా, ఆదర్శ మానవుడిగా అందరి మన్ననలూ పొందుతాడు. ఉన్నవలో మూర్తీభవించిన పలు లక్షణాలు రామదాసు పాత్రలో కనిపిస్తాయి.

ఈ విధంగా ఉన్నవ తన జీవితంలో ఒనరించిన సంఘ సంస్కరణాది కార్యక్రమాలను, ఉద్దేశాలను, ఎదురైన కష్టనష్టాలను 'మాలపల్లి' నవలలో వివిధ పాత్రలు, సంఘటనల ద్వారా ఆవిష్కరించాడు. ఇలా ఉన్నవ సమగ్ర వ్యక్తిత్వ వికాసం 'మాలపల్లి' వంటి ఇతిహాసం ఆవిర్భవించడానికి పూర్వరంగంగా పని చేసింది. ■



# మాలపల్లిలో భాగ్యరెడ్డివర్మ

## ఇతివృత్తంలో విశాలతత్వం

□ కె.శ్రీనివాస్

"భాగ్యరెడ్డి వర్మ గురించి తెలుసుకోవాలంటే- మాలపల్లి నవల చదువు అని నాకు మా గురువు గారు కెకె రంగనాధాచార్యులు చెప్పారు. మాలపల్లిలో ఆ రోజు బెజవాడలో పంచముల సభ అయిన తరువాత సభాపతి రెడ్డి గారు హైదరాబాదు వెళ్లిపోయారు అనే మాట ఉంటుంది. ఆ హైదరాబాదు రెడ్డి ఎవరని పరిశీలిస్తే మనకు అది భాగ్యరెడ్డి వర్మ అని అర్థమవుతుంది. ఆయన 1906 నుంచి హైదరాబాదులో అనేక సామాజిక, సేవా కార్యక్రమాలు చేశారు. జగన్మిత్రమండలి పేరిట కార్యకలాపాలు చేపట్టారు. సామాజిక ఉద్యమ కృషి చేత ఆయన పేరు చాలా ప్రాంతాల్లో మారుమోగుతోంది. అందుకే 1917లో జరిగిన బెజవాడ సభకు భాగ్యరెడ్డి వర్మను సభాధ్యక్షుడిగా ఎన్నుకున్నారు."

మాలపల్లి నవల వచ్చే సమయానికి జాతీయోద్యమంలో గాంధీ ఇంకా పూర్తిగా స్థిరపడలేదు. గాంధీని ఉద్యమానికి నాయకుడిగా స్థిరపరచిన కాలం జలియన్ వాలా బాగ్ ఉదంతం మొదలుకొని 1922 మార్చి సహాయ నిరాకరణ ఉద్యమం దాకా ఉంది. గాంధీ కన్నా ముందు తరం తెలుగువారు కొండా వెంకటప్పయ్య, అయ్యదేవర కాళేశ్వరరావు, ఉన్నవ లక్ష్మీనారాయణ వంటి వారు జాతీయోద్యమంలో ఉన్నారు. ఉన్నవ వారి రాజకీయ ఆచరణలో భాగంగా మాలపల్లి నవల వచ్చింది. నేడు రకరకాల అస్తిత్వవాద ఉద్యమాలు రంగంలో ఉన్న సందర్భంలో ఈ నవలపై రకరకాల అంచనాలను, వ్యాఖ్యలను మనం చూస్తున్నాం. ఆ విషయాన్ని పక్కన పెడితే- అందరూ ఒప్పుకోవాల్సిన సాంకేతికమైన వాస్తవాలు కొన్ని ఉన్నాయి. వాడుక భాషలో రాసిన తొలితరం నవలల్లో ఇదొకటి. మాలపల్లి రాజకీయ నవల. వర్తమాన చారిత్రిక నవల. దళిత నాయకత్వం ఉన్న నవల. రష్యా విప్లవాన్ని ప్రతిఫలించిన నవల.

జాతీయోద్యమం నడుస్తున్న కాలంలో ఆంధ్రాలో ఉన్నవ వంటి వారు అందులో భాగస్వాములు అవుతున్న కాలంలో - తెలంగాణా ప్రాంతంలో ఏం జరుగుతోంది? తెలంగాణాలో నైజాం పాలన నడుస్తోంది. అక్కడ జాతీయోద్యమం జరిగే అవకాశం లేదు. అక్కడ సాగాల్సింది నైజాము వ్యతిరేక, నియంతృత్వ వ్యతిరేక ఉద్యమం. ఆ ఉద్యమానికి కావాల్సిన అవగాహన కానీ, చైతన్యం కానీ, సంసిద్ధత కానీ అప్పటికి అక్కడి సమాజంలో లేదు. ఆ చైతన్యం కోసం 1920 గ్రంథాలయోద్యమంతో మొదలుకొని క్రమంగా తనను తాను వికసింపచేసుకునే ప్రయత్నం చేసింది. ఆ ప్రయత్నాలు 1930, 35 దాకా కొనసాగి, ప్రజాహితరంగం ఏర్పడింది. సభలూ సమావేశాలూ పెట్టుకోవడం, ప్రభుత్వానికి వినతులూ విజ్ఞప్తులు చేయడం దశ నుంచి అది తరువాత క్రమంగా పోరాటాల దశకు వచ్చింది. తెలంగాణా సాయుధ పోరాటంగా పరిణమించింది.

దానికన్నా ముందు నుంచే తెలంగాణాలో సామాజిక ఉద్యమాలు ఉన్నాయి. సామాజిక చలనం ఉంది. అప్పుడు అలాంటి కృషి చేసిన వ్యక్తులుగా రావిచెట్టు రంగారావు, మాడపాటి హనుమంత రావు, భాగ్యరెడ్డి వర్మ వంటి పేర్లు మనకు కనిపిస్తాయి. ఇందులో భాగ్యరెడ్డి వర్మ వీరందరితో సంబంధాలు కలిగి ఉంటూనే భిన్నమైన సేవారంగం, భిన్నమైన ఆచరణ ఎంచుకొని కృషి చేశారు. ఈ భాగ్యరెడ్డి వర్మ గురించి తెలుసుకోవాలంటే- మాలపల్లి నవల చదువు అని నాకు మా గురువు గారు కెకె రంగనాధాచార్యులు చెప్పారు. మాలపల్లిలో ఆ రోజు బెజవాడలో పంచముల సభ అయిన

⌘ వందేళ్ల మాలపల్లి సభలో ప్రసంగానికి అక్షరరూపం ఈ వ్యాసం.



**నవలలో పాత్రగా పేర్కొన్న రామేశ్వరరావు గారే నిజజీవితంలో అయ్యదేవర కాళేశ్వరరావు గారు. నవలలో ఉన్న వర్ణన, కాళేశ్వరరావు గారు ఆత్మకథలో చేసిన వర్ణన ఒకేలా ఉన్నాయి. దీనినిబట్టి ఆ వెంకటరెడ్డే భాగ్యరెడ్డి వర్మ అని రూఢి అవుతుంది. ఆ సభలో ఏ తీర్మానాలు చేశారని అయ్యదేవర రాశారో అవే తీర్మానాల వివరాలు నవలలోనూ ఉన్నాయి.**

తరువాత సభాపతి రెడ్డి గారు హైదరాబాదు వెళ్లిపోయారు అనే మాట ఉంటుంది. ఆ హైదరాబాదు రెడ్డి ఎవరని పరిశీలిస్తే మనకు అది భాగ్యరెడ్డి వర్మ అని అర్థమవుతుంది. ఆయన 1906 నుంచి హైదరాబాదులో అనేక సామాజిక, సేవా కార్యక్రమాలు చేశారు. జగన్మిత్రమండలి పేరిట కార్యకలాపాలు చేపట్టారు. 1917లో విజయవాడలో ఆదిమాంధ్ర పంచముల మహాసభ జరిగింది. అప్పటికి భాగ్యరెడ్డి వర్మ వయసు 28 ఏళ్లు. అప్పటికే సామాజిక ఉద్యమ కృషి చేత ఆయన పేరు చాలా ప్రాంతాల్లో మార్మోగుతోంది. అందుకే బెజవాడ సభకు భాగ్యరెడ్డి వర్మను సభాధ్యక్షుడిగా ఎన్నుకున్నారు.

ఉన్నవ అప్పటికి ప్రాచుర్యంలో ఉన్న అన్ని రకాల భావాలకు తన నవలలో అవకాశం కల్పించారు. రామదాసు ఇద్దరు కొడుకుల్లో సంగదాసు మితవాది. తక్కెళ్ల జగ్గడిగా మారిన వెంకటదాసు బోల్షివిజానికి ప్రతినిధి. ఈ సంగదాసు విజయవాడ పంచముల సభకు వచ్చి భాగ్యారెడ్డి వర్మను (వెంకటరెడ్డి పాత్ర) కలుస్తాడు. సంగదాసు మృదువుగా, సాత్వికంగా మాట్లాడతాడు. వెంకటరెడ్డి చాలా అంశాల్లో తీవ్రమైన భావాలు కలిగి ఉంటాడు. బోల్షివిక్కు విప్లవానికి సంబంధించిన అనేక విషయాలను వెంకటరెడ్డి పాత్ర చేత చెప్పించాడు ఉన్నవ. ఇది కాల్పనిక పాత్ర అని మనం అనుకోవొచ్చు. కానీ, విజయవాడలో జరిగిన ఆ సభ నిర్వహణకు దోహదం చేసిన, అందులో పాల్గన్న అయ్యదేవర కాళేశ్వరరావు గారి "నా జీవితము – నవ్యాంధ్రము" అన్న ఆత్మకథ చదివితే– మాలపల్లి నవలలోని సమకాలీన అంశాలు వాస్తవమే అని అర్థమవుతుంది. బెజవాడలో ఆరోజు ఏం జరిగిందో ఆయన చాలా విపులంగా రాశారు. "మాంటెగ్యూ గారు మదరాసు వస్తున్నందున వారిని పంచముల ప్రతినిధులు కలుసుకొని, శాసనసభలలో పంచములకు ప్రత్యేక ప్రాతినిధ్యము కావలెనని అడుగుటకు, పంచముల ఇక్కట్ల గురించి వివరించుటకు ఆంధ్ర పంచముల సభ ఒకటి బెజవాడలో జరుపుదామని వీరందరూ మా ఇంట్లోనే సమావేశమై నా సలహా మేరకు నిర్ణయించిరి. అందుకు ఆహ్వాన సంఘ అధ్యక్షుడిగా చంద్రు వెంకయ్యా గారు ఎన్నుకోబడిరి. వారందరి అభిప్రాయం ప్రకారం.. హైదరాబాదులో సుప్రసిద్ధ ఆదియాంధ్ర నాయకుడగు భాగ్యరెడ్డి వర్మ గారిని మహాసభకు అధ్యక్షత వహించుటకు తీసుకొని వచ్చితిమి. నా పెద్ద గుర్రపు బగ్గీలో భాగ్యరెడ్డి వర్మ గారిని, చంద్రు వెంకయ్య గారిని కూర్చొనబెట్టి, మేమందరమూ నడిచి, వందలకొలదీ పంచమ ప్రతినిధులు వెంట రాగా, బెజవాడ పురవీధుల్లో ఊరేగించితిమి. ఆంధ్రదేశమున పంచములను ఇకనుంచి ఆదియాంధ్రులు అని పిలువవలెనని, ఆదియాంధ్రులను రామిగాడు, సుబ్బిగాడు అని నీచమైన విధముగా పిలువరాదని, రామయ్య, సుబ్బయ్య అని మాత్రమే పిలువవలెనని, అటులనే సర్కారు లెక్కలలో రాయవలెనని తీర్మానించితిమి. భాగ్యరెడ్డి వర్మ గారి ఉపన్యాసము గంభీరముగా ఉండెను. ఆదియాంధ్రుల ఇక్కట్లను గూర్చి వారు వివరించిరి." అని రాశారు.

ఇదే వర్ణన మాలపల్లిలోనూ కనిపిస్తుంది. అది ఈ విధంగా ఉంది : "సభ పది గంటలకు జరుగుతుందని బెజవాడంతా తెలిసింది. సభాపతి గారి వూరేగింపునకు రామేశ్వరరావు గారు బ్యాండు మేళం యేర్పాటు జేసి వాండ్ల దగ్గర నుంచి చేవ్రుత్తరం పుచ్చుకున్నారు. రామేశ్వరరావు గారి గుర్రపు బండెక్కి మాలమాదిగలు మేళంతో ఊరేగుతారని ఊరంతా విడ్డూరంగా చెప్పుకుంటున్నారు. మహామంత్రి నాటి కట్టుబళ్ళ ప్రకారం వూరేగింపుకు ఆటంకపెడదామని పండితులు యోచిస్తే, అడ్డు నేరమవుతుందని ప్లీడర్లు సలహా చెప్పినారు. అన్నశ్రాద్ధం బెట్టే కొందరు వైశ్యులు పూర్వాచార పరాయణులైన వకీళ్ళ దగ్గరకు పోయి వ్యాజ్యం దాఖలు జేసి వూరేగింపు కాకుండా ఇంజక్షను ఇప్పించమని కోరితే ప్రయోజనం లేదని చెప్పారు. ఊరేగింపు బయలుదేరింది. వెంకటరెడ్డి గారూ, సంగదాసు గారూ బండిమీద కూర్చున్నారు. అభిమానులంతా బండికి ముందు నడిచారు. ముందాయన మాలశాస్త్రులనీ, వెనుకాయన మాలపంతులనీ, నడిపాయన మాల చౌదరనీ వేళాకోళాలు సాగించారు.

.... తరువాత సభాపతి గారు సభికుల కరతాళధ్వనులు చెలరేగుతుండగా సభాధిపత్యం వహించి ఉపన్యాసం ప్రారంభించారు. తనను సభాపతిగా యెన్నుకున్నందుకు ఆహ్వాన సంఘము వారికి కృతజ్ఞత తెలిపి దిగువ జాతుల పూర్వ చరిత్రం వినిపించి ప్రస్తుత దీనస్థితిని కరుణారస మొలికేటట్లుగా వర్ణించి ఉద్యమం యొక్క వ్యాప్తిని నిర్వచించి .. గంభీరోపన్యాసం జేశారు."

నవలలో పాత్రగా పేర్కొన్న రామేశ్వరరావు గారే నిజజీవితంలో అయ్యదేవర కాళేశ్వరరావు గారు. నవలలో ఉన్న వర్ణన, కాళేశ్వరరావు గారు ఆత్మకథలో చేసిన వర్ణన ఒకేలా ఉన్నాయి. దీనినిబట్టి ఆ వెంకటరెడ్డే భాగ్యరెడ్డి వర్మ అని రూఢి అవుతుంది. నవలలో వెంకటరెడ్డి నోట చెప్పించిన భావాలన్నీ భాగ్యరెడ్డి వర్మవి అనుకోవచ్చునా? ఆ సభలో ఏ తీర్మానాలు చేశారని అయ్యదేవర రాశారో అవే తీర్మానాల వివరాలు నవలలోనూ ఉన్నాయి.

నవలలో వెంకటరెడ్డి ప్రసంగం ఇలా సాగుతుంది : "ఋష్యా దేశంలో (సోవియట్) పంచాయతీ ప్రభుత్వం స్థాపించబడ్డది. వీరి ఉద్యమానికి బోల్షివిజమని పేరు. బోల్షివిజమనగా విశేష జనుల యొక్క అభిప్రాయమని అర్థం. దాని ప్రకారంగా ప్రభుత్వం జరగ వలయునని వారి ఆదర్శం. ఋష్యా దేశంలో 'జనులకు వ్యవసాయమే జీవనం. భూములు చాలాభాగం వ్యవసాయం చేయని జమీందారుల చేతుల్లోనూ, భూస్వాముల చేతుల్లోనూ పడ్డవి. ప్రభుత్వములో ప్రజలకు యేవిధమయిన పలుకుబడీ లేదు. జారు చక్రవర్తి నౌకరుల యొక్కయు, జమీందారుల యొక్కయూ, ధనికుల యొక్క చేతుల్లో కీలుబొమ్మయి వారి కోరికెల ప్రకారం మహా జనులను బాధించాడు. ఈ దుష్ప్రభుత్వం వంద సంవత్సరాలకు పైగా సాగింది. జనులు దుర్భరమైన దరిద్రంలో మునిగారు. తుదకు మొన్నటి ఐరోపా యుద్ధ సమయంలో నౌకరు వర్గం, ధనికవర్గం సజారంగా కొల్లేరు కుంగినట్టు కుంగింది. పంచాయతీ ప్రభుత్వ మేర్పడి గ్రామ ప్రభుత్వానికీ, జిల్లా ప్రభుత్వానికి, రాష్ట్ర ప్రభుత్వానికీ, దేశ ప్రభుత్వానికి పంచాయతీ వర్గాలేర్పడ్డవి. "

"... సోవియటు వర్గం వారు ప్రత్యేక వ్యక్తుల హక్కును తొలగించి, మంది హక్కుగా మార్చి, మంది తరపున భూములన్నీ స్వాధీనపరచుకొని కేవలం స్వంతజేతితో వ్యవసాయం చేయువారికే వారు చేయగలంత వరకు విడదీసి జనులలో పంచిపెట్టారు. కోటీశ్వరుల భవనములు, ధనమూ, యంత్రాగారములూ మంది తరపున సోవియటు సర్కారు వారు స్వాధీనపరచుకొని పని జరిపిస్తు న్నారు. దేశంలో భాగ్యవంతులకు గానీ, బీదలకుగాని స్వంత హక్కులుండగూడదు. దేశంలో వుండే యావత్తు ధనం మంది సొమ్మే. మంది పంచాయతీ సర్కారు ద్వారా యంత్రములనూ, వ్యవసాయ మునూ అజమాయిషీ చేసి వచ్చే ఆదాయంలో నుండే దేశజను లెవ్వరికీ అన్నలోపం లేకుండా పంచి పెడుతుంది. "

ఇలా సోషలిజం యొక్క సారాంశాన్ని ఆయన అర్థం చేసుకున్నంత మేరకు ఉన్నవ వెంకటరెడ్డి పాత్ర ద్వారా చెప్పారు. ఈ నవలలో సోషలిస్టు వ్యవస్థను వివరించే గేయం కూడా ఒకటి ఉంది. అది తక్కెళ్ల జగ్గడి తత్వంగా ప్రచారం జరుగుతుంది. ఒకనాడు ఉండిన వర్గరహిత సమాజం గురించి ఈ పాట వివరిస్తుంది. వెంకటరెడ్డి మాటల్లో రష్యాలోని సోవియట్ సమాజం గురించి చెబుతాడు. ఈ బోల్షివిక్కు తాకిడికి ప్రపంచంలో ఎవరు నిలబడతారు? వారు ఏం చేయబోతున్నారు? ఈ విషయాలను కూడా మాలపల్లిలో వెంకటరెడ్డి ప్రసంగంలో వివరించారు.

"ఈ బోల్షివిక్కు సిద్ధాంతాలు ప్రస్తుతం అమలులో వున్న స్వామ్య సిద్ధాంతాల కన్నిటికీ వ్యతిరేకం. లెనిన్ ప్రభృతులు ఈ సిద్ధాంతాలను తమ దేశంలో స్థాపించడమే కాకుండా ప్రపంచమంతటా వ్యాపింప జేస్తామని ఢంకా బజాయిస్తున్నారు. అందుకొరకై కోట్లద్రవ్యం ఖర్చు పెడుతున్నారు. పూర్వపు రష్యా చక్రవర్తులు జయించిన పర రాష్ట్రాలకు పంచాయితీ సర్కారు స్వాతంత్ర ప్రదానం చేసి మా రాజుల పాపమును క్షమింపుడని కోరుతున్నారు. ఈ రాష్ట్రాల్లో సోవియట్ ప్రభుత్వాలు స్థాపించబడుతున్నవి. బోల్షివిక్ భావాలు చెద పురుగులవలె తమ కందిన పాత ప్రతిష్ఠాపన అన్నిటినీ భగ్నం చేస్తున్నవి. జర్మను, ఆష్ట్రియా దేశముల కదివరకే వ్యాపించినవి. అమెరికా, ఫ్రాన్సు దేశాల్లోని ధనికవర్గాలు కంపం బొందుతున్నవి. బోల్షివిక్కులు ఇంగ్లండు దేశం మీద తమ దృష్టి సారించారు. బోల్షివిక్ భావ తరంగాలు ఆంగ్ల మానస కాసారములను చలింపజేస్తున్నవి. ఆంగ్ల ధనికవర్గం ఈ భావాలను రాకుండా కొట్టవలసిందని ఉ ద్ఘోషిస్తున్నది. భావాలను ఫిరంగులు యెట్లా కొట్టగలవని ప్రభుత్వం వారంటున్నారు. ఆంగ్లరాజ్య ప్రకృతి మిక్కిలి పురాతనమైన వాట్లలో వొకటి. ప్రభుత్వం వారు ఈ పాత కట్టడాన్ని బూజు దులిపి మరమ్మతు చేయడానికి ప్రయత్నిస్తున్నారు. స్త్రీలకు యెన్నిక అధికార మియ్యబడ్డది. ప్రభు సంఘాన్ని ఎన్నిక పద్ధతుల ప్రకారం యేర్పరచ వలెనని ప్రయత్నిస్తున్నారు. ప్రజాసంఘంలో కొత్త ఎన్నికలు జరిగితే కూలీ సభికుల సంఖ్య యెక్కువ కావడం నిశ్చయం. కూలీ ప్రభుత్వం ఏర్పడి ఆంగ్లదేశంలో ఏ మార్పులు వస్తవో, ఇండియా ప్రభుత్వాన్ని ఎట్లా మారుస్తారో చెప్పలేము. బీదలకు ప్రభుత్వం వారు ఇండ్లు కట్టించి యిస్తున్నారు. గనికూలీలు యీ మధ్య గట్టిన సమ్మె దేశమంతా పరవంజి, గనులను నీళ్లలోనూ, దేశాన్ని విప్లవంలోనూ ముంచివేస్తుందని భయపడ్డారు. తక్కిన కూలీ సంఘాలు కూడా వొక్క మదుపును గనికూలీలతో చేరినట్లయితే ఐదు నిమిషాల్లో ఆంగ్లదేశం రెండవ రష్యా అయిపోయేదే. అటువంటి స్థితి రాకుండా యజమానులూ, కూలీలు రాజీపడుతున్నారు. బోల్షివిక్కు తాకుడుకు ఆంగ్లరాజ్య ప్రకృతి వొక్కటి మాత్రమే నిలువగలదని తోస్తుంది. జనులలో అన్ని సంఘాలకు ప్రభుత్వంలో పలుకుబడి వుంది." అని సానుకూలంగా చెబుతూనే – చివరికి ... " ... కొత్త లాభాలతో పాటు కొత్త చిక్కులు గూడా వస్తవని గమనించగలరు. మనము విప్లవ మార్గాలకు దిగకూడదు. ఇంగ్లండులో ఏర్పడుతున్న పద్ధతులననుసరించి అది అడుగు వేయడం ఉత్తమ మార్గం. భూస్వాముల నందరినీ భూములు అందరికీ పంచి పెట్టమంటే అంగీకరిస్తారా? అది మనం కోరడమూ భావ్యం కాదు. మనము పారమార్థికం విచారించినప్పుడు వారు కూడా న్యాయానికి కట్టుబడి పండే పంటలో కూలీలకు తగిన భాగం ఇయ్యడానికి, పోరంబోకుల లోనూ, అడవులలోనూ సారవంతమైన భూములను దిగువ జాతులకు దరఖాస్తుల మీద యివ్వడానికి రంగీకరించవలసి ఉ ంటుంది. మన విద్యను అభివృద్ధి చేయవలసిన బాధ్యత ధనికులదీ, ఈ విషయమై యికమీద వారెంత మాత్రం అశ్రద్ధ చేయ గిట్టదు! దేశపాలనంలో కూలీలకు అర్హస్థానమియ్యవలసిందని కోరడము యెక్కువ కోరిక గాదు. మన ఉద్యమం పవిత్రమైనది. దానియందు ద్వేషభావాలకు చోటు లేదు." అని చివరికి బోల్షివిక్కు మార్గానికి మనం వెళ్లరాదంటూ ఉద్బోధిస్తాడు. ధనికులే ప్రజలకు ఇవ్వాల్సిన వాటాను ఇవ్వాలని మధ్యేమార్గాన్ని సూచిస్తాడు.

తరువాత సంగదాసు ఈ సభలో తీర్మానాలు చదువుతాడు. ఆ తీర్మానాలను సంగదాసు, వెంకటరెడ్డి తయారు చేసినట్టు దానికి ముందు నవలలో ప్రస్తావన ఉంటుంది. అంటే బెజవాడ ఆదియాంధ్ర పంచముల సభ తీర్మానాలను రూపొందించటంలో భాగ్యరెడ్డి వర్మ పాత్ర ఉందని చాలా స్పష్టంగా తెలుస్తోంది. ఆనాటి అస్తిత్వ ఉద్యమాలకు ఏఏ డిమాండ్లు ఉన్నాయో అవి తీర్మానాల్లో ప్రతిఫలించాయి.

సంగదాసు చదివిన తీర్మానాలు : 1. మనం సంఘము వారు నీచమైన పేర్లు పెట్టుకోకూడదనీ, తమ పేర్లకు అన్నా, అప్పా, అయ్యా, అమ్మా, అక్కా మొదలైన మర్యాదవాచకాలను

చేర్చుకోవలసిందనీ, వొకరినొకరు మర్యాదగా పిలుచుకోవలసిందనీ, అట్లు చేయకపోవడం మన ఆత్మగౌరవానికి భంగమనీ; 2. మన పిల్లలందరికీ సామాన్య విద్యా, వృత్తి విద్యా విధిగా నేర్పించ వలసినదని సభవారు కోరుతున్నారు. 3. మన సంఘీయులు వృత్తి గౌరవం గలిగి, నేతా, చర్మకార వృత్తి వృద్ధిచేసి మన సంఘము యొక్క అర్థస్థితి బాగుచేయవలసిందని ఈ సభవారు సిఫార్స్ చేస్తున్నారు. 4. సంఘ గౌరవానికి లోపంగానూ, అర్థాభివృద్ధికి భంగకరంగానూ వున్న మద్యపానాది దుర్వ్యసనములను మానివేయ వలసిందని దృఢాభిప్రాయమును నొక్కి వక్కాణిస్తున్నారు. 5. ఆరోగ్యాభివృద్ధికిగాను స్నానం మొదలైన శౌచ పద్ధతులను విధిగా పాటించవల్సిందని సంఘము వారిని యీ సభవారు మరీ మరీ హెచ్చరిస్తున్నారు. జీతగాండ్లకూ, యితర కూలీలకూ ఓట్లిచ్చు అధికారం యివ్వవలసిందని సభవారు కోరుతున్నారు. 7. అడవుల్లో వ్యవసాయానికి పనికివచ్చే భూములను దిగువ జాతులకు మాత్రమే దరఖాస్తులు కిప్పించవలసిందని కోరుతున్నారు. ఇదివరకు పంచములకని ఇస్తున్న భూములు చాలావరకు పంచమ క్రైస్తవులకే చెందుతున్నందువల్ల హిందూ పంచముల సంఖ్యను బట్టి వారి భాగానికి రాదగిన భూములను వారికే యిప్పించవలసిందని యీ సభవారు ప్రార్థిస్తున్నారు. 9. ఇండ్ల నిమిత్తం స్థలములూ, ఇండ్లు కట్టుకొనుటకు ద్రవ్యసహాయం యిప్పించవలసిందని యీ సభవారు కోరుతున్నారు. 10. పై తరగతులవారు విద్యాధికులై ఉన్నతోద్యోగాలను ఆక్రమించుకొని వున్నందువల్లనూ, దిగువ తెగల కింతలో ఆ స్థితి లభించే ఆశలేనందువల్లనూ పోలీసూ, రెవిన్యూ, సివిలూ, ఫారెస్టూ, మిలటరీ మొదలగు శాఖల్లో స్వల్ప ఉద్యోగాలను దిగువ జాతులకు ఆపుదల చేయించవలసిందని యీ సభవారు ప్రార్థిస్తున్నారు. 11. మంది సొమ్ము ఉపయోగించి ఏర్పరిచిన విద్యాలయాలు, బావులు, చెరువులు, సత్రాలు, దేవాలయాలు మొదలైన వాటిలో దిగువ తరగతుల హక్కులను అంగీకరించ వలసిందనీ, వాటిలో కొన్నిటిని ప్రస్తుతం వారికై ప్రత్యేకించ వలసిందనీ యీ సభవారు కోరుతున్నారు. 12. బహిరంగ స్థలాల్లో గూడ పంచములను దూరస్థుల జేసే ఆచారం ఆత్మగౌరవం గల పంచములకు దుస్సహంగా వున్నదని తదితర సంఘాలకు తెలియపరుస్తున్నారు. 13. వ్యవసాయపు పనులలో పనివాండ్ల కిచ్చు కూలి స్వల్పంగా వున్నందువల్ల తగురీతిని హెచ్చించవలసిందని రైతులకు యీ సభవారు విన్నవించుకొన్నారు. 14. ప్రధాన స్థలములలో పంచముల ఉపయోగం నిమిత్తం వృత్తి, విద్యా, సామాన్య విద్యా నేర్పే పెద్ద విద్యాలయం స్థాపించి వసతి గృహము యేర్పరచడం అత్యవసరమనీ యీ సభవారు తీర్మానిస్తున్నారు.

ఈ తీర్మానాలన్నీ భాగ్యరెడ్డి వర్మ పాల్గొన్న పంచముల సభ తీర్మానాలుగా ఉన్నాయని అయ్యదేవర వారి ఆత్మకథలో మనం చూశాం. నవలలో ఈ తీర్మానాలు ప్రవేశపెట్టిన సంగదాసు గాంధేయ భావాలతో ఉంటాడు. ఈ సభ తరువాత సంగదాసును భూస్వామి చౌదరయ్య హత్య చేస్తాడు. సంగదాసు తమ్ముడు వెంకటదాసు ఆ తరువాత తక్కెళ్ల జగ్గడుగా మారి, ధనవంతులను దోచుకొని పేదలకు పంచుతాడు.



బెజవాడ సభకు సంబంధించిన అంశాలను బట్టి – సమకాలీన ప్రపంచాన్ని నిశితంగా పరిశీలించే ఒక చరిత్రకారుడిగా ఉన్నవ మనకు కనిపిస్తారు. అలాగే ఆయన తెలంగాణా ప్రాంతానికి చెందిన సంగం లక్ష్మీబాయిని ఆమె ఉత్తరం రాసి అభ్యర్థించిన మేరకు తమ ఆశ్రమానికి రప్పించి ఆశ్రయం కల్పించారు. ఉన్నత దంపతులు నెలకొల్పిన శారదా నికేతనములో ఆమె చదువుకొంది. ఉన్నవ వెంట జాతీయోద్యమంలో పాల్గొంది. జైలుకు వెళ్లింది. స్వాతంత్ర్యానంతరం లక్ష్మీబాయి రాజకీయాల్లో రాణించారు. మంత్రిగానూ పనిచేశారు. ఆమె రాసుకున్న స్వీయచరిత్ర చదివినప్పుడు కూడా ఉన్నవ యొక్క వ్యక్తిత్వం మనకు అర్థమవుతుంది. ఉన్నవ వారి మాలపల్లి చదివితే భాగ్యరెడ్డి వర్మ వ్యక్తిత్వం గురించి తెలుస్తుంది. ఈ నవల లేకపోతే భాగ్యరెడ్డి వాస్తవ స్థితి, ఆచరణ మనకు అర్థమయ్యేవి కావు. భాగ్యరెడ్డి వర్మకు చాలా రాడికల్ అభిప్రాయాలు ఉన్నాయి. పురాణాల మీద లోతైన అవగాహన ఉంది. వాటి మీద ఆయన చేసిన వ్యాఖ్యలు అప్పటి పత్రికల్లో వార్తలు రూపంలోనూ, అప్పటి నాయకుల ఉటంకింపుల్లోనూ దొరుకుతున్నాయి. ఆయన స్వయంగా రాసింది తక్కువ. ఎక్కువగా బయట తిరుగుతూ అనేక సభల్లో పాల్గొంటూ ఉండేవారు. ఆ సందర్భంగా పత్రికల్లో వచ్చిన వార్తల ఆధారంగానే మనం ఆయన అభిప్రాయాలను తెలుసుకో గలుగుతున్నాం. భాగ్యరెడ్డి వర్మ అంబేద్కర్‌ని గమనిస్తూ ఆయన వైపు వెళ్లటం అనేది 1930 తరువాత మొదలైంది. కానీ, అంబేద్కర్‌కి ముందే 1920 నాటికే తొలినాటి దళిత ఉద్యమానికి బలమైన బీజాలు వేశారాయన. పంచములు అనే మాటకు బదులు ఆది హిందువులు, ఆది ఆంధ్రులు అని పిలవాలనే ఆయన తలంపులోనే గొప్ప ఆత్మగౌరవం కనిపిస్తుంది. మొత్తమ్మీద మాలపల్లి నవల వర్తమాన చరిత్రను రికార్డు చేసిన క్రమంలో భాగ్యరెడ్డి వర్మ పాత్రను ప్రస్తావించటం సంతోషదాయకం. దళితుల సమస్యను, గాంధేయ మార్గాన్ని, కమ్యూనిస్టుల ప్రత్యేకతనూ వివరిస్తూ సాగిన మాలపల్లి వందేళ్ల తరువాత కూడా చర్చింపబడుతున్నది అంటే– దాని ఇతివృత్తంలోని విశాల తత్వమే కారణం. ■



# జగడి తత్వం - బుర్రకథ

రామ రామ శ్రీరామా రామా - రామా రఘురామా
తక్కెళ్ళ జగ్గని ధర్మ బోధలు - తలుపున నిలపండి
ఆది కాలమున అందరు జనులు అన్నదమ్ములండి
నదులు వనంబులు నానా మృగములు - నాల్గు సంద్రములును
కొండలు వండలు జలములు పొలములు గుంటలు సెలయేళ్ళు
కాయలు పండ్లు పాడిపంటలు ఘనమయినా యిండ్లు
అంతరువులా భేదము లేక అందరి సొమ్మండి!
కుదవా గట్టా ఒకరికి బెట్టా - కొదవే లేదండి
నా నీ భేదము లేక లోకము నడుస్తు ఉండేది
మనసు లోపలా చీకుచింతలు - మందుకైన లేవు
తొత్తుల దొరల భేదము లేని - తోడుబంటులండి
అందలమెక్కే - మోసే భేదము లసలే లేవండి
ధనికుల పేదల తారతమ్యముల్- తలలు చూపలేదు

అరకువ ఆకలి బాధలప్పుడు అంకురించలేదు
ధనమును గొల్చే దుష్టరోజులు దాపరించలేదు
తిరిపెము కొరకై ధనికుల బీదలు - దేవురించలేదు
కూటికి గుడ్డకు గుడ్డికుంటులు - గోదు చెందలేదు
మాపులు రేపులు మలమలమాడుచు - మాలలెండలేదు
భోగములొక్కట పస్తులొక్కట పొందియుండలేదు
దొరలు మత్తులై నీచ భోగముల దొర్లుతుండలేదు
పాటు పడడమే పరువు తక్కువను భ్రాంతిలో పడలేదు
రామ రామ శ్రీరామా రామా రామా రఘురామా
తక్కెళ్ళ జగ్గని ధర్మబోధలు - తలల నిలపండి!

కృతయుగమందలి ధర్మము లెల్ల - క్రిందుమీదు గాగ
పాపముతోటీ కలియుగమంత - పండిపోయెనండి
పాపధర్మములు లోకమంతట - పరిసిపోయెనండి
ఎక్కడ జూచిన ఆర్భాటములే - ఎక్కడ ఘోషములె

ఎక్కడ జూచిన పోటీలండి ఎక్కడ కలవరమే
సన్మార్గంబున జీవయాత్రలు - సలుపుట దుర్ఘటము
లోకమందున చక్రవర్తియై - లోభుడేలుచుండు
లోకములోని ద్రవ్యమంతయు లోభుల పరమయ్యె
అంతా నాదే అంతా నాదే అందుకు జనులండి
అంతా మనదే యనెడు రోజులు అంతరించెనండి
పరుగిడు కాకులు యిండ్ల మీదుగా పారవెళుచునండి
యెంగిలి కాకుల వైపు - సరదు యిల్లాలు
నారాయణమ్మలు యిల్లే యంటు - నడతురు యింటింట
యెవరో కొందరు అరుపు కొందురు - యెల్ల ద్రవ్యములను
కోటి కొక్కరే ఉన్నారండి - కోటీశ్వరులంటు
కుచేలులందరు అయినారండి - కోట్లకొలదిగాను
కోటీశ్వరులు కునిష్టి బిడ్డలూ - కోట్లకు కర్తలట
మనుమలెగాదూ మనంతరాలూ - మారుహక్కులంట
అరువు జెప్పితె అడ్డగ కూలి పనికి పాతికెంట
రామరామ శ్రీరామా రామా రామా రఘురామా
తక్కెళ్ళ జగ్గని ధర్మ పన్నముల్ - తలచి బ్రతుకురండి!

ధనికులు బర్రల నిమురుకొందురు తలప రొకరి బాగు
చేతుల వేళ్ళ పనులు ముట్టక - చెడి సోమరులయిరి
కాలి మీదనే కాలు వేసుకొని కాలం బుచ్చేరు
భాగ్యవంతులకు బీదలెల్లరు బానిస అయినారు
పొద్దుగూకులు చాకిరి చేస్తురు - బొక్కెడు కూటికిగా
యెంత చేసినా తృప్తిలేదయా - యజమానుల కెల్ల
రోగంరానీ నొప్పిరానీ - నాగా దప్పదయా
కూలికి విలువ గలదని మీరు - గుట్టు తెలుసుకొండ
కూలికి దగిన విలువ పుచ్చుకునె కూలికి మరిపోండి
నీళ్ళకూలికి వొప్పుకుంటిరా నెనరు చెరుపుకొంద్రు
పనివాండ్లందరు యేకమైతిరా ప్రపంచమే మీది
ఐకమత్యమే అన్ని పనులకు ఆధారము సుండి
శ్రేణులుగట్టి సమ్మెగట్టితే - చెల్లును మీ మాట
కొట్టావద్దు తిట్టావద్దు - కోర్కెలు నిడివేరున్
అసహాయ యోగము తరుణము చూచి - అవలంబించండి
దానికి మిగిలిన మంత్రతంత్రములు ధరలో లేవండి
శంకలు దక్కి మీరలెల్లరు - శపథము చేయండి
సమతాధర్మం ప్రపంచమందున - స్థాపింతురుగాని
కృతయుగ ధర్మం లోకమంతటా కుదుటబెట్టగలరు
రామ రామ శ్రీరామా రామా రమా రఘురామా!



⌘ మాలపల్లి 273, 274 పేజీల్లో
జయంతి పబ్లికేషన్స్ ప్రచురణ, 2018




| | |
|---|---|
| **4-12-1877లో** | : గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకా వేములూరుపాడులో జన్మించారు. వేములూరి పాడు, అమీనాబాదులలో ప్రాథమిక విద్య. |
| 1892 | : లక్ష్మిబాయమ్మతో అమీనాబాదులో వివాహం. |
| 1897 | : గుంటూరులో మెట్రిక్యులేషన్ పరీక్ష |
| 1900 | : గుంటూరులో యంగ్‌మెన్స్ లిటరరీ అసోసియేషన్ స్థాపన; ఉపాధ్యాయ వృత్తి |
| 1902 | : గుంటూరులో వితంతు శరణాలయ స్థాపన; వీరేశలింగం అధ్యక్షతన తొలి వితంతు వివాహం జరిపారు. |
| 1903 | : గుంటూరులో న్యాయవాద వృత్తి. |
| 1906 | : రాజమండ్రి టీచర్ ట్రైనింగ్ కాలేజీలో శిక్షణ; వీరేశలింగం వితంతు శరణాలయం పర్యవేక్షణ. |
| 1908 | : ర్యాలీ కంపెనీలో ఉద్యోగం |
| 1912 | : పూనాలో కార్వే మహిళా విద్యాలయం సందర్శన |
| 1913 | : శ్రీ జొన్నవిత్తుల గురునాథంతో కలసి విశాలాంధ్ర మేప్ తయారీ; బాపట్లలో ప్రథమాంధ్ర మహాసభ ఆహ్వాన సంఘ కార్యదర్శిత్వం |
| 1916 వరకు | : ఐర్లాండు, డబ్లిన్‌లలో బారిష్టరు విద్యాభ్యాసం |
| 1917 | : మద్రాసు హైకోర్టులో న్యాయవాద వృత్తి; ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ కార్యదర్శి ద్వయంలో ఒకరిగా ఎన్నిక |
| 1922 | : గుంటూరు పత్రిక సంపాదకత్వం; పల్నాడు పుల్లరి సత్యాగ్రహం నాయకత్వం; మాలపల్లి రచన; రాయవేలూరు జైలు నుంచి విడుదల; తర్వాత శారదా నికేతన్ స్థాపన. |
| 1922 - 23 | : 'మాలపల్లి' రెండు భాగాలుగా బెల్లంకొండ రాఘవరావు గారిచే ప్రచురణ; మద్రాసు గవర్నమెంటు 'మాలపల్లి' రెండు భాగాలపై నిషేధం; కాంగ్రెస్ స్వరాజ్య పార్టీలో చేరిక. |
| 1926 | : మద్రాసు శాసనమండలిలో అయ్యదేవర కాళేశ్వరరావు గారిచే 'మాలపల్లి' నిషేధంపై చర్చ |
| 1928 | : కొన్ని మార్పులతో 'మాలపల్లి ప్రచురణకు అనుమతి |
| 1931 | : ఉప్పు సత్యాగ్రహంలో జైలు శిక్ష |
| 1931 | : ఆంధ్ర విశ్వవిద్యాలయం వారిచే 'మాలపల్లి' ప్రచురణ, పాఠ్యగ్రంథంగా ఎంపిక. |
| 1936 | : మద్రాసు గవర్నమెంటు 'మాలపల్లి'పై రెండోసారి నిషేధం; పాఠ్యగ్రంథంగా తొలగింపు. |
| 1937 | : సి.రాజగోపాలాచారి మద్రాస్ ప్రధానిగా తొలి కాంగ్రెస్ మంత్రివర్గం చేత నిషేధపుటుత్తర్వులు రద్దు |
| 1942 - 43 | : క్విట్ ఇండియా ఉద్యమంలో జైలుశిక్ష |
| 1956 | : లక్ష్మీబాయమ్మ గారి మరణం |
| **25.9.1958** | : ఉన్నవ కన్నుమూత |

ⵣⵣⵣⵣⵣⵣⵣⵣⵣⵣⵣⵣⵣⵣⵣⵣⵣⵣⵣⵣ



# వ్యావహారిక భాష సరళమైన శైలి

**“వాడుక భాషలో పుస్తకం వ్రాయడానికి నాకిదే మొదటి ప్రయత్నం. మాదిరికి తగిన గ్రంధములు కూడా లేవు.”** ఇవి ఉన్నవ ‘మాలపల్లి’కి ‘పరిచయం’ రాస్తూ అన్న మాటలు. ఉన్నవకు ‘మాలపల్లి’ని వ్రాయటం మొదటి ప్రయత్నమే అయినప్పటికీ, వాడుక భాషలో ఒక రచన సంపూర్ణంగా ఆవిష్కరింపబడటంలో ‘మాలపల్లి’కి అగ్రస్థానాన్నిస్తూ, ఉన్నవను అగ్రగణ్యులుగా పేర్కొనవచ్చు.

గురజాడ వారి కన్యాశుల్కం రచన తర్వాత దాదాపుగా మూడు దశాబ్దాల కాలం వ్యావహారిక భాషలో రచనలు చేయబడక ఒక విధమైన స్తబ్ధత ఏర్పడింది. ఒక నాటకం గానీ, ఒక నవల గానీ వ్యావహారికంలో రచింపబడలేదు. కానీ, వ్యావహారిక భాషోద్యమం చాలా తీవ్రమైన చర్చలతోనూ, వాదోపవాదాలతోనూ, దూషణ, సమర్థనలతోనూ నడుస్తున్న కాలంలో ఉన్నవ వ్యావహారిక విషయంలోని స్తబద్ధతను తొలగించి, చైతన్యం కలిగించేందుకు, రచనా విషయంలో భాషమీదున్న అపోహలు తొలగింప చేసేందుకు ఆత్మస్థైర్యంతో ముందుకు వచ్చి మాలపల్లి వంటి పెద్ద నవలా నిర్మాణం చేసి, వ్యావహారిక భాషోపయోగానికి మార్గాన్ని సుగమం చేశాడు.

మాలపల్లికి పూర్వం వచ్చిన రచనలు కేవలం అనువాదాలూ, అనుకరణలూ, చాలావరకివి గ్రాంధిక భాషలోనే రచింపబడ్డాయి. మరి తానేమో నూతనంగా వ్యావహారిక భాషలో రచనకు ఉపక్రమిస్తున్నాడు. అలాంటప్పుడు వ్యావ హారికంలో రచనలు చేయాలంటే రచయితకు అంతకు పూర్వమున్న ‘సంస్కృత భాషా పాండిత్యంగాని, తెలుగు ప్రబంధముల పరిచయం గాని వాడుక భాషలో గ్రంధములు వ్రాయడానికి విశేషం తోడ్పడవు. అందువల్ల “శుద్ధమైన తెలుగు భాష రావడానికి సంస్కృత భాషతో సంబంధంలేని పల్లెటూరి వారితో పరిచయముండాలె” అని చెపుతూనే ఉన్నవ ‘మాలపల్లి’ని అచ్చమైన పల్లెటూరి భాషలో, ఉత్కృష్టమైన శైలిలో తీర్చిదిద్దారు.

భాష నుండి దూరం చేయబడి మూలబడ్డ, లుప్తమవుతున్న ఎన్నో చక్కని తెనుగు పదాలను, పలుకుబడులను, ‘మాలపల్లి’లో విస్తృతంగా ఉపయోగించి, రచనకొక కొత్తదనాన్ని తీసుకొనివచ్చే ప్రయత్నం చేశారు ఉన్నవ. విస్మృతమవుతున్న మాండలికాలను

> “ మూలబడ్డ, లుప్తమవుతున్న ఎన్నో చక్కని తెనుగు పదాలను, పలుకుబడులను, ‘మాలపల్లి’లో విస్తృతంగా ఉపయోగించి, రచనకొక కొత్తదనాన్ని తీసుకొనివచ్చే ప్రయత్నం చేశారు ఉన్నవ. విస్మృతమవుతున్న మాండలికాలను సహితం గ్రహించి అచ్చ తెలుగులో, అందులోనూ వాడుక భాషలో గ్రంధమంతా రాయబడటం వల్ల మనకు కొన్ని చోట్ల ఆగి చదవాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. వాడుకలో లేని పదాలు ఉపయోగించడంవల్ల కూడా శైలి కొంత దెబ్బతింటుంది. ”

సహితం గ్రహించి అచ్చ తెలుగులో, అందులోనూ వాడుక భాషలో గ్రంధమంతా రాయబడటం వల్ల మనకు కొన్ని చోట్ల ఆగి చదవాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. వాడుకలో లేని పదాలు ఉపయోగించడంవల్ల కూడా శైలి కొంత దెబ్బతింటుంది. దాంతో పాఠకుడు తనకు పరిచయం లేని ఆ పదాల వల్ల విషయ గ్రహణంలో చాలా శ్రమపడవలసి వస్తుంది. ఉన్నవ వాడుక భాషలోనే నవలంతా రాసినప్పటికీ, సన్నివేశాన్ని బట్టి, సందర్భాన్ని బట్టి వర్ణనలు చేయాల్సినచోట రచనాశైలి, శబ్దాల కూర్పు మారిన విధానం దీనికి ఒక కారణం. ఇంకా ఉన్నవ ఉపయోగించిన భాషకు పూర్వం ఎవరూ పెట్టిన వరవడి ఎదుటలేకపోవడమే కాక, శబ్దాల కూర్పుకు లోకమే ప్రమాణంగా ఎంచుకొని, తన సందేహ నివృత్తికి ఆత్మ ప్రమాణాన్ని ఆధారం చేసుకొని వాడుక భాషలో వ్రాయటం కూడా ఆగి ఆగి చదవాల్సి రావటానికి కారణమై వుంటుంది. ఉన్నవ రచనా వస్తువును బట్టి భాషను ఎన్నుకున్నారు. తన రచనకు వస్తువుగా ఆనాటి ప్రధాన సమస్యలలో ఒకటైన హరిజన సమస్యను తీసుకొన్నారు. వీరు గుంటూరుకు చెందినవారు. తన రచన సామాన్యుడి వరకు వెళ్ళాలంటే వాడుక భాషే ప్రధాన సాధనం. ఈ నవల రచనాకాలం 1921-22 ప్రాంతం. ఆనాటి వ్యావహారికం ఈ నాటిది కాదు. భాష అనేక మార్పులకు లోనౌతూ వస్తున్నది. ఇట్లాంటి పరిస్థితుల్లో అప్పటి మాండలికాలు ఈనాడు ఉపయోగంలో కన్పించకపోవడం విడ్డూరమేమీ కాదు. నవల చదువుతున్న మనకు అప్పటి మాండలికాలతో పరిచయం లేక పోవడంవల్ల కూడా, 'మాలపల్లి' మనకు అర్థం కావడానికి ఆగి ఆగి చదవాల్సిన పరిస్థితి ఏర్పడుతున్నది.

రచనలో తాను ఎదుర్కొన్న కష్టనష్టాలను, ఎదురైన సమస్యలను అవగతం చేసుకొన్న ఉన్నవ .. " భాష యొక్క ప్రస్తుత స్థితిలో రాయడం కంటే గ్రాంధిక భాషలోనే రాయడం సులభముగా కనబడ్డది" అని అన్నాడు. దీనికి కారణం గ్రాంధిక భాషతో పూర్వపు సన్నిహిత పరిచయమే. అయితే దీనిని మాన్పించి, వ్యావహారిక భాషా రచనకు పూనుకోవాలంటే... "జాతీయ తెలుగు భాషలో పూర్ణమైన పరిచయం" కావాలంటూ తన కంటే "పల్లెటూరిలో నివసించడమెక్కువ అలవాటు గలిగి తెలుగు భాష యొక్క నిజస్వభావం బాగా గుర్తెరిగిన తెలుగు భాషా పండితులు వాడుక భాషలో రాయడానికి అర్హులు" అంటూనే తనకున్న పూర్వానుభవ జ్ఞానంతోనే, చక్కటి తెలుగును ఉపయోగించి, వాడుక రచనలకు ప్రేరకంగా ఒక దారిని ఏర్పాటు చేశారు ఉన్నవ.

ఈ నవల గుంటూరు జిల్లా మాండలికంలో రాయబడినప్పటికీ ఇందులో రాయలసీమ మాండలిక పదాలు కూడా ఉండడం గమనించాలి. అక్కిరాజు రమాపతి రావుగారన్నట్లుగా "భాషా విషయంలో గొప్ప నవ్యతను తెచ్చారు ఉన్నవ. అంతకు పూర్వం పాత్రోచితమంటూనూ, సన్నివేశ చిత్రణ మంటూనూ, పాత్రల సంభాషణలలో స్వభావ సిద్ధమైన నుడికారాన్నే ప్రవేశపెట్టే ప్రయత్నాలు కొన్ని జరిగినా.. ఆసాంతం నిత్య జీవన వ్యవహారోచితమైన భాషలో నవల రాయడమంటూ జరగలేదు. ఆ కీర్తి ఉన్నవ వారికే దక్కింది."

## సరళమైన శైలి

మాలపల్లిలో ఉన్నవ వారు ఉపయోగించిన శైలిని గురించి దానికి తొలి పలుకులో కాశీనాధుని నాగేశ్వరరావు గారు ఇలా పేర్కొన్నారు : "తెనుగు మాటలు, తెనుగు దేశము, తెనుగు సాహిత్యము, తెనుగు హృదయము, తెనుగు సంకల్పము మాలపల్లి కనిర్వచనీయమైన ప్రతిభను సమకూర్చినవి. తెనుగు మాటల యింపు సొంపులు, అందచందములు గ్రంధము నందంతటను గోచరములగుచున్నవి. తెనుగు మాటల సరళ ప్రవాహ మానందమును గలుగజేయుచున్నది. గ్రంథము నందుపయోగించిన భాష వాడుక భాషయైనను గ్రాంథిక భాషా సంస్కారమును బడసినది. విభక్తులు, ప్రత్యయములు, సంధులు, పొందికలు నవీనముగ గనుపడినను సులభముగ బోధ్యమగుచున్నది లక్ష్మీనారాయణ గారు ఉపయోగించిన లోకోక్తులు, జాతీయములు, వర్ణనాది విశేష ములు గ్రంథమునకు వ్యక్తిత్వమును గలుగ జేసినవి. సందర్భానుసారముగా సుదాహృతములైన వాక్యములు గంభీర సరళ మధుర శైలికి నిదర్శనములు."

పైన తెలిపినట్లుగా ఉన్నవ వాడిన భాషలో గ్రాంథిక వాక్యాలు కూడా మనం చూడగలం. దీనికి కారణం రచయితకు ఆనాటి గ్రాంథిక భాషతోటి పరిచయమెక్కువగానూ, వ్యావహారికంతోటి తక్కువగానూ ఉండటం కారణంగా చెప్పుకోవచ్చు. ఉన్నవ 'మాలపల్లి' రచనకు పూర్వం 'అభ్యాసం' కొరకు కూడా వ్యావహారికంలో రచనలు చేసినట్లు కనబడదు. ఇందువల్ల కూడా 'మాలపల్లి'లో అక్కడక్కడా గ్రాంథిక వాక్యాలు, భాషా ప్రభావం అనుకోకుండా ఉంటుంది. 'మాలపల్లి'లో ఆయా పాత్రలను దృష్టిలో ఉంచుకొని సంభాషణ లొక్కొక్కచోట ఒక్కొక్క విధంగానూ, వర్ణనలునొక విధంగానూ చేశారు. ప్రధానంగా వర్ణనల చోట గ్రాంథిక భాషా ప్రభావం స్పష్టంగా కన్పిస్తుంది. ఉదాహరణకు ఒకటి రెండు వాక్యాలు ...

*"... చూడ్కులు గొడుగు బల్లపై ప్రసరించినవి. తలపై నెమలి పురింజేవురుకొని కన్దామరలు అరమోడ్పు చెంద, వెడదలై కడుంగడు నిడుదలై లావణ్య ముఖ సరోవరమున తేలియాడ ..."*

*" ... కాఱుమబ్బుపై హత్తికాను క్రొక్కారు మెరుంగులంబోలు గోపకన్యా సహస్రములతో కేలంగేలు గీలించి ..."*

ఉన్నవ తన రచనా శైలికి ఒక వైశిష్ట్యాన్ని సంతరింపచేసేందుకు విరివిగా సామెతలు, జాతీయాలను వాడారు. సామెతలు, జాతీయాలు కలిపి వందకు పైబడి ఉపయోగించినాడు. ఈ సామెతల్లో కొన్నింటికి ఈనాడు అర్థం తెలుసుకోవడం కష్టమే. అయితే వీటిని వాడబడిన సందర్భాన్ని బట్టి గమనింపవచ్చు. మచ్చుకు కొన్ని :

*"కట్టె వంకరలు పొయి తీరుస్తుంది."*

*"గరకచేలో గుంటక తోలినట్టు"*

*"జడ్డిగంలోనే మిడత పొడిచింది"*

*"బీద కూటికి బిక్కదేవుడు"*

*"కనకుండా కట్టెదు పత్తిస్తే వినకుండా వీరంగ మెట్లాగని"*

ఉన్నవ కేవలం తెలుగు సామెతలతో మాత్రమే తృప్తి పొందలేదు. సందర్భానుగుణంగా సంస్కృత న్యాయాలను కూడా ఉపయోగించాడు. కొన్ని చోట్ల వీటిని ఒకటికి రెండుసార్లు ఉపయోగించటం కూడా కన్పిస్తుంది. జాతీయాలు ప్రయోగించడంలోనూ ఉన్నవ ఎంతో విజ్ఞతను కనబరచినాడు.

**ఉదా :** *'గంపెడు చీకటి నెత్తిన వేసుకొని'*

*'కాలికి బలపం కట్టుకొని'*

*'కాలుగాలిన పిల్లివలె'*

*'శల్య సారధ్యం'*

పదప్రయోగ విషయంలో ఉన్నవ ఒకే విధమైన పదాల్ని ఒకచోట ఒక విధంగానూ, మరొకచోట మరొక విధంగానూ ఉపయోగించటం కన్పిస్తుంది. ఈనాటికీ కొందరు రచయితలు ఇలాంటి ప్రయోగాలు తమ రచనల్లో చేయడం చూడవచ్చు. ఉన్నవ ఇలా చేయడానికి కారణం బహుశా కొత్త పాతల మేళవించి ప్రప్రధమంగా వాడుకభాషలో ఎవరూ చేయని సాహసం చేసి, కొత్త మార్గాన్ని అనుసరించడమో లేక పదాల ఉపయోగంలో ఎటూ తేల్చుకోలేకపోవటమో కారణమై వుంటుంది.

వర్ణనల విషయంలో ప్రధానంగా ప్రకఅతి వర్ణనల విషయంలో దీర్ఘమైన సమాసాలు ఉపయోగించడం కన్పిస్తుంది. ఉదాహరణకు *"శరత్కాల చంద్రుదు షోడశ కళాపరిపూర్ణుడై నిజకరంబుల రోహిణీ కరంబులం గీలించి ..."*

మరొకచోట అచ్చమైన తెలుగు పదాలతో వర్ణన చేయబడటం కన్పిస్తుంది. *"... రాత్రి పిందారబోసినట్లు వెన్నెల గాసింది. సూదిబోటికి శిఖరమైతిన రీతిగా అరుణ కిరణుదు పొడుపు గొండపై నెక్కి ప్రకాశిస్తున్నాడు. వెదులమ్మా, పుట్టలమ్మా రాత్రంతా తమ చెరువులు దురస్తు చేసి తూర్పు తెల్లబారంగానే చాలించి విశ్రమిస్తున్నారు. బల్లు మోరయ్య పులికాపు చేసుకొని చెల్లెలైన కృష్ణవేణిని చూస్తూ కూర్చున్నాడు."*

అట్లాగే సునిశితమైన హాస్యం కూడా 'మాలపల్లి'లో మనం దర్శించగలం. రామానాయుడు బెజవాడలో జరుగు పంచముల సభకు హాజరయ్యేందుకు రైల్వే స్టేషనుకు వెళతాడు. ఇంతలోకి రైలు వస్తుంది. రైలు ఆగటంతో దిగే ప్రయాణికులూ, ఎక్కే ప్రయాణికులూ ఒకరికొకరు ఎదురుపడి తోసుకొంటూ చేసే ఆర్భాటాల్ని, పడే ఇబ్బందుల్ని కండ్లకు కట్టినట్లు చిత్రించాడు.

'మాలపల్లి'లోని మాండలిక పద ప్రయోగం, రచనాశైలి ఆయా పాత్రల మనోగత భావాలను ప్రస్ఫుటంగా వ్యక్తీకరిస్తూ, పఠితల హృదయాల్ని ఆకట్టుకొంటాయి. అందుకే ఉన్నవ ఆధునిక స్పృహతో సజీవమైన వ్యావహారిక భాషకు ప్రాణప్రతిష్ఠ జరిపిన విశిష్ట వ్యక్తిగా విమర్శకుల చేత ప్రశంసింపబడ్డాడు. ఈ వ్యావహారిక భాషా ప్రయోగం ద్వారా ఉన్నవ మాలపల్లి నవలలోని ప్రధాన లక్ష్యాన్ని సామాన్య ప్రజల వరకు తీసుకొని వెళ్ళడం జరిగింది. అందువల్ల ఈ నవలలోని వ్యావహారిక భాషా ప్రయోగ నైపుణ్యాన్ని సునిశితంగా పరిశీలించిన వింజమూరి రంగాచార్యుల గారి ఈ కింది అభిప్రాయాన్ని ప్రామాణికమైందిగా గుర్తించటం సమంజసంగా ఉంటుంది.

**"నాకు తెలిసినంతవరకూ నాటక రూపమైన 'కన్యాశుల్కం' మినహాయించగా... వాఙ్మయంలో శాశ్వతంగా నిలవడానికి ఆశించే గ్రంథం పూర్తిగా వాడుక భాషలో వ్రాయబడడం ఇదే మొదటి పర్యాయం అని తలుస్తాను. ఈ విషయంలో లక్ష్మీనారాయణ గారు నిర్భయంగా కొత్త దారి తీశారు."** ■

# యుద్ధం ముగిసే వేళ ..

**చు**ట్టూ మృతదేహాల కంపు
నేత్రాలు బారిన నేలలా..
గుక్కెడు నీళ్ల కోసం
జనం ఎదురుచూపులు
రానివారికోసం....
ఓ... వీర జవాను బార్య
దేశ సేవకుని తల్లి ఎదురుచూపులు

ఓడిపోయి రాలిపోతాయని
తెలిసినా .. నేల పూస్తాయి పూలు
పరిమళం ప్రపంచానికిచ్చి అదృశ్యమయ్యే పూలలా
ప్రాణం దేశానికి ఇచ్చి. .
త్యాగం భావితరాలకు అందిస్తారు సైనికులు

నువ్వు ముక్కలవ్వకుండా
నీ శత్రువును ముక్కలు చేయలేవు
అప్పుడు... నీవిక్కడ.. అతనక్కడ
ఇద్దరూ ... దేశభక్తులే!

ఎప్పటికీ... ఓడిపోయేది యుద్ధమే
ఇప్పటికీ గెల్చేది ప్రాణమే..
విజయానికి దగ్గర దారిలేదు
పోరుదారొక్కటే మార్గం...
నిత్య జీవన పోరాటం ప్రకోపిస్తే
ఎంతటి.. మారణహోమాన్నైనా
మట్టి కరిపిస్తుంది..

యుద్ధం ఎప్పుడు మరణాన్నే కోరుకుంటుంది
విజయం ఎప్పటికీ వీరులదే!

- రెడ్డి శంకరరావు
**94943 33511**



# తెలుగు రచనలపై నిషేధాల చరిత్ర

వెలగా వెంకటప్పయ్య

> "అధికార దాహం, అధికార పీఠం బలమైనవి. వారికి ఉచ్ఛ నీచాలు తెలియవు. తమ పదవి, అధికార పీఠం నిలబెట్టుకొనేందుకు ఏ దుశ్చర్యానికైనా దిగజారటానికి వెనుదీయరు. గ్రంథాలను, పత్రికలను నిషేధించ డానికి, మానవులను బందీ చేసి పీక నొక్కేయడానికి వెనుకంజ వేయరు. అన్ని దురాగతాలు తనివితీరా చేసి పదవిని పదిలంగా ఉంచుకుంటారు – సాగినంతవరకు."

**భా**వ ప్రకటన అనేది మానవుని జన్మతః లభించిన వరం. ఈ భావం వెలిబుచ్చేందుకు తగిన స్వేచ్ఛ ఉండాలనే మానవుడు కోరుకుంటాడు. స్వేచ్ఛా ప్రకటనలో మరొకరి జోక్యం సహించలేదు. కొన్ని సందర్భాల్లో రాజీపడిన దాఖలాలూ లేకపోలేదు. క్రీ.పూ. 4వ శతాబ్దం నాటి సెనకా అనే గ్రీకు వేదాంతి Freedom is not being a slave to any circumstances, to any constraint, to any chance; it means compelling. Fortune to enter the lists on equal terms Senaca (4 BC-AD 65) విధిని దాని పీఠం నుంచి దించేసే మానవుడిలో సమాన స్థాయిలో నిలబెట్టే ఆయుధంగా స్వేచ్ఛను సెనకా వర్ణించారు. స్వేచ్ఛ ఒక వర ప్రసాదం కాదని, అది జన్మ హక్కని రాసినందుకు పాలక వర్గాలు అసహనం చూపడం సహజం. అయితే మానవునిలో ప్రవృత్తిరీత్యా నిగూఢంగా ఒక శక్తి ఉంటుంది. తన భావ స్వాతంత్ర్యాన్ని ఇతరులు ఎంతగా నొక్కివడితే అంతగా ప్రతిఘటించాలని ఉంటుంది. కాని అధికార రోగ పీడిత బధిరాంధులు కరాళ దంష్ట్రాగ్రాలను మానవుని సహజశక్తి ఎదుర్కోలేదు. అంతేగాక అధికార దాహం, అధికార పీఠం ఇంకా బలమైనవి. ఉచ్ఛ నీచాలు వారికి తెలియవు. తన పదవి, తన అధికార పీఠం నిలబెట్టుకొనేందుకు ఏ దుశ్చర్యానికైనా దిగజారటానికి వెనుదీయరు. గ్రంథాలను, పత్రికలను నిషేధించ డానికి, రేడియో నోరు కట్టేయడానికి (ఆనాడు టీవీలు లేవు), మానవులను బందీ చేసి పీక నొక్కేయడానికి వెనుకంజ వేయరు. అన్ని దురాగతాలు తనివితీరా చేసి పదవిని పదిలంగా ఉంచుకుంటారు – సాగినంతవరకు.

1857లో జరిగిన సిపాయి తిరుగుబాటు ప్రథమ స్వాతంత్ర్య సమర పోరాటానికి నాంది పలికింది. అప్పటిదాకా మన దేశంలో సాగిన ఈస్టిండియా కంపెనీ పాలనకు స్వస్తి చెప్పి బ్రిటీషు ప్రభుత్వం 'క్రౌన్' భారతదేశ పాలనా పగ్గాలు చేపట్టింది. ముందుగా ముద్రణా మాధ్యమాన్ని తన చెప్పుచేతల్లో ఉంచుకోవాలని భావించింది. అందుకనుగుణంగా కొన్ని శాసనాలు రూపొందించి కఠినంగా అమలు పరచింది. తొలుత గ్రంథాల ముద్రణకు, ముద్రణశాలల

(ప్రింటింగు ప్రెస్సు)ల స్థాపనకు ప్రభుత్వ అనుమతి ఉండాలని శాసించారు. 1867 ప్రెస్సు, రిజిస్ట్రేషన్ ఆఫ్ బుక్స్ ఆక్టు అమలు జరిపి, అచ్చేసిన ప్రతి పుస్తకం మూడు ప్రతులను ముద్రాపకుడు రిజిస్ట్రార్ ఆఫ్ బుక్స్ కార్యాలయానికి పంపాలని ఆదేశించింది. ఇలా చేరిన పుస్తకాల పరిశీలనకు సిబ్బందిని నియమించింది. తమ పాలనను ఎదుర్కొనే వారిపై ఒక కన్నేసి ఉంచింది.

ఇలా ఉండగా పత్రికలు ప్రజల్లోకి మరింత వేగంగా దూసుకుపోతాయనే ఉద్దేశంతో 1878లో వెర్నాకులర్ చట్టాన్ని రూపొందించింది. ఈ చట్టంలోని లోపాలు సరిదిద్ది 1910లో ఇండియన్ ప్రెస్ ఆక్టు, 1931లో ఇండియన్ ప్రెస్ (ఎమర్జెన్సీ) ఆక్టులను ప్రవేశపెట్టి తమ గుత్తాధిపత్యానికి అడ్డు లేకుండా చేసుకుంది. అంతేగాక బ్రిటీషు ప్రభుత్వం అచ్చుయిన రచనలు దేశంలో త్వరితంగా వ్యాప్తి చెందకుండా పోస్టల్ శాఖను, రవాణా శాఖను తమ చెప్పుచేతల్లో ఉంచుకుంది. ప్రెస్సులను భస్మీపటలం చేసింది. ప్రెస్సు యజమానులను నిర్బంధించింది. ఎన్ని చట్టాలు చేసినా తమ స్వేచ్ఛకు భంగం కలిగిన ప్రతిసారీ – తెలుగు యోధులు బ్రిటీషు ప్రభుత్వంపై తిరగబడి తమ సత్తా చూపకపోలేదు.

బెంగాలు విభజన అనంతరం దేశంలో పెల్లుబికిన జాతీయోద్యమం, పలు సాంఘిక ఉద్యమాలను ప్రోత్సహించేందుకు వందలు, వేల సంఖ్యలో పత్రికలు, పుస్తకాలు వెలువడ్డాయి. ఇందు సొంత సొమ్ము వెచ్చించి అచ్చేసిన పత్రికలు, పుస్తకాలు అత్యధికం. వీటిలోని కొన్ని అంశాలపై బ్రిటీషు ప్రభుత్వం అభ్యంతరాలు చెప్పి, అసహనం చూపి నిషేధించిన సందర్భాలు వందల సంఖ్యలో ఉన్నాయి.

### తొలి స్వాతంత్ర్య సమరయోధుడు గాడిచెర్ల

గాడిచెర్ల హరిసర్వోత్తమరావు గారు స్వాతంత్ర్య సమరయోధుల్లో అగ్రగణ్యులు, మహోన్నత వ్యక్తి, నిజాయితీకి, నిబద్ధతకు, త్యాగానికి మారుపేరు. 1907లో రాజమండ్రి, విద్యాశిక్షణ కళాశాలలో చదివే రోజుల్లో బ్రిటీషు ప్రభుత్వ దురాగతాలను ఖండించినందున వారికున్న ఎం.ఎ. డిగ్రీని మద్రాసు యూనివర్సిటీ విత్ డ్రా చేసింది. తరువాత జీవితాంతం ఉద్యోగం లేక, రోజు గడవక నరక యాతనకు గురయ్యారు. 1908లో తిరునల్వేలిలో బ్రిటీషు పాలకులు ముగ్గురు హిందువులను తుపాకి కాల్పులకు బలిచేసినందుకు స్వరాజ్య పత్రిక సంపాదకీయంలో ఇలా రాశారు .. :

**"అరెరే! పరంగీ క్రూరవ్యాఘ్రమా! నిష్కారణముగ నీవు ముగ్గురు హిందువులను ఒక్కసారిగా పొట్టన పెట్టుకుంటివి గదరా! నీవు నీ నీతిచట్టాలను గూడ అతిక్రమించుచున్నావు. ఓ భయభ్రాంతుడా! పొగరుబోతుతనమున కన్నులు గానని వారికి సహజ లక్షణమైన ఇట్టి వ్యతిరేకాభిప్రాయాలను కలిగిన నీవు, నీ రహస్యాలను బయలు పెట్టుకొంటివి. హిందూ జాతీయాభివృద్ధిలో మీ విదేశీపాలనా విధాన మంతమొందించగలదని రుజువు చేసి చెప్పుచున్నావు..."**



ఈ సంపాదకీయానికి ఆంగ్లానువాదం చేయించుకొని, తెల్లదొరలు ఉగ్రులై గాడిచెర్ల వారిని, ముద్రాపకులైన బోడి నారాయణరావు గారిని మచిలీపట్నంలో అరెస్టు చేసి జైలుకు పంపారు. విదేశీ జడ్జి ఈ సంపాదకీయ ఆంగ్లానువాదం చదివి "ఈ సంపాదకీయంలో ఉద్రేకం ఉందిగాని, రాజద్రోహం అంతగా లేదని" మచిలీపట్నంలోని జిల్లా కోర్టు భావించి ... గాడిచెర్లకు ఆరు మాసాలు, బోడికి తొమ్మిది మాసాల జైలు శిక్ష విధించారు. దీనిపై పాలకులు తృప్తిపడక హైకోర్టుకు అపీలు చేశారు. ఈ కేసు మద్రాసు హైకోర్టులో పునర్విచారణ జరిగాక జిల్లా కోర్టు విధించిన శిక్ష రద్దు చేసి, గాడిచెర్లకు శిక్షను మూడేళ్లకు పెంచారు. అంతేగాక జిల్లా జడ్జి తగిన విధంగా విచారణ చేయలేదని భావించి అతని ఉద్యోగాన్ని దిగువ స్థాయికి తగ్గించారు. ప్రభుత్వానికి వ్యతిరేకంగా రాసేవారిపై శిక్షలు అంత కఠినంగా, నిర్దాక్షిణ్యంగా ఉండేవి.

ఈ శిక్ష అమలు జరిగిన తీరును దర్శి చెంచయ్య గారు తన గ్రంథం 'నేను – నా దేశం' అనే గ్రంథంలో ఇలా వివరించారు : "శ్రీ హరిసర్వోత్తమరావు గారిని అతి క్రూరంగా శిక్షించి, తమిళనాడులోని రాయవెల్లూరు సెంట్రల్ జైలులో నిర్బంధించిరి. ఆ కాలంలో జైళ్ళలో ఖైదీలను పెట్టుచుండిన బాధలు వర్ణించుట సాధ్యం కాదు. ఈ బాధలన్నిటికి ఆయన గురి అయ్యారు. ఇతర ఖైదీలకు వలెనే రాజకీయ ఖైదీయైన హరిసర్వోత్తమరావుగారి బట్టలు తీసివేసి రెండు గోచీలు యిచ్చిరి. మూరెడు చదరం గల రెండు తువ్వాళ్లు యిచ్చిరి. పడుకొనుటకు చిన్న ఈత చాప యిచ్చిరి. అన్నం తినుటకు మట్టి చట్టి, నీళ్ళు తాగుటకు మట్టి ముంత, మలమూత్ర విసర్జనకు మరొక చట్టి మాత్రమే యిచ్చిరి. కాలికి లావాటి కడియం,

మెడకు మరొక ఇనుప కడియం వేసి, ఒక కొయ్యముక్కను దూర్చివేసిరి. మట్టితో పండ్లు తోముకోవాలి, అధికార్లు నిర్ణయించిన టైముకే మలవిసర్జన చేయాలి. స్నానానికి మూడు నాల్గుముంతల నీరు యిస్తూ వుండిరి. తినుటకు రాగిసంకటి ముద్ద, ఆ ముద్దలో పుల్లలు, రాళ్లు, మట్టి వుండేవి. ఆకులలములతో ఉడకబెట్టిన పులుసు నీరు, వాటిలో వుండిన పురుగులనైనా కడిగివేయరు. ఈలాగు తయారయిన పులుసునీళ్ళలో చచ్చిన పురుగులు తేలుచుండేవి. మొలత్రాడు, జంధ్యము తీసివేశారు. తల బోడి చేశారు. ఎన్ని విధాల మనుష్యులను అగౌరవపరచటం సాధ్యమో, అన్ని విధాల అగౌరవపరుస్తూ దేహబలాన్ని, మనోబలాన్ని అణగద్రొక్కి ప్రజలు దేశసేవకు, మానవసేవకు ప్రయత్నించకుండా వుండేలాగు జైలు తయారు చేసిరి. మన ఆంధ్రవీరుడు సుమారు 1200 రోజులు అలాగ అహోరాత్రుల్లు కఠిన శిక్షననుభవించిరి. ఆయన చదువుకొనుటకు స్వంత పుస్తకములైనను ఇవ్వలేదు. ఆయనతో మాట్లాడినా, ఆయనకు సానుభూతి చూపించినా, ఉద్యోగము పోవునని జైలు ఉద్యోగులు భయపడుచుండిరి. మూడు నెలల కొక ఉత్తరం రాయుటకు, ఒక ఉత్తరం తెప్పించుటకు ఉత్తర్వు చేసిరి."

### భర్తను గోచీగుడ్డతో చూసి...

హరి సర్వోత్తమరావు గారికి 18వ ఏటనే వివాహమైంది. భార్య రమాబాయి. చిత్తూరు జిల్లాకు చెందినవారు. ఈమె తండ్రి చిన్న ప్రభుత్వోద్యోగి. 1908లో రావు గారికి ప్రభుత్వం మూడేండ్లు కఠిన శిక్ష విధించినపుడు ఈమె వయసు 15 సంవత్సరాలు. ఏడు మాసాల గర్భవతి. ఒకమారు ఆమె భర్తను చూడటానికి జైలు వద్దకు వెళ్లారు. కానీ, భార్యాభర్తలు మాట్లాడుకునే అవకాశం లేదు సరిగదా దగ్గరకు వెళ్ళే వీలు కూడా లేకపోయింది. జైల్లో ఉన్న భర్తను దూరం నుంచి మాత్రమే చూడనిచ్చేవారు. సర్వోత్తమరావు గారిని చూడటానికి బంధువులామెను తీసుకువెళ్ళారు. ఖూనీలు చేసి జైలుకు వచ్చిన వారి మధ్య గోచీగుడ్డతో నరకబాధననుభవిస్తున్న భర్తను చూసి, ఆమె గుండె నీరై పోయింది. పట్టరాని దు:ఖంతో అచేతనమై పోయింది. అప్పుడామెను కొమర్రాజు లక్ష్మణరావు గారు సముదాయించారు. గాడిచెర్ల వారి మామ గారు పదవీ విరమణ ప్రభుత్వ ఉద్యోగి. మామగారికి వచ్చే పెన్షన్ కూడా ప్రభుత్వం రద్దు చేసి కక్ష తీర్చుకుంది.

### తెల్లవారిని కుదిపేసిన గరిమెళ్ల గేయం

'మా తెల్లదొరతనం' అనే గేయం వాడవాడలా అనన్య సామాన్యమైన రీతిలో ప్రచారమై తెల్లవారి ఎముకల్లో చలి పుట్టించింది. ఈ గేయాన్ని జైళ్ళలోనూ పాడుకునేవారు. 1921లో దీని తొలి ముద్రణ కాగానే విశేష ప్రచారం లభించింది. దీంతో, మద్రాసు ప్రభుత్వం 1922లో నిషేధించింది. గరిమెళ్ళ వారిపై విచారణ జరిపి తిరుచినాపల్లి, కడలూరు జైళ్ళలో ఉంచి శిక్షించింది. ఈ గేయాలు అప్పటికే కార్యకర్తల నోటికి వచ్చినందున అలవోకగా



సభలలో పాడుతుండేవారు. ఈ గేయం దాదాపు 200 పంక్తులు గలది. అందు పది చరణాలు మాత్రం చూద్దాం.

**పల్లవి :**

మాకొద్దీ తెల్లదొరతనము; దేవ
మాకొద్దీ తెల్లదొరతనము – **మాకొద్దీ**

**అనుపల్లవి :**

ప్రాణాలపై పొంచి – మానాలు హరియించె – **మాకొద్దీ**

**చరణాలు :**

పన్నెండు దేశాలు – పండుచున్నాగాని
పట్టెడన్నమె లోపమండి,
ఉప్పు, ముట్టకుంటే దోషమండి
నోట, మట్టి కొట్టి పోతాడండి
అయ్యో, కుక్కలతో పోరాడి
కూడు తింటామండి – **మాకొద్దీ**

వర్తకంబున కొచ్చి – పట్టణంబులు పట్టి–
రాజ్యమొక్కటి అల్లినాడు
దాన్ని, రాణి కప్పగించినాడు
రాణి, పత్రము బంచేసినాడు
ఈ చిత్ర దేమన్న శిక్షిస్తానంటాడు – **మాకొద్దీ**

కోర్టులంటూ పెట్టి – పార్టీలు పుట్టించి
స్నేహభావము చంపినాడు
ద్రవ్య, దాహము కల్పించినాడు
చెడ్డ, యూహలు కదు పెంచినాడు
మా ఆహారముల ద్రుంచి ఆహా, యనిపించినాడు – **మాకొద్దీ**

ప్రజల క్షేమం కోసం – పెట్టిన సంస్థల








ప్రభుల కోసం మార్చేస్తాడు
వాటి ప్రజల శత్రులు చేసుతాడు
మమ్ము, గజిబిజిలాడ చేస్తాడు
వాడి గడబిడ వర్ణింప కాదు బ్రహ్మకైన – **మాకొద్దీ**

... ఇలా నిషేధించిన ప్రతి గ్రంథానికి ఒక చరిత్ర ఉంది. ఒక నేపథ్యం ఉంది. అన్ని సందర్భాల్లోనూ ముందుగా ముద్రాపకుడిని, రచయితను అరెస్టు చేసేవారు. విచారణ జరిగాక శిక్షలు పడేవి. ఇచట గమనించాల్సిన విషయాలు ఏమంటే గ్రంథాన్ని ముద్రించే ముందు ముద్రాపకుడు చదివి అందు ఆక్షేపణకర విషయాలుంటే ముద్రించరాదని బ్రిటీషు వారి అభిప్రాయం. అదే చట్ట నిర్దేశం. ఆ కాలంలో దాదాపు 28 పుస్తకాలను బ్రిటీషు ప్రభుత్వం నిషేధించింది. అవి : 1. గాంధీ మహోదయం 1921, 2.గాంధీ విజయం నాటకం 1921 3. భారతగీతములు 1921, 4.హిందూ దేశము, పూరంవ, ప్రస్తుత పరిస్థితులు. 5. దండాలు దండాలు భారతమాత 1921, 6.స్వరాజ్య రథము 1921, 7.పాంచాల పరాభవము నాటకం 1922, 8.స్వరాజ్యోత్సవం పెద్ద గేయం 1922, 9.స్వరాజ్య సోపానం నాటకం, 1922, 10. స్వప్న ప్రయాణం కావ్యం, 1922, 11. స్వరాజ్య గీత పుంజము, 1922, 12.స్వరాజ్య ప్రాప్తి సాధనం, 1923, 13.పంజాబు పాట గేయం, 1923, 14.మాలపల్లి నవల 1923, 15. తిలక్ మహరాజ్ నాటకం, 1923, 16. గాంధీ విజయధ్వజం నాటకం, 17. మహాత్మాగాంధీ భజనగీతాలు, 1924, 18.స్వరాజ్య జెండా, 1931, 19. మహాత్మాగాంధీ దశావతార లీలలు, 1932, 20. చిచ్చుల పిడుగు, 1932, 21. రైతు భజనావళి, 1937, 22. అమ్మ గోర్కి నవల 1935, 23. కార్మిక భజనావళి 1936, 24. కారల్ మార్చు ఉపదేశాలు, 1937, 25. రష్యా విప్లవం 1948, 26. జమీన్ రైతు నాటకం, రాతప్రతి 1938, 27. స్వతంత్ర గర్జన కవితలు, రాతప్రతి 1938 28. మాభూమి నాటకం.

## ముద్దుపళని రాధికాస్వాంతనము నిషేధం, 1910

తంజావూరు మరాఠా రాజుల కాలంలో ప్రతాప సింహుని (1739 – 1763) ఆస్థాన కవయిత్రి ముద్దుపళని. ఆమె రచించిన కావ్యం రాధికా స్వాంతనము. 1857లో ముద్రణ జరిగింది. ఇందు అసభ్య వర్ణనలున్నాయని బ్రిటీషు ప్రభుత్వ దృష్టికి రాగా, ప్రభుత్వం లండన్‌లోని న్యాయ నిపుణులను సంప్రదించి, పౌరుల మనోభావాలను దెబ్బ తీస్తుందనే ఉద్దేశంతో ఇండియన్ పీనల్ కోడ్, సెక్షన్ 292 ప్రకారం 1910లో ఈ పుస్తకంపై నిషేధం విధించింది. లభించిన ప్రతులన్నిటినీ జప్తు చేయడం జరిగింది. తదుపరి దీనిపై వచ్చిన విజ్ఞప్తులను బ్రిటీషు ప్రభుత్వం పరిశీలించింది. టంగుటూరి ప్రకాశం అవిభక్త మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రి అయిన సందర్భంలో ఈ పునర్విచారణ జరిగాక, ఈ గ్రంథంపై నిషేధం తొలగిస్తూ .. Restaring a few pearls the necklace of telugu literature అన్నారు. పిమ్మట 1952లో వావిళ్ళ వారు ఈ గ్రంథాన్ని పునర్ముద్రించారు.




## మాలపల్లి నవల

ఉన్నవ లక్ష్మీనారాయణ వంతులు పల్నాటి పుల్లరి పోరాటంలో పాల్గని, రాయవెల్లూరులో జైలు శిక్ష అనుభవించి 2-7-1922న జైలు నుంచి విడుదలయ్యారు. అదే రోజున వారి నుంచి జైలు అధికారుల మాలపల్లి రాత ప్రతిని స్వాధీనం చేసుకున్నారు. జైళ్ళ శాఖ ఇనస్పెక్టర్ జనరల్‌కు పంపారు. ప్రభుత్వ అనువాదకుని అనువాదం వచ్చాక దీన్ని అధ్యయనం చేసిన లా సెక్రటరీ – “ఇది ప్రజలకు ప్రభుత్వానికి కీడు చేసే రచన. ఇందు ఎన్నో అభ్యంతరకర అంశాలున్నాయి” అని సి.పి.సి. 99 (ఎ) సెక్షన్ కింద దీన్ని నిషేధించవచ్చుని నివేదిక పంపారు.

ఈ నివేదిక పరిశీలనలో ఉండగా 24-2-1923న వెలువడిన స్వరాజ్య పత్రికలో రహస్యంగా విడుదలైన మాలపల్లి నవలపై సమీక్ష వెలువడింది. ఉన్నవవారి సహఖైదీ మాడభూషి నరసింహాచారి గారు ఈ నవలలో 1-2 భాగాలు అచ్చేసి విడుదల చేశారు. అడ్వకేట్ జనరల్ సలహాతో ఈ నవలపై 14-5-1923న రెండవసారి నిషేధం విధించారు. ఈ నవలలో ప్రభుత్వం ఎత్తిచూపిన నిషేధాంశాలు ఇవీ :

1. మొదటి భాగం 21వ అధ్యాయంలో, "మహమ్మదీయ ప్రభువులు దుండగులై కొన్ని శిల్పాలను పాడు చేశారని దూషిస్తాం గానీ, ఆంగ్ల ప్రభువులు కమల కాసారంలో పద్ద కాసరముల వలె ప్రతి గ్రామమందు..." అనే వాక్యంలో "మహమ్మదీయుల ప్రసక్తితో పాటు కాసరములు అనే విశేషణాన్ని తొలగించమని" ఆజ్ఞాపించడం జరిగింది.

2. మొదటి భాగం 25వ అధ్యాయంలో ఈ కింది వాక్యాలు తొలగించాలి. "శవం కనపడగానే పోలీసు గద్దలు వాల్తవిగా. వాటిని వెళ్ళగొట్టే ఏర్పాటు చేస్తాం..." లంచాల పంపకంపై సంభాషణలో, "ముందు నాలుగు వందలూ ఇట్లా తీసుకో. ఊఁ.. ఇది డిప్టీ సూప్రండెంటు అయ్యవారిది. ఇది ఇన్‌స్పెక్టరిది. ఇది సిబ్బందిది. ఇది గ్రామస్థులది. తీసుకోండయ్య".

3. మూడవ భాగంలో రామదాసు సంభాషణ "ప్రభుత్వ పద్ధతి ఏది చూచినా మేడిపండు వ్యవహారంగా ఉంది. దీనిని సవరించవలెనని ప్రయత్నం చేయడమే తప్పు. కరిగిపొయ్యవలసింది తప్పు మాట్లు వేసి ప్రయోజనం లేదు."

4. 24వ అధ్యాయంలో జగ్గడు (వెంకటదాసు) ఉపన్యాసంలోని ఈ కింది భాగాలు "ఫక్తు కమ్యూనిజాన్ని ప్రబోధిస్తూ ధనికస్వామ్యంపై శ్రామికుల సంఘీభావాన్ని సమ్మెలకు ప్రోత్సహిస్తున్నాయి" కనుక తీసివేయమని ఆజ్ఞాపించారు.

"(అది తెలిసి ఐశ్వర్యవంతులు తక్కినవన్నీ అరుసుకున్నారు.) రాజ్యాలు, మండలాలు, పట్టణాలు వాండ్ల పరమయినవి. పెద్ద దొంగా, చిన్న దొంగా అనే భేదంతో అందరూ దొంగలే! సంఘం యొక్క ఆస్తి అంతా అపహరించి శాశ్వతంగా వంశ పారంపర్యంగా నిలుపుకోడాని కనుకూలమైన చట్టాలు గల్పించుకున్నారు."

"(కష్టపడి పంటలు పండించి చేతి పనులు చేసి అమర్చిన పదార్థమంతా ధన పంతులపహరించి తిని తొక్కతొంబాడి చేసి శ్రమపడి పనిజేసేవాండ్లకు ఆహారం లేకుండా చేస్తున్నారు) భాగ్యవంతులు పండుగలు బీదవాండ్ల కెండగలు. భాగ్యవంతుల కువకువలు బీదలకు పస్తులు. భాగ్యవంతులు పొలాలు తమవనీ, మూలధనం తాము బెట్టి బీదలకు యంత్రములలో పని కల్పిస్తున్నామనీ అనేక సాకులు గల్పించి పనివాండ్ల శ్రమయొక్క ఫలమంతా అపహరించటం నమ్మక ద్రోహం గాదుట. అది దొంగతనమే గాదుట. ఆ ఆస్తిలో దొంగలకే కాక వారి సంతానానికి కూడా చిరకాల హక్కు కలుగుతుందట".

"(బీదలు తమ హక్కును తీసుకుంటే చౌర్యం) సుంకాలు విధించి దేశీయ వృత్తులను నశింపుజేసి వేలకోట్ల ఇండియా ధనాన్ని హరించడం దొంగతనం గాదని చట్టం చెపుతున్నది. ఈ పనులు తప్పన్నా, వీటిని సవరించినా చౌర్యమూ, రాజద్రోహమూ అవుతుందని చట్టాలుజేసి పెట్టుకున్నారు".

"(కలియుగంలో రాక్షసులు లేరంటారు గాని ధనికులే కలియుగ రాక్షసులు) ఈ రాక్షసత్వం బీదల హింసించడం వల్ల వాండ్లకు గలిగింది. ధనభారమే వాండ్లను కుంగదీస్తున్నది. వాండ్ల ఆత్మలూ, దేహాలూ గూడా దుష్కర్మల వల్ల విరూపమునుబొందుతున్నవి".



'మాలపల్లి' నవల 1923లో మొదట ప్రచురింపబడింది. 1928లో రెండవ ముద్రణ పొందింది. ప్రభుత్వం సూచించిన భాగాలను తీసివేసి రివైజ్డ్ ఎడిషన్ ఆంధ్ర గ్రంథమాల వారు ప్రచురించారు. 1964లో త్రివేణీ పబ్లిషర్స్, మచిలీపట్నం. వారు నాల్గవ ముద్రణ వేశారు. ఈ నవలను బ్రిటీష్ ప్రభుత్వం 1923లో ఒకసారి, 1936లో మరోసారి నిషేధించింది. 1937 జులై 30న రాజాజీ మంత్రివర్గం ఏర్పడిన పక్షం రోజులకు ఈ నవలపై నిషేధం తొలగించబడింది.

### మరీచిక నవలపై నిషేధం

సుప్రసిద్ధ నవలా రచయిత వాసిరెడ్డి సీతాదేవి గారి నవల మరీచిక. 1978లో ఆంధ్రభూమి వార పత్రికలో ధారావాహికగా అచ్చయి, 1979లో పుస్తక రూపంలో అచ్చయింది. నాలుగేళ్ల తరువాత ప్రభుత్వం మేలుకొని – ఈ నవలలో వర్గ విద్వేషం, సంఘర్షణ, వర్గ నిర్మూలనను, హింసాయుత విప్లవాన్ని పోషించే అంశాలున్నాయని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1982 మార్చి 29న నిషేధించింది. ఈ నిర్ణయాన్ని వ్యతిరేకిస్తూ ఆంధ్రభూమి, ప్రజాశక్తి, రాజధాని దినపత్రికలు సంపాదకీయాలు రాశాయి. సుప్రసిద్ధ రచయితలంతా రచయితల భావస్వేచ్ఛకు ఈ నిర్ణయం గొడ్డలి పెట్టని విమర్శించారు. ప్రభుత్వం పుస్తకాల షాపుల్లో, గ్రంథాలయాల్లో లభించే ఈ నవల కాపీలను జప్తు చేసింది. సీతాదేవి గారి ఉద్యోగం స్థాయి తగ్గించింది. దీనిపై హైకోర్టులో విచారణ జరిగినపుడు ఈ నవలను నిషేధించడానికి ప్రభుత్వం చూపిన కారణాలు అంత పటిష్టంగా లేవని, ఈ రచనలో యువతను పెడదారి పట్టించే అంశాలు లేవని




హైకోర్టు అభిప్రాయపడి, నవలపై నిషేధాన్ని 1982 ఆగస్టు 10న ఎత్తివేసింది. సీతాదేవి గారికి ఉన్నతోద్యోగం లభించింది.

**స్వాతంత్ర్య అనంతర నిషేధాలు**

1. మాభూమి : సుంకర సత్యనారాయణ,
వాసిరెడ్డి భాస్కరరావు
2. ముందడుగు : సుంకర, వాసిరెడ్డి
3. ఎర్రజండాలు (పోరాట గాథలు)
గంగినేని వెంకటేశ్వరరావు
4. లే – కవితా సంపుటి : టి.సుభాష్
5. బైబుల్ బండారం : ఎన్.వి.బ్రహ్మం
6. మరీచిక : వాసిరెడ్డి సీతాదేవి

**సినిమా గీతాలపై ఆంక్షలు**

1935 నుంచి జమిందారీ వ్యతిరేక పోరాటాలు జరుగుతున్నాయి. అదే సంవత్సరం గూడవల్లి రామబ్రహ్మం దర్శకత్వంలో రైతుబిడ్డ సినిమా విడుదలైంది. ఇందు జమీందార్లపై ద్వేషపూరిత ఘట్టాలున్నాయనే మిషతో చిత్రంలోని కొన్ని గీతాలపై అభ్యంతరాలు వచ్చాయి. సినిమాటోగ్రాఫ్ చట్టం కింద ప్రాంతాల్లో చిత్రాన్ని ప్రదర్శించరాదని ఉత్తర్వులు వచ్చాయి. ఇవి గ్రామఫోను రికార్డుల్లో పి.సూరిబాబు రాసిన ఆంధ్రరాష్ట్రం, లెండి కార్మికులారా అనే పాటలను ప్రభుత్వం నిషేధించింది. అలాగే సరస్వతీ స్టోర్సు వారు, హిజ్–మాస్టర్సు వాయిస్ వారు చేసిన స్వాతంత్రోద్యమం తాలూకు రికార్డులపై నిషేధం విధించారు.

■



# నెలల చందమామ

దాదాపు వంద మౌనాలూ
ఒక్కో మౌనం చేతిలో ఒక్కో సెల్ఫోనూ ఉన్న
ఆ బోగీలో
వాడొక్కడే ప్రాణం ప్రవహించే జీవి
అంత పెద్ద చీకటి గదిలో
ధైర్యంగా వెలిగే నెలల చందమామ
బతక నేర్చిన వాళ్ళవి ఎన్నెన్ని భాషలో
వాడిది ఆకలీ ఆనందాల భాష
నిద్రా మెలకువల మధ్య
లోలోపలి వసంతాల్ని మేల్కొలిపే ఆదిమ స్వరం
వాడొక సంస్కర్త
తను లేచి నలుగురినీ నిద్రలేపేవాడు
రంగుల చీకటిలో మునిగిపోయిన లోకానికి
కిటికీకి ఆవల పచ్చని ప్రపంచాన్ని చూపించేవాడు
అసమ్మతినీ అసహనాన్నీ
నిర్మొహమాటంగా ప్రకటించే
ప్రజాస్వామ్యం వాడిది
లేనివాడికీ ఉన్నవాడికీ
ఒకేలా నవ్వుల ధనం పంచే సామ్యవాది
వాడితో కలిసి ప్రయాణించింది
ఒక రాత్రీ ఒక మధ్యాహ్నం లోపే అయినా
మనసు నిండా ఎన్ని పూలతోటలో నాటాడు
కళ్ళల్లో ఎన్ని సంబరాలనో ఎగరేసాడు
నాలోని పిల్లాడిని
ఆడించీ పాడించీ ముద్దుచేసీ
అమ్మమబ్బు చాటునుంచి
చేతులూపుకుంటూ వెళ్ళిపోయాడు
బహుశా ...
ఎక్కడో చోట మళ్ళీ కలుస్తాడు
సన్యసించిన ఆకాశంగానో
నవ్వులింకిన నేలగానో కాకపోతే బాగుండు!

– సాంబమూర్తి లండ
96427 32008

# సాహిత్య విమర్శకుల మాట

## ఉన్నవ - గురజాడ - ముందు చూపు



ఫ్యూడల్ వ్యవస్థలో వుంటూ రాజభక్తి కన్నా దేశభక్తి మిన్న అని గురజాడ అప్పారావు గారు ముందుచూపు ప్రదర్శించినట్టు ... గాంధీ ప్రభావంలో వున్నా రానున్న సోషలిస్టు ఉద్యమాలను ఊహించినవారు ఉన్నవ లక్ష్మీనారాయణ గారు. ఈయన డబ్లిన్ నగరంలో బారిస్టరు పరీక్ష చదివి ఉత్తీర్ణులయ్యారు. ఐరిష్ స్వాతంత్రోద్యమాన్ని స్వయంగా వీక్షించారు. దాని నాయకుడైన డివేలరాతో పరిచయం ఏర్పర్చుకున్నారు. సామ్యవాద గ్రంథాలను అధ్యయనం చేసినట్టున్నారు. సహాయ నిరాకరణలో జైలుకు వెళ్లి అక్కడే మాలపల్లి అనే అత్యుత్తమ నవలను రచించారు. తక్కెళ్ల జగ్గడు అనే పాత్ర ద్వారా సమధర్మాన్ని బోధించాటు. తెలుగులో సామ్యవాద సాహిత్య పితామహులయ్యారు. స్వరాజ్య సోది, బుడబుక్కల జోస్యము వంటి ప్రజాకళల ద్వారా వీరు ఆనాడే ప్రజాసాహిత్యాన్ని ప్రారంభించారు. రష్యాలో లెనిన్ నాయకత్వాన విజయవంతమైన విప్లవ ప్రభావం ఉన్నవ వారి మీద ప్రగాఢంగా వుంది. సమాజంలోని వర్గ స్వభావాలను క్షుణ్ణంగా అవగాహన చేసుకున్నారు.

- ఆరుద్ర

---

## వ్యవహార భాషకు పట్టం కట్టిన ఉన్నవ

మాలపల్లి రచయిత ఉన్నవ లక్ష్మీనారాయణ 'సుప్రసిద్ధాంధ్ర నాయకులు, సంస్కర్తలు, సాహిత్య విశారదులు, కార్యశూరులు.' తాము జాతీయరంగంలో చేపట్టిన ఒక సంఘ సంస్కరణ కార్యక్రమానికి అక్షర రూపం కల్పించారు ఉన్నవ వారు ఈ నవలలో. హరిజనులన్న పేరును గాంధీజీ ప్రయుక్తం చేయకముందు అస్పృశ్యులుగానూ కడజాతివారుగానూ చూడబడుతున్న వారి గురించి నవల రాయడం ఎంతో సాహసం ఆ రోజుల్లో.



ఈ నవల ప్రాముఖ్యానికి మరో కారణం ఇది వ్యావహారిక భాషలో వ్రాయబడడం. ఉన్నవవారు గుంటూరు జిల్లా మెట్ట తాలూకాల మాండలికాన్ని తెలుగుల వ్యవహార భాషను వాడి భాషకు మహోపకారం చేశారు.

ఈ నవలలోని మరో ముఖ్యమైన లక్షణం అందులోని తెలుగుదనం. కేవలం గ్రామీణ జీవితాన్ని అందునా అట్టడగున వున్న గ్రామీణులను తీసుకుని వారి అభ్యుదయాన్ని కాంక్షిస్తూ వ్రాయబడిన రచనలలో ఇది ఉత్కృష్టమైనది. ఆంధ్రుల సహజ జీవన విధానంతో పాటు అగ్రవర్ణాల వారి అహంకారం కూడా ఇందులో వివరంగా వ్యక్తం చేశారు. 'జాత్యాధిక్యత అహంకారమునకు హేతువగుటచే సవర్ణులు భగవంతునకు దూరమగుచున్నారు. కడజాతి వారికి మేమెక్కువను అభిమానముండదు. గనక వారికి ముక్తి సమీపము. సవర్ణులకు అహంకారము జన్మసిద్ధము. కడజాతివారికి అనహంకారము జన్మసిద్ధము"

ప్రేమను మించిన సాధనం లేదనీ, సంఘ సేవ చేయనిదే ఎవరూ దానిచేత పోషించబడటానికి అర్హులు కాదనీ, ఆత్మోపలబ్ధికి కర్మయోగం ఉత్తమమార్గమని చెప్పి యీ నవలను ఆధునికగీతగా ప్రవచించారు ఉన్నవ వారు.

- డా.మొదలి నాగభూషణ శర్మ



# మాలపల్లి - బహుముఖ చిత్రణ

ఉన్నవ లక్ష్మీనారాయణ మాలపల్లి జాతీయోద్యమాన్ని బహుముఖంగా చిత్రించిన నవల. జాతీయోద్యమంలో అనేకమంది రచయితలు జైళ్లకు వెళ్లారు. సామ్రాజ్యవాదులు అనేక రచనల్ని నిషేధించారు. తెల్లదొరల నుంచి నల్లదొరలకి అధికార మార్పిడి జరగడంతో జాతీయోద్యమ సాహిత్య శకం అంతరించింది.

- డా. త్రిపురనేని మధుసూదనరావు

# ఫాంటసీనా? భావి కాలజ్ఞతా?

మాలపల్లి కథ మాత్రమే కాదు, అందులోని పాత్రలూ ప్రత్యేకత గలవే. 'వ్యవసాయానికి కూలీ ముఖ్యుడు గానీ మీరు చెప్పే భూస్వామి కాదు' అని కామందు ముందు ఖరాఖండిగా వాదించిన సంగదాసు పాత్ర చిత్రణ ప్రత్యేకించి పేర్కొనదగ్గది. చౌదరయ్యకున్న ఆస్తి హక్కును, దోపిడీశక్తిని ప్రశ్నించిన సంగదానును అతడు రాగోల తీసుకుని చావగొట్టినప్పుడు రచయిత ఉన్నవ వర్ణన స్మరణీయం. 'సంగదాసు తల దానిమ్మ పండు వలె బద్దలైంది. లోకంలోని అక్రమాలను చూసి ఆక్రోశించిన రక్తం, ఉన్నత భావాలను ఉద్రేకించిన రక్తం, పరుల సేవలో పాలిపోయిన రక్తం, పవిత్రభావాల చేత పావనమైన రక్తం, గొట్టాన చిమ్మినట్టు భూమి పావనమైంది' ఈ వర్ణనను బట్టి ఉన్నవ ఎవరి పక్షమో స్పష్టం. తక్కెళ్ల జగ్గని రూపంలో వెంకటదాసు పాత్ర అమోఘం. కష్టం చేసినా కూలీల కడుపులెందుకు నిండటం లేదో గుర్తించిన వాడతడు... జగ్గని ధర్మతత్వాలు జనానికి మేలుకొలుపులు.. జగ్గడు ప్రభుత్వానికి పట్టుబడ్డాక కోర్టులో ఇచ్చిన వాంగ్మూలం గోర్కి అమ్మ నవలలో పావెల్ వాంగ్మూలాన్ని తలపిస్తుంది.



బరువైన వేదాంత చర్చలు, ఉపన్యాసాలు పాఠకులకు కొంత విసుగు కలిగించే మాట నిజం. కాని **1922** నాటికి తెలుగు నవల శిల్పంలో శైశవ దశలో తప్పటడుగులు వేస్తున్న వాస్తవాన్ని గుర్తుంచుకోవాలి. ఉన్నవ రచనలో ఎంత వాస్తవికత వుందో అంత ఫాంటసీ వుందనేది కూడా మరో విమర్శ. **1920** నాటికి ఆంధ్రలో లేని కార్మికోద్యమం, రైతు కూలీ ఉద్యమం, తరువాత దాదాపు **27** ఏళ్లకు వచ్చిన స్వాతంత్రం వగైరాల్ని (చిత్రించడం) అందుకు ఉదాహరణగా చెప్పొచ్చు. **1918** అహ్మదాబాదు మిల్లుల సమ్మెలో గాంధీజీ జోక్యం, అంతకుముందు చంపారన్ సత్యాగ్రహం వీటి నేపథ్యంలో ఆయన ఆంధ్రదేశంలో కార్మికోద్యమాన్ని, రైతుకూలీ ఉద్యమాన్ని ఊహించివుండవచ్చు. అవి ఆయన భావి కాలజ్ఞతకు సూచికలుగా భావించాలి.

- సతీనాసి

జనకవనం ప్రారంభసభలో మాట్లాడుతున్న తెలకపల్లి రవి; వేదికపై పాపినేని శివశంకర్, ఉషారాణి, నల్లూరి రుక్మిణి, ప్రసాదమూర్తి, ఖాదర్ మొహియుద్దీన్, కెంగార మోహన్ తదితరులు



# జనకవనం .. ప్రజాకవిత్వానికి గట్టివాగ్దానం

కష్టజీవికి ముందూ వెనుకా దన్నుగా నిలిచేవాడే కవి అన్నాడు మహాకవి శ్రీశ్రీ. కవుల కర్తవ్యానికి, దృక్పథ నిర్దేశానికి ఆ ఒక్క మాటా గొప్ప నిర్వచనం. కళ కళ కోసం కాదు, కేవలం వినోదం కోసమూ కాదు; కళ ప్రజల కోసం ... అన్న ప్రగతివాదుల నినాదం కూడా కళల పరమార్థానికి, ప్రయోజనకత్వానికి గొప్ప దారి దీపం. కళలు, సాహిత్యమూ సమాజ ఉద్ధరణకు దోహదపడాలనే ధోరణి, ఆచరణా స్వాతంత్ర్య ఉద్యమ కాలంలో బలంగా వేళ్లూనుకొంది. కమ్యూనిస్టుల ప్రత్యేక కృషితో తెలుగునాట అది గొప్ప సాంస్కృతిక వికాసంగా పరిఢవిల్లింది. కళలనూ, కవిత్వాన్ని ప్రజల పథంలో నడిపించటానికి ప్రగతిశీల ఉద్యమాలు ఇప్పటికీ గట్టి ప్రయత్నమే చేస్తున్నాయి. సిపిఎం 26వ రాష్ట్ర మహాసభల సందర్భంగా 2021 డిసెంబరు 19వ తేదీన గుంటూరులో జరిగిన జనకవనం అలాటి కృషికి కొనసాగింపు.

19వ తేదీ ఉదయం 11 గంటలకు జనకవనం ప్రారంభ సభ మొదలైంది. ఆహ్వాన సంఘం ప్రధాన కార్యదర్శి పాశం రామారావు తొలుత కవులకు, సాహితీ వేత్తలకు స్వాగతం పలికారు. కవులూ కళాకారులూ నిత్యం ప్రజా ఉద్యమాలకు బాసటగా నిలవాలని తాము ఆశిస్తున్నామని, అందుకనే ఈ జనకవనం ఏర్పాటు చేశామని చెప్పారు. కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత, ప్రముఖ సాహితీ వేత్త పాపినేని శివశంకర్ ముఖ్య అతిధిగా పాల్గొని... కవులకు దిశానిర్దేశం చేశారు. "కవులు ఏం రాయాలి? ఎవరి పక్షాన నిలబడాలి? ఏఏ అంశాలను కవిత్వం చేయాలి? ఏ పద్ధతిలో కవిత్వాన్ని ప్రకటించాలి? ... ఇదంతా ఎవరికి వారు నిర్ణయించుకోవాలి. అలా నిర్దేశించుకోవటానికి మాత్రం కచ్చితంగా సాధన చేయాలి. అలా చేసినప్పుడే నిజమైన కవి రూపుదిద్దుకుంటాడు. బలమైన కవిత్వం బయటికి వస్తుంది." అని వివరించారు. "తనచుట్టూ సమాజాన్ని కవి పరిశీలించాలి. లోతుగా అధ్యయనం చేయాలి. తీవ్రంగా అన్వేషించాలి. తాను కనుగొన్న అంశాన్ని బలంగా, లోతుగా చెప్పటానికి చాలా సాధన చేయాలి. ఆ తరువాత తనదైన గొంతుతో కవిత్వాన్ని వ్యక్తీకరించాలి. ఇన్ని దశల్లో కవి నిరంతంగా ప్రయాణం చేసినప్పుడే మంచి కవిత్వం పుడుతుంది." అని చెప్పారు. మన చుట్టూ ఆవరించి ఉన్న సమస్యలపైనా, సందిగ్ధాల పైనా కవిచూపు ఉండాలని చెబుతూ... 'ఒకడు – ఇంకొకడు – మరొకడు' శీర్షికన కవిత చదివి వినిపించారు. తరువాత ప్రముఖ సామాజిక, రాజకీయ విశ్లేషకులు, సాహితీ స్రవంతి రాష్ట్ర గౌరవాధ్యక్షులు తెలకపల్లి రవి ప్రారంభోపన్యాసం చేశారు. "సరిగ్గా 20 ఏళ్ల క్రితం హైదరాబాదులో సిపిఎం జాతీయ మహాసభలు జరిగినప్పుడు జనకవనం అనే నవీన కవితా దృక్పథాన్ని ప్రారంభించినట్టు చెప్పారు. "కవిసమ్మేళనం, కవితాపఠనం వంటి మాటల స్థానే – జనంతో కవిత్వానికి ఉన్న బంధాన్ని, సంబంధాన్ని వెల్లడి చేస్తూ– 'జనకవనం' అనే పదబంధాన్ని ప్రారంభించాం. ఆ పంథా ఇరవై ఏళ్లు నిర్విఘ్నంగా, నిరంతరంగా సాగిస్తున్నాం. తెలుగునాట సాహిత్యాన్ని ప్రజాపరంగా వెలువరించిన ఘనత కమ్యూనిస్టు ఉద్యమానికి చెందుతుంది. గురజాడ, జాషువా, శ్రీశ్రీ వంటి మహానుభావుల ఒరవడిలో ప్రజాసాహిత్యాన్ని మరింత ముందుకు తీసుకెళ్లాల్సిన అవసరం ఉంది. ఉన్మాదాలూ

ఉద్రేకాలూ రాజకీయాలుగా నడుస్తున్న ప్రస్తుతకాలంలో గొంతెత్తటమే నేరమై పోతుంది. మనుషులను విభజించి, మతతత్వం రగిలిస్తున్న పాలకులు ఉన్న తరుణంలో కవులు మరింత సూటిగా, స్పష్టంగా కవిత్వాన్ని వెలువరించాలి. నల్లచట్టాలను తిప్పికొట్టిన రైతుల స్ఫూర్తితో విశాఖ ఉక్కు పరిరక్షణకు అక్షర కవచాలు అందించాలి. అప్పుడూ ఇప్పుడూ సాగుతున్న రాజధాని భ్రమలను బట్టబయలు చేసే కవిత్వాన్ని వెలువరించాలి. ప్రజల, రైతుల ఆకాంక్షలను బలపరిచే అక్షరాయుధాలు అందించాలి. కవులూ కళాకారులూ రచయితలూ ఏ పక్షమూ కాదు; ప్రజల పక్షం అని చాటి చెప్పాలి." అని పిలుపునిచ్చారు. తరువాత జనకవనం .. జనకవనం అంటూ స్వీయ కవితను చదివి, జనకవనాన్ని ప్రారంభించారు. తరువాత ప్రముఖ కవులు ప్రసాదమూర్తి, ఖాదర్ మొహియుద్దీన్, నల్లూరి రుక్మిణి (విరసం), సోమేపల్లి వెంకట సుబ్బయ్య (గుంటూరు రచయితల సంఘం), కె ఉషారాణి, చెరుకూరి సత్యనారాయణ, పెనుగొండ లక్ష్మీనారాయణ (అరసం) తమ సందేశాలను వినిపించారు. కవులకు పలు సూచనలూ సలహాలూ అందించారు.

మధ్యాహ్న భోజన విరామం తరువాత శ్రీనివాస్ గౌడ్ 'సమాధి కానివాడు' కవితతో జనకవనం మొదలైంది. 'సమాధికానివాడి కోసం వెతుకుతున్నా.. లోపలింకా నిప్పు ఉన్న వాడి కోసం వెతుకుతున్నా/ సమాధి పగుళ్లతో నుంచి/ ఒక తెమ్మెర తొంగిచూస్తుందేమోనని/ మోహం వాచి ఉన్నాను" అంటూ నిత్య సత్యమై జ్వలించే చైతన్యాన్ని ఆకాంక్షిస్తూ ... కవితను ముగించారు. తరువాత కవితలను వినిపించిన కవులు ఆ పిలుపును అందిపుచ్చుకున్నట్టుగా – అనేక సమకాలీన సమస్యలపై కవిత్వాన్ని వినిపించారు. మానవ సంబంధాలు యాంత్రికంగా మారిపోవడంపై కొందరు ఆవేదన వ్యక్తం చేశారు. మనిషిని వదిలి మతోన్మాదానికి ప్రాధాన్యం ఇస్తున్న పాలకుల కుయుక్తులను ఇంకొందరు ఎండగట్టారు. కార్మికులు, కర్షకుల మైత్రి మరింత బలపడాలని, ఢిల్లీ రైతుల స్ఫూర్తితో ముందుకు సాగాలని అక్షరాలా ఆకాంక్షించారు మరికొందరు కవులు. ఏ ప్రలోభాలకు లొంగని, ఏ బెదిరింపులకూ వెరవని ఎర్రజెండా ఉన్నతంగా ఎగరాలని, ఎదగాలని కొందరు కవులు అభిలషించారు. స్థానిక సమస్యలు మొదలుకొని ఆఫ్ఘనిస్తాన్ అలజడుల వరకూ కవులు గొంతుల్లో ప్రతిధ్వనించాయి. కవుల్లో కొందరు నిర్వాహకుల ఆహ్వానం అందుకొని రాగా, మరికొందరు పత్రికల్లో ప్రకటన చూసి వచ్చారు. అనివార్య కారణాల వల్ల రాలేకపోతున్నామని కొందరు తమ సందేశాలను, కవితలను పంపారు. సుమారు 80 కవులు ఈ జనకవనంలో పాల్గన్నారు. ప్రజాపక్షం వహిస్తామని, అసమానతలపై గొంతెత్తుతామని ఆచరణాత్మకంగా వినిపించారు. రచయిత సంఘాల నిర్వాహక మిత్రులు కలిమిశ్రీ, చలపాక ప్రకాశ్, ప్రజానాట్యమండలి నాయకులు నూతలపాటి కాళిదాసు తమ ఆత్మీయ సందేశాలు వినిపించారు. సాయంత్రం 5 గంటలకు తెలకపల్లి రవి తుది పలుకులతో జనకవనం ఉత్తేజకరంగా ముగిసింది. జనకవన విభాగాన్ని సత్యాజీ, శాంతిశ్రీ, వీరప్రసాద్, గోపీనాథ్, వై శ్రీనివాస్, వైష్ణవిశ్రీ నిర్వహించగా, ప్రారంభ సభకు సాహితీ స్రవంతి రాష్ట్ర అధ్యక్షుడు కెంగార మోహన్ అధ్యక్షత వహించారు. సమకాలీన సమాజపు అసమానతలను, పాలకుల కార్పొరేటు అనుకూల విధానాలను దునుమాడుతూ కవిత్వం వినిపించిన కవులు ... జనపక్షాన తమ కలాన్ని, గళాన్ని నిలబెడుతున్నారని ఈ జనకవనం చాటిచెప్పింది. భవిష్యత్తులో మరింత ప్రజాకవిత్వం వెల్లువెత్తటానికి గొప్ప స్ఫూర్తిని అందించింది.

---

సాహితీ స్రవంతి కర్నూలు జిల్లా అధ్యక్ష కార్యదర్శులుగా

## శ్రీనివాసమూర్తి, ఆవుల బసప్ప



శ్రీనివాసమూర్తి



ఆవుల బసప్ప

సాహితీ స్రవంతి కర్నూలు జిల్లా అధ్యక్ష ప్రధాన కార్యదర్శులుగా శ్రీనివాసమూర్తి, ఆవుల బసప్ప ఎన్నికయ్యారు. కర్నూల్లోని కార్మిక కర్షక భవన్‌లో జరిగిన జిల్లా విస్తృతస్థాయి సమావేశంలో కమిటీ పునర్నిర్మాణం చేశామని సంఘం రాష్ట్ర కార్యదర్శి జంధ్యాల రఘుబాబు తెలిపారు. ఇందులో భాగంగానే కోశాధికారిగా దాదపోగు అయ్యన్న, ఉపాధ్యక్షులుగా మాదాల శ్రీనివాసులు, సక్కిరి భాస్కర్; సహాయకార్యదర్శులుగా పులిచేరి మహేష్, సూగూరు సుధాకర్‌లను ఎన్నుకున్నామని తెలిపారు. సాహితీ స్రవంతి జిల్లా మహిళా కన్వీనర్‌గా, సాహిత్య ప్రస్థానం బాధ్యులుగా ఎన్.నాగమణి నియమితులయ్యారు. నూతన కమిటీని రాష్ట్ర అధ్యక్షులు కెంగార మోహన్ అభినందించారు.

సుధాకర్



# కొత్త గబ్బిలం ఎగిరిపోయింది!

❑ సత్యాజీ

ప్రముఖ కవి, విద్యావేత్త ఎండ్లూరి సుధాకర్ మృతి పట్ల సాహితీ స్రవంతి రాష్ట్ర కమిటీ తీవ్ర దిగ్భ్రాంతిని వ్యక్తం చేసింది. పీడిత ప్రజల స్థితిగతులపై బలమైన కవిత్వాన్ని వెలువరించిన సుధాకర్ మృతి తెలుగు సాహిత్యానికి తీరని లోటని సాహితీ స్రవంతి రాష్ట్ర అధ్యక్ష కార్యదర్శులు కెంగార మోహన్, కె సత్యరంజన్, గౌరవాధ్యక్షులు తెలకపల్లి రవి పేర్కొన్నారు.

ఆయన మాట నెమ్మది. మనసు వెన్నెలంత చల్లనిది. వాక్యం వెన్నముద్దలా చాలా మృదువైనది. సరళమైనది. భావం బాణంలా చాలా పదునైనది. ప్రతిభావంతమైనది. సరాసరి మనసులోకి చొచ్చుకుపోతుంది. ఆయన కవిత్వంలో గంభీరమైన పదబంధాలు ఉండవు. మన అనుభవంలో లేని ఉపమానాలు తారసపడవు. మనసు విప్పి మాట్లాడినట్టుగానే ఉంటుంది. ఆ మాటల్లో ఓ గమ్మత్తయిన కనికట్టు ఉంటుంది. వివక్షపై, విస్మరణపై సూటైన విమర్శ ఉంటుంది. చదవటం పూర్తయ్యేసరికి గొప్ప కవిత్వ పరిమళం మన హృదయం చుట్టూ ఆవరించి ఉంటుంది. ఒక ఆలోచనా వలయం మన తలనిండా పరుచుకొంటుంది. ఆచార్య ఎండ్లూరి సుధాకర్‌కి ఈ కవిత్వ విద్య బతుకులోంచి అలవడింది. అక్షరాలు నేర్వడం నుంచి విశ్వవిద్యాలయంలో ఆచార్య పదవిని అందుకునేదాకా ఆయన సాగించిన నడక నల్లేరు మీద కాదు; పల్లేరు ముళ్ల కంచెల మీద!

1959 జనవరి 21వ తేదీన నిజామాబాద్ జిల్లాలోని పాముల బస్తీలో అమ్మమ్మ గారింట పుట్టిన సుధాకర్ బాల్యమూ, చదువూ హైదరాబాదులో సాగాయి. కృపానందం గారి వీధి బడిలో అక్షరాలు నేర్చుకున్నాడు. పెద్ద బాలశిక్షే ఓ పెద్ద ప్రపంచంగా మారింది. చిన్నప్పుడే ఏవేవో చిన్న చిన్న పనులు చేస్తూ ... వీధిలో అమ్మే పాత పుస్తకాలు కొనుక్కొని చదివేవాడు. నల్లగుంట ప్రాచ్య కళాశాలలో, ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఉన్నత విద్య సాగింది. తొలుత హైదరాబాదులోనే తెలుగు ఉపాధ్యాయుడిగా పనిచేశారు. తరువాత పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంలో అధ్యాపకుడిగా చేరి, అంచెలంచెలుగా ఎదిగారు. 1992లో వెలువడ్డ 'వర్తమానం' ఆయన తొలి కవితా సంపుటి. గొప్ప సంచలనం సృష్టించింది. సరళమైన భాష, సహజమైన అభివ్యక్తి, బలమైన భావజాలంతో ... సామాన్య పాఠకుల అభిమానాన్ని, సాహిత్య విమర్శకుల ప్రశంసలను పొందింది. ఆ సంపుటిలోని 'గూర్ఖా' కవిత అనేక భారతీయ భాషల్లోకి తర్జుమా అయింది.

సుధాకర్‌కు అత్యంత ఇష్టమైన కవి జాషువా. ఆయన సాహిత్యంపై పరిశోధన చేసి, పిహెచ్‌డి పట్టా పొందారు. తన కవిత్వంతో కులవివక్షను, అంటరానితనాన్ని చీల్చి చెండాడారు. ఎస్సీ వర్గీకరణ నేపథ్యంలో 'కొత్త గబ్బిలం' పేరిట ఓ దీర్ఘ కవిత రాశారు. జాషువా గబ్బిలాన్ని శివుడికి విన్నవించటానికి పురమాయిస్తే– సుధాకర్ తన కొత్త గబ్బిలాన్ని రాజధానికి రాయబారానికి పంపించారు. ఆయన 1990లో భార్య హేమలత, ఇద్దరు పసిపిల్లలతో యూనివర్సిటీ ఉద్యోగానికి రాజమండ్రి వచ్చారు. ఆ చారిత్రిక నగరిలో అద్దె ఇల్లు కోసం వెతుకుతుంటే– చాలాచోట్ల 'మీరేమిట్లు?' అన్న ప్రశ్న ఎదురయింది. కొత్త గబ్బిలానికి ఆ నగర వివక్ష గురించే తొలి ప్రబోధం చేశారు ఎండ్లూరి. "తండ్రీ, ఇది రాజమండ్రి/ కులం కలుగులోంచి ఇంకా బయటికి

రాని ఎంగ్రిడి / నడిచే పాదాలకైనా నాడాలు కొట్టగలదు/ నమ్మకంగా దేన్నయినా అమ్మకానికి పెట్టగలదు" అని నిర్ద్వంద్వంగా ఎద్దేవా చేశారు. శ్రీ కృష్ణ దేవరాయలు ఆముక్తమాల్యదలో చేసిన ఓ ప్రస్తావన ఆధారంగా "గోసంగి" దళిత కావ్యం రాశారు. "దళితులు అంటే మాలమాదిగలు మాత్రమే కాదు; అంతకన్నా వెనకబడినవారు అనేకమంది ఉన్నారు. ఇంకా ఈ సమాజంలో ఓటుహక్కు, కూటిహక్కు, ఓ గూటిహక్కు లేని సంచార జీవులకు సముచిత స్థానం కావాలి." అని ముందుమాటలో తన మనసును ఆవిష్కరించారు. 'అట్టడుగున పడి కాన్పించని ప్రతి ఒక్కరి ముంగిట్లోకి చదువు, ఉద్యోగం వంటి ప్రగతి ఫలాలు వెళ్లినప్పుడే మన స్వాతంత్ర్యానికి అర్థం' అని ఆయన అనేవారు.

సుధాకర్ 16 పుస్తకాలు వరకూ వెలువరించారు. ఆచార్యుడిగా అనేకమంది విద్యార్థుల సాహిత్య పరిశోధనలకు మార్గనిర్దేశం చేశారు. దేశ విదేశాల్లో వేలాది సభల్లో ప్రసంగించారు. ఆయన ఇల్లు విద్యార్థులతో, పరిశోధకులతో, సాహితీవేత్తలతో నిత్యం కళకళలాడేది. సహచరి హేమలత ఆయన సాహిత్య జీవితానికి వెన్నూ దన్నూ. రాయడంతోనే తన పని అయిపోయినట్టు కవిత్వాన్ని అలా వదిలేస్తే- ఆమె దానిని పఠించి, పరామర్శించి, అచ్చులోకి వచ్చేదాకా అక్షరక్షరం బాధ్యత వహించేవారు. వారిది అన్యోన్య దాంపత్యం. తన నీడలో ఆమె ఒదిగిపోయేలా ఆయన ఎన్నడూ ప్రవర్తించలేదు. కవయిత్రిగా, రచయిత్రిగా, అంతర్జాల పత్రిక నిర్వాహకురాలిగా హేమలత తనకంటూ ఒక స్థానం ఏర్పర్చుకుంటుంటే- వెనకనుంచి ఆయన చాలా సంతోషపడ్డారు. 2019లో ఆమె అనారోగ్యంతో కన్నుమూశాక- తనలో సగం కోల్పోయి విలవిల్లాడిపోయారు. తననే పలవరిస్తూ, కలవరిస్తూ చాలా స్మృతి కవిత్వం రాశారు. తన ఇద్దరు బిడ్డలను ఒక ఇంటివారిని చేస్తే తన బాధ్యత పూర్తవుతుందని ఆశ పడ్డారు. పెద్ద కుమార్తె మానస అమ్మానాన్నల్లాగానే కథలూ, కవిత్వం రాసి తన కంటూ ఒక పేరు సంపాదించుకొంది. మిళింద కథలకు కేంద్ర సాహిత్య యువ పురస్కారం పొంది, ఎండ్లూరికి పుత్రికోత్సాహం కలగించింది. మనోజ్ఞకు ఇటీవలే వివాహం అయింది.

సుధాకర్ చాలాకాలంగా మధుమేహంతో బాధపడుతున్నారు. దానిని కూడా ఓ సరదా కవిత్వంగా మార్చేసి, స్నేహితులను నవ్వించారు. "నా దేహమే ఒక చెరుకు పొయ్యిగా మారిపోయింది/ నన్ను కుట్టిన దోమ కూడా తేనేటీగై ఎగిరిపోయింది!/ ఆటుపోట్ల శరీర సముద్రాన్ని/ అతలాకుతలం చేస్తున్న చక్కెర తుపాన్లు/ ...." అంటూ "ఓ మధుమేహనాంగీ, నీ ఉదయ కాలపు ముద్దుల మెంతుల రుచీ/ నీ అధర నిష్యందాల కాకర రసపు చేదు కౌగిలీ/ నా మధుర ప్రపంచాన్ని కొట్టగొట్టగలవా?" అని ప్రశ్నించారు. 63 ఏళ్ల సాహిత్య ప్రియుడిని ఆ తీపిదెయ్యమే ఇప్పుడు ఎత్తుకుపోయింది! మధుమేహం కారణంగా తీవ్ర గాయాల పాలైన ఒక కాలిని ఐదు నెలల క్రితం వైద్యులు తొలగించారు. ఆ వెలితి నుంచి ఆయన మానసికంగా కోలుకోకముందే శుక్రవారం తెల్లవారు జామున (28.1.2022) గుండెపోటు ముంచుకొచ్చింది!

సుధాకర్ 'కలల అక్షరం' అనే కవితలో ఇలా చెప్పారు. బహుశా ఇది తన సమాధి మీద లిఖించదగ్గ తుది సందేశం ఏమో!

**"నన్నొక మొక్కను చేయండి**
**మీ ఇంటిముందు పువ్వునవుతాను**
**నన్ను ఊయలలూపి చూడండి**
**మీ కంటి ముందు పసిపాప నవ్వునవుతాను**
**నన్ను దేవుణ్ణి మాత్రం చేయకండి**
**ముక్కోటి దేవతలతో**
**విసిగిపోయాను వెలివేయబడ్డాను**
**నన్నొక గోడను చేయండి**
**ఒక వాక్యమై నిలదీస్తాను**
**నన్నొక పిడికిలి చేయండి**
**నలుగురి కోసం నినదిస్తాను"**

....

తెలుగు కవిత్వంలో ఎండ్లూరి సుధాకర్‌ది ఒక తిరుగు లేని సంతకం. నానా రకాల వివక్షలపై తిరుగుబాటు పతాకం. ఆయన జీవన పతాకం ఇప్పుడు అర్థాంతరంగా అవనతం అయ్యిందొచ్చుగాక! కవిత్వ పతాకం మాత్రం ఎగురుతూనే ఉంటుంది- అంతరాల, అంటరానితనాల సమాజం అంతరించేదాకా! ■

నివాళి

# అవధాన కవి ఆశావాది కన్నుమూత



అనంత సాహిత్య రంగంలో పద్యానికి, అవధానానికి చిరునామాగా మారిన ఆశావాది ప్రకాశరావు 2022 ఫిబ్రవరి 17న కన్నుమూశారు. ఆయన 1944 ఆగస్టు 2న అనంతపురం జిల్లా శింగనమల మండలంలోని కొరివిపల్లిలో కుళాయమ్మ, పక్కీరప్ప దంపతులకు జన్మించారు. తెలుగు పద్యానికి, అవధానానికి, వర్తమానకాలంలో ప్రసిద్ధుడైన ఆశావాది ఎన్నో వందల అవధానాలు దేశవ్యాప్తంగా చేశారు. దాదాపు 40 గ్రంధాలు రాశారు. కవిగా, వక్తగా, రచయితగా, సాహితీ కార్యకర్తగా, విద్యావేత్తగా ప్రముఖ అవధానిగా అనంత సాహితీ వనంలో ఏపుగా పెరిగిన పెద్ద సాహితీ వటవృక్షంగా ఉన్న పద్మశ్రీ ఆశావాది ప్రకాశరావు మఅతి సాహిత్య రంగానికి తీరని లోటని సాహితీ స్రవంతి జిల్లా గౌరవాధ్యక్షులు పిళ్లా కుమారస్వామి, జిల్లా అధ్యక్షులు డా.ప్రగతి, ప్రధాన కార్యదర్శి హిదయతుల్లా పేర్కొన్నారు. ఆశావాది తన అనుభవాల్ని అక్షరబద్ధం చేశారు. వీటిలో అవధాన దీపిక, అవధాన కౌముది, అవధాన కళాతోరణము, అవధాన వసంతము మొదలైనవి ఉన్నాయి. ఇవిగాక వరదరాజు శతకం, పార్వతీశతకం, మెరుపు తీగలు వంటి కావ్యాలు కూడా ఉన్నాయి. ఆశావాది ఎన్నో సత్కారాలు పొందారు. 1976లో దళితుల్లో ప్రథమ అవధానిగా 'తెలుగు వెలుగు' పురస్కారాన్ని రాష్ట్రప్రభుత్వం నుంచి పొందారు. 1986లో తెలుగు విశ్వవిద్యాలయం రాష్ట్రకవిగా సత్కరించింది. 1994లో ఉగాది పురస్కారాన్ని రాష్ట్రప్రభుత్వం ఇచ్చింది. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం 2000లో డిలిట్ డాక్టరేట్‌ను ఇచ్చి సత్కరించింది. 2005లో హరిజన సేవాసంఘం ద్వారా గాంధేయ వాద పురస్కారం పొందారు. అధికార భాషాసంఘం నుండి 'భాషాభిజ్ఞు' పురస్కారాన్ని పొందారు. ఆశావాది అనంత సాహితీ క్షేత్రంలో ఎన్నో తెలుగు విత్తనాలు వేసి సాహిత్యాన్ని సుసంపన్నం చేశారు. 2021లో కేంద్ర ప్రభుత్వం ఆయనను పద్మశ్రీ పురస్కారంతో సత్కరించింది.

# 'బుజ్జాయి' ఇక లేరు!



కవి దేవులపల్లి కృష్ణశాస్త్రి కుమారుడు, కార్టూన్ ప్రపంచంలో 'డుంబు' పాత్ర సృష్టికర్త, 'బుజ్జాయి' దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి (91) జనవరి 27 తేదీన కన్నుమూశారు. వృద్ధాప్య సమస్యలతో పాటు కొంతకాలంగా బాధపడుతున్న ఆయన చెన్నైలోని స్వగృహంలో తుదిశ్వాస విడిచారు. 1931 సెప్టెంబరు 11న తూర్పు గోదావరి జిల్లా పిఠాపురంలో జన్మించిన సుబ్బరాయశాస్త్రికి చిన్నతనం నుంచి చిత్రలేఖనమంటే మక్కువ. అదే ఆయన్ని బాపిరాజు, మొక్కపాటి, పిలకా, గోఖలే వంటి మహామహుల వద్ద చిత్రలేఖన మెలకువలు నేర్చుకునేలా ప్రేరేపించింది. తన తండ్రి దేవులపల్లి ఒడే బడిగా ఎదిగారు. తన కార్టూన్లలో 'బుజ్జాయి'గా చిరపరిచితుడైన ఆయన.. భారత్‌కు సరికొత్త కామిక్స్ కథల్ని పరిచయం చేశారు. ఎంతోమంది కార్టూనిస్టులకు స్ఫూర్తినిచ్చారు. ఆరు దశాబ్దాలకు పైగా ఇలస్ట్రేటెడ్ వీక్లీ ఆఫ్ ఇండియా, ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి వారపత్రికల్లో, ఇంకా తమిళం, ఆంగ్లం, హిందీ పత్రికల్లో ఆయన బొమ్మల కథలు పాఠకులను అలరించాయి. 17 ఏళ్ల ప్రాయంలోనే 'బానిస పిల్ల' పేరుతో 30 పేజీల బొమ్మల కథా పుస్తకాన్ని అచ్చు వేయగా, అది వేలాది కాపీలు అమ్ముడుపోయింది. 1963లో సంపూర్ణ 'పంచతంత్రం' 'ఇలస్ట్రేటెడ్ వీక్లీ ఆఫ్ ఇండియా'లో ధారావాహికంగా ఐదేళ్లు ప్రచురించారు. అది ఆయనకు జాతీయ స్థాయిలో పేరు తెచ్చిపెట్టింది. 'డుంబు' పాత్రను సృష్టించిన ఆయన.. దాని పేరుతో 1954లో ఆంధ్రప్రభలో సీరియల్ నిర్వహించారు. తెలుగు, తమిళ, హిందీ, కన్నడ, ఆంగ్ల భాషల్లో వందకు పైగా చిన్నారుల కామిక్స్, కథల పుస్తకాలు ముద్రించారు. 1959, 1960, 1961లలో వరుసగా కేంద్రప్రభుత్వం ప్రోత్సాహక అవార్డులు ఇవ్వగా, 1992లో ఏపీ ప్రభుత్వం 'బాలబంధు' బిరుదుతో సత్కరించింది. ఆయనకు ఇద్దరు కుమార్తెలు, ఒక కుమారుడు ఉన్నారు.



# నాగళ్ల గురుప్రసాదరావు మృతి

ప్రఖ్యాత సాహితీవేత్త, కేంద్ర సాహిత్య అకాడమి భాషా సమ్మాన్ అవార్డు గ్రహీత నాగళ్ల గురుప్రసాదరావు ఫిబ్రవరి 21వ తేదీన విజయవాడలో మృతి చెందారు. ఆయన విజయవాడ సిద్ధార్థ అకాడమీలో తెలుగు అధ్యాపకునిగా సేవలందించారు. సిద్ధార్థ కళాపీఠం ద్వారా 30ఏళ్లు గా సాహితీ, సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించారు. సంప్రదాయ సాహిత్యంలో దిట్టగా నిలిచారు. ఆయన స్మృతికి వివిధ సాహిత్య సాంస్కృతిక కళారంగ సంస్థలు నివాళ్లు అర్పించాయి.



## శారదానికేతనము .. నిరంతర విద్యా ప్రకాశము

ఉన్నవ దంపతులు గుంటూరులో నెలకొల్పిన విద్యాలయం శారదా నికేతనము. వందేళ్లు పైబడిన చరిత్రతో వేలాదిమందికి విద్యా ప్రదానం చేస్తోంది. వివిధ విభాగాలుగా విస్తరించి, ఇప్పటికీ విద్యాసేవలు అందిస్తోంది.

